

సితార లో
వెరైటీ శీర్షికలు
మీ అభిమాన తారల ఇంటర్వ్యూలు!
అందాల తారల రంగుల
మిమ్మల్ని మీ అభిమాన తారలతో కలిపే 'మీట్ మిస్టర్...' 'మీట్ మిస్...' వంటి శీర్షికలు!
వారం వారం రూ.200/- బహుమతులతో 'సితార పదరంగం'
అగ్రనటులు పాత్రల్ని విజయవంతం చేస్తున్న
సీరియల్!
క వారం
ని చదివితే
కే తెలుస్తుంది!



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. "సమీక్ష" అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై 'చతుర' సమీక్షకు అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫోటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

జూలై 'చతుర' నవల 'తొలిపొద్దు'

సమీక్షకుని పేరు: ....................................................

చిరునామా ....................................................

....................................................

....................................................

....................................................

# 'అంతర్మథనం'పై చతుర సమీక్షలు



**మే నెల 'చతుర'లో ప్రచురితమైన డాక్టరు అల్లూరి రాజకుమారి నవల 'అంతర్మథనం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.**

## ఉత్తమ విశ్లేషణ

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

**లో**కంలో అందరి ఆలోచనలు, ఆశయాలు ఒకలాఉండవు. వైవిధ్యంగల మానవ ప్రకృతి లోని ఒక వికృత మనస్తత్వాన్ని చక్కగా విశ్లేషించి దాని తీరుతెన్నుల్ని, పరిణామాలను ప్రతిభావంతంగా చిత్రించిన నవల డా. అల్లూరి రాజకుమారిగారి 'అంతర్మథనం'. ఈ నవలలోని ప్రధాన పాత్రలన్నీ ఈనాటి సమాజంలో మనకు కనిపించేవే.

మానసిక ఆనందంకోసం, అమాయకులను ఆటపట్టించి, వారి జీవితాలతో చెలగాటాలాడే మనస్తత్వంగల నారాయణ తన నీడను చూసి తానే భయపడి, ఒక సాధుమూర్తిని హత్యచేసే దాకా వెళ్ళాడు. ఆ భయం నుండి విముక్తుడు కాలేకపోవటం, మానసికశాంతిని పొందలేకపోవటం ఎంతో సహజంగా చిత్రీకరించబడింది ఈ నవలలో. నారాయణవంటివాళ్ళు సంఘంలో ఎక్కువగానే కన్పిస్తారు. ఒకవిధంగా వీళ్ళు చపలచిత్తులు, అధైర్యవంతులు. తమకు శత్రువైనవాడిని ఢీ అంటే ఢీ అని ఎదుర్కోవటం వీళ్ళకు సాధ్యంకాదు. కాని పరిస్థితి విషమిస్తే మాత్రం ఏపనిచేయటానికైనా వెనుకాడరు. స్వప్నను పెళ్ళి చేసుకొనే సాధించాలనుకోవటం, తన జీవితరహస్యాలు తెలిసిన స్వామీజీకి తన వాళ్ళు బాగాదగ్గరవుతున్నకొద్దీ పెరుగుతున్న మానసిక అశాంతిని తట్టుకోలేక అతడిని హతమార్చటం ఇందుకు చక్కని ఉదాహరణలు. వీళ్ళ వికృత మనస్తత్వానికి ఇతరులజీవితాలతో చెలగాటాలాడటానికి- నారాయణ చిన్నప్పుడు బడిలో చేసిన చేష్టలు, తనమేనల్లుడు ఓవర్‌హెడ్ వాటర్ టాంక్‌లో దిగిఉంటే దాంట్లోకి నీళ్ళను వదలమనటం మంచి నిదర్శనాలు. మొత్తం మీద నారాయణ పాత్రచిత్రణ సహజంగాఉంది.

నవలలోని ఇతర పాత్రలను ఆదర్శంగా తీర్చిదిద్దారు రచయిత్రి. వర్ధనమ్మ, ఆమెకుమార్తె స్వప్నల జీవితాలు- అవి ఎలా ముగిసినప్పటికీ- నిష్కళంకాలు, ఆదరపాత్రాలు. భారతి, ఆమె అత్త ఆడపడుచుల పాత్రలు కూడా సహజత్వానికి దగ్గరగా ఉండి నవలకు పుష్టినిచ్చాయి.

చక్కని ఇతివృత్తం, సొగసైనభాషతో నవల సాగటం, అసందర్భం, అనవసరమయిన వర్ణనలు లేకపోవటం విశేషం. హృదయానికి హత్తుకునేలా చిత్రీకరించిన సన్నివేశాలు, వాస్తవానికి చేరువగా ఉన్న సంఘటనలు ఈ నవలను ఒక ఉత్తమనవలగా రూపొందించాయి.

—సూర్యదేవర రవికుమార్,
భట్టిప్రోలు.

## చదివించే నవల

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**'అం**తర్మథనం' ఇతర నవలలకన్నా మెరుగేం కాదుగానీ కథన చాతుర్యం, నవలకు ఉండాల్సిన 'చదివింపజేయటం' అన్న లక్షణాలు బాగా ఉన్నాయి. నారాయణలాంటి శాడిస్ట్‌లు సమాజంలో ఎక్కడయినా ఉంటారు. వీరు నిజాలను నిబ్బరంగా ఎదుర్కోలేరు. జీవి





తంలో పైకి రావడానికి తల్లి, చెల్లి- ఎవరయినా సరే వీళ్లకి పావులే. జీవితాన్ని విలాసంగా గడపడమే వీరి జీవితాదర్శం. పరమపద సోపానం అధిరోహించడానికి ఎన్నిమెట్లు ఎక్కాలో, ఎన్ని ఎత్తులు వేయాలో అన్నీ నారాయణ వేశాడు. చివరకు తన తప్పులను స్వామీజీకి వెల్లడించి శాంతి పొందుతాడు. స్వస్థుడైన వెంటనే తన రహస్యాలన్నీ తెలిసిన స్వామీజీ తన గుట్టు బట్టబయలు చేస్తారన్న అనుమానం అతన్ని పీడించడంతో స్వామీజీని హత్య చేయడానికి కూడా వెనుకాడడు. తానెలాంటి చిత్త ప్రవృత్తిగలవాడో ఇతరులూ అదేరీతిగా ఉంటారని భావించే సంకుచిత మనస్కుడు నారాయణ. మొత్తంమీద నవల అంతటికీ జీవం ఉట్టిపడే పాత్ర ఇదే. పాఠకులకు కోపం, జాలీ కూడా కలిగించేవిధంగా ఉంది నారాయణ పాత్ర/చిత్రణ.

స్వప్నని ఆదర్శనాయికగా, భారతిని సతీమ తల్లిగా మలచాలన్న ప్రయత్నాలు తెలుగు సినిమా బాణీలో ఉన్నాయి. విజ్ఞులైన పాఠకులు ఆశించేవి ఇలాంటి రచనలు కాదు. అసలీ నవలద్వారా రచయిత్రి చెప్పాలనుకున్నదేమిటి? ఒక డాక్టరుగా, వైదుష్యం ఉన్న సాహితీ పిపాసిగా పాఠకులలోని అజ్ఞానాన్ని పారదోలగల్గే ఇతివృత్తాన్ని తీసుకొని రాస్తే బాగుండేది.

—శిష్టా శారదాదేవి,
హైదరాబాదు.

## సినీమార్కు కథనం

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

**మే** నెల 'చతుర' నవల 'అంతర్మథనం' సినిమా కథలా ఉన్న విషయాన్ని సూటిగా చెప్పడంలో రచయిత్రి విజయం సాధించారు. కథనం బాగుంది. నవలలో పాఠకులు 'అయ్యో' అనుకునే సంఘటనలు కోకొల్లలు. వాటిని హృదయానికి హత్తుకొనేలా నవల చివరివరకు చదివేలా రాయగల్గారు రచయిత్రి.

స్కూల్లో గోపాల్ తన చిలిపితనానికి బలై మరణించినప్పుడు నారాయణ ఆనందపడలేదు- పైగా విచారపడ్డాడు. అంటే అప్పటి నుండి అలాంటివి చేయకూడదని స్వతహాగా తెలుసుకునేట్లు చేయగల సంఘటన అది. కాని అలా జరగలేదు.

విద్యార్థుల ర్యాగింగ్‌ను ఎదుర్కోవడానికి ఒక్క 'స్వప్న'నైనా ధైర్యస్తురాలిని చేయడం అభినందనీయం. కాని ఆమెకు తోడుగా ఒక్కరూ లేకపోవడం విచారకరం. చేతిలో అధికారముండికూడా తన కళ్ళముందు జరిగే విద్యార్థుల అల్లరి ఆపలేనటువంటి ప్రిన్సిపాల్ పాత్ర సినిమాటిక్‌గా ఉంది. నవలలో జీవం ఉట్టిపడే పాత్ర స్వప్న. అలాంటి పాత్రను అర్థాంతరంగా వదిలివేయడం బాగుండలేదు. అలాగే రంగారావు పాత్ర.

నారాయణచేసిన 99 పాపాలు మూడో కంటికి తెలియవు. వాటికి సాక్ష్యాధారాలుండవు. ఉన్నా తప్పించుకోగలడు అన్నట్లుంటుంది. కాని 100వ పాపంగా స్వామీజీని పబ్లిగ్గా హత్యచేసి పట్టుబడతాడు. ఎందుకో మరి నారాయణ స్వామీజీని చంపడానికి తగిన పథకం వేసుకోడు. పోనీ జీవితంపట్ల విరక్తికల్గి అలా చేశాడని చెప్పడానికీ లేదు. అసలు స్వామీజీని హత్య చేయాల్సిన అవసరం లేదేమో! తన పాపాలు మూడో కంటికి తెలిసాయన్న మానసిక క్షోభే అతనికో పెద్దశిక్ష.

'అంతర్మథనం' తర్వాత హాలాహలాన్ని పుట్టించి, దానికి స్వామీజీని బలి చేశారు. కాని అమృతం పుట్టించి, నారాయణ జీవితంలో మార్పు తెచ్చి ఉంటే, అప్పుడు నారాయణ సమాజానికి ఉపయోగపడేవాడేమో!

— మ్యాక మధుసూదన్,
సంగారెడ్డి.

## ప్రయోజనంలేని మథనం

**(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

'**అం**తర్మథనం' రచయిత్రి ఏ ప్రయోజనాన్ని ఆశించి రాసిందో అర్థంకావడంలేదు. నారాయణ మనస్తత్వాన్ని బాల్యంనుండి ఇతరులకు హాని చేయడంద్వారా సంతోషాన్ని పొందేవానిగా రూపొందించడం, చిన్నతనంలో అలాంటి మనస్తత్వం కలిగినవారు పెరిగి పెద్దవారైంతర్వాత నారాయణలాగ ప్రవర్తిస్తారనా

రచయిత్రి ఉద్దేశం? పాఠశాలలో విద్యార్థులు చేసే చిన్నచిన్న తప్పులకు ఉపాధ్యాయులు విద్యార్థుల్ని చనిపోయేవిధంగా కొట్టడం సాధారణంగా జరగదు. రచయిత్రి దీనికి వివరణ ఇవ్వలేదు. ఎప్పుడైనా, ఎక్కడైనా ఇలాంటి సంఘటన జరిగినట్లయితే దానిని ఉదహరిస్తే బావుండేది. కాలేజీ వాతావరణంలో నారాయణ ప్రవర్తన అసహజంగా ఉంది. రచయిత్రి స్వప్న పాత్రద్వారా కాలేజీల్లో చదివే అమ్మాయిలకు ధైర్యం చెప్పాల్సిందిపోయి ఎవరైనా కాలేజీలో స్వప్నలాగ ఆత్మాభిమానం కనబరిచి ఆడపిల్లల్ని అల్లరిచేసే రోమియోలకు బుద్ధిచెప్పే ప్రయత్నం చేస్తే స్వప్నకు ఎదురైన పరిస్థితులే ఎదురౌతాయన్నట్లుగా చెప్పడం హాస్యాస్పదం. అయినా స్వప్న పాత్రను మధ్యలోనే ఆపివేయడం సంతృప్తికరంగాలేదు.

నారాయణ అనారోగ్యసమయంలో అతని మనఃస్థితిని రచయిత్రి చక్కగా చిత్రీకరించింది. నారాయణలాంటి మనస్తత్వం కలిగినవారికి సాధారణంగా షాక్‌వల్ల మాటపడిపోదు. ఎందుకంటే హత్యచేయడం అతనికది మొదటిసారికాదు. తన సొంత అక్కకొడుకునే, పసివాడు అనే జాలి అయినా లేకుండా ఆస్తికోసం ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా హత్యచేశాడు. చుక్కమ్మను స్నేహితుల ప్రోద్బలంవల్ల అనుభవించి చనిపోయిన తర్వాత బావిలో పడవేశాడు. అలాంటి వాడికి స్వామీజీని హత్య చేస్తే షాక్‌వల్ల మాటపడిపోయిందని సూటిగా చెప్పకపోయినా శిక్షాకాలంలోనూ, తర్వాత కూడా నారాయణ మళ్ళీ నోరు విప్పలేదు అని చెప్పడం సబబుగాలేదు.

ఊరుకొక దొంగస్వాములవారు వెలుస్తున్న ఈరోజుల్లో స్వామీజీ పాత్రకు దైవత్వాల్ని ఆపాదించే ప్రయత్నంలో విఫలత కనిపిస్తుంది.

అయితే చివరివరకు ఉత్కంఠతో చదివించగలిగే విధంగా రాయటంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు.

—ఎ. హరిప్రసాద్,
హనుమకొండ

## వాస్తవాల చిత్రీకరణ

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**నే**టి సమాజంలో కన్పించే కుహనా పెద్దమనుషులకు ప్రతీకే అల్లూరి రాజకుమారిగారి 'అంతర్మథనం'లోని నారాయణ. ఎందరో నారాయణులు మానవత్వాన్నే బలిపెట్టి అవినీతి పారాయణంచేస్తూ బలహీనులను దరిద్రనారాయణులుగా మారుస్తున్నారనేది నిజం. ఆ నారాయణుల రసవత్తర కథనం 'అంతర్మథనం'.

కథలోని ముఖ్యపాత్ర నారాయణలో అడుగడుగునా సాధారణ సినీ విలనిజం స్ఫురిస్తూ ఉంటుంది. అయితే కథ చదువుతున్నంతసేపూ ప్రతి సంఘటనలోనూ నిజజీవిత నారాయణులు స్మృతిపథంలో కన్పించడం పాత్ర చిత్రీకరణలోని వాస్తవికతకు తార్కాణం.

మనుమలుచేసిన దేవుడు, స్వామీజీ పాత్రను ప్రజల అమాయకత్వాన్ని ఎత్తి చూపుతూనే దాన్ని కథకోసం బాగా వాడుకోగలగడంలో రాజకుమారిగారు కృతకృత్యులయ్యారు. అయితే ఎంతో ధైర్యం, స్వాభిమానం, చురుకుదనం, సమర్థత కలిగిన స్వప్నకు కథ మధ్యలోనే టాటాచెప్పి తనదారికి తనను వదిలేసారు రాజకుమారిగారు. అన్ని లక్షణాలున్న స్వప్న ఏమీచేతగానిదానిలా అన్యాయాన్ని సహిస్తూ గడపగలదా అన్నదే ప్రశ్న? సగటు భార్యలక్షణాలను భారతిలో ప్రతిబింబజేయడం బాగానే వుంది.

చావు బతుకుల అంచులలో సెంటిమెంట్లకు లొంగడం ఎంతటివారికైనా తప్పదేమో! అందుకే నారాయణ తనకోసం, పరలోకంలో తన మనుగడకోసం తన పాపాలన్నీ చెప్పుకొని ప్రశాంతతపొందాలనుకోవడం వాస్తవికంగా ఉంది.

అయితే స్వామీజీవలన హాని జరుగుతుందని భయపడినప్పుడు, అంతవరకూ ఎన్నో తప్పుల్ని ఎవరికీ దొరకకుండా చెయ్యగలిగిన తెలివైన నారాయణ తనే స్వయంగా పట్టుపడతానని తెలిసీ స్వామీజీని హత్యచెయ్యడంలో ఔచిత్యం బోధపడదు. అంతవరకూ ఆ పాత్రకున్న స్వభావానికి ఆ సంఘటన




పూర్తి విరుద్ధంగా కనిపిస్తుంది.

చివరికి నారాయణకు విధించబడిన స్వల్ప శిక్ష కళ్ళులేని న్యాయవ్యవస్థ లోపాన్నీ ఇంత జరిగినా కనీసం నిండుమనస్సుతో పశ్చాత్తాపవ డని నారాయణ క్రూరప్రవృత్తినీ సూచిస్తాయి. ఏమైనప్పటికీ ఇది చదువరులను ఆకట్టుకున్న కథనం అనడంలో సందేహంలేదు.

—గూడూరి వాణీకృష్ణ,
పెద్దపవని.

## సందేశం ఏమిటి?

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నవల ఆసాంతం చదివాక అశాంతికి గురైన నాకు కలిగిన మొదటి ప్రశ్న 'అంతర్మథనం' రచయిత్రి ఏ ఉద్దేశంతో ఈ నవల రాసారని.

కథకైనా... నవలకైనా... సినిమాకైనా ఓ సందేశం వుంటుంది. నవల నడవడానికి సరైన పునాదిగాని... ఎక్కడా పటుత్వంగాని కనిపించదు. జల్లెడలా ఎక్కడ చూసినా లూప్ హోల్స్‌తో అర్థంపరమార్థంలేని కథ పెరిగి పెద్దదై చివరికి నవలగా మారింది.

నారాయణ పాత్ర నిజాయితీతో కూడిన పశ్చాత్తాపం ప్రకటించి వుంటే (ఎక్కడైనా ఏ చిన్న సన్నివేశంలోనైనా) నవలకు అంతర్మథనం టైటిల్ సరిపోయేదే. కానీ నారాయణని మొదట్లో కథకి హీరోగా తరువాత ఇష్టం వచ్చిన ధోరణిలో విలన్‌గా మార్చేశారు. ఇక సరోజ, భారతి, శాంతమ్మ పాత్రలు కలగలిపి మరో వంటింటి నవలగా మార్చాలని, ప్రయత్నం చేయడం వృధా! రచయిత్రికి నచ్చినప్పుడు మంచిగానూ, మరీ కథ నడవడానికి కష్టం అనిపించినప్పుడు చెడ్డగానూ చూపించి రచయిత్రి ఇష్టాఇష్టాలపై ఆధారపడి "కిల్" చేయబడిన పాత్ర భారతి.

స్వామీజీ పాత్ర— ఆ పాత్రని చంపి నవలా ప్రారంభానికి వాడుకోవడంలో 'సస్పెన్స్ క్రియేట్‌చేసి నవలను చదివించేస్తాం' అనుకునే ఈనాటి రచయిత(త్రు)లు చేసే మామూలు ప్రయోగానికి ఉపయోగపడింది. అంతే!

—నందూరి బాలాజీ ప్రసాద్,
తిరుచానూరు.




★ "చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో వారి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్నివదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.



# చతుర కత్తిరి



## సేల్స్! సేల్స్!!

జనంతో కిక్కిరిసి ఉంది షాపు. అమ్మకాలు జోరుగా సాగుతున్నాయి. చుట్టూ చూస్తూ నెమ్మదిగా అడుగులేయసాగాను మెయిన్‌హాల్లోకి. నన్ను చూసిన ఓ సేల్స్‌మన్ చిరునవ్వుతో లోపలికి ఆహ్వానించాడు.

"మీకు ఏ టైప్ వరుడు కావాలో చెబితే చూపిస్తాను మేడమ్! మా దగ్గర అన్ని రకాల వారూ ఉన్నారు. చదువుకున్నవాడా? అందగాడా? ధనికుడా? ఎంతలో కావాలి? మీరెవరివల్లనైనా ప్రత్యేకంగా ఆసక్తిగా వున్నారా? చెప్పండి!" అతను చెప్పిన లిస్టులో 'ధనికులు' ఉండటం నాకు ఒకింత ఆశ్చర్యాన్ని కలిగించింది. "ధనవంతులు కూడా అమ్మకానికి సిద్ధపడతారా" అన్నాను విస్మయంగా.

"ఔను మేడమ్! ధనికులైతే మాత్రం వచ్చే రాబడిని వదులుకుంటారా? వారిదిపై అంతస్తుగనుకే కట్నం, హంగులూ అధికంగా వుండాలనుకుంటారు" చిన్నగా నవ్వుతూ అన్నాడు షాపతను.

"నరేగానీ! దయచేసి ఓ మంచికుటుంబానికి చెందిన చదువుకున్న అబ్బాయిని చూపిస్తారా మా చెల్లికోసం."

"ఇలా రండి మేడమ్! ఇటువైపంతా డాక్టర్లున్నారు. ఖరీదెక్కువే అనుకోండి. అయితేనేం? డాక్టర్ గదా! వెల ఎక్కువ పెడితే సరుకూ బాగా మన్నుతుందనే విషయం మీకూ తెలునుగదా!"

"రేటెంత?"

"అయిదు లక్షల రూపాయలు మాత్రమే మేడమ్! వరుడి తండ్రి మెడికల్ కాలేజీ కాపిటేషన్ ఫీజ్‌కిగాను రెండులక్షలు కట్టాడు. తన పెట్టుబడిపై వడ్డీ, లాభం పొందాలని ఆ తండ్రి అనుకోవటం సమంజసమే గదండీ! ఇంతెందుకు పోయినవారమే ఓ ఎం.డీ.ని 15 లక్షలకి అమ్మేశాం. కట్నంతోపాటు ఓ ఏర్‌కండిషన్డ్ ఫ్లాటూ, కారూ కూడా ఇచ్చారు" చెప్పాడు సేల్స్‌మన్ ఉత్సాహంగా.

"డాక్టర్లొద్దు గానీ, ఇంకాస్త చవకలో చూపించు బాబూ ప్లీజ్?" అన్నాను.

"తప్పకుండా మేడమ్! ఇంజినీర్లూ, చార్టర్డ్ అక్కౌంటెంట్లూ, ఆర్కిటెక్ట్‌లూ, ఎం.బి.ఏలూ ఉన్నారు. వీరి ఖరీదు 1 నుండి 3 లక్షల వరకు ఉంది."

"మా చెల్లి సి.ఏ చేసింది గాబట్టి చార్టెర్డ్ అక్కౌంటెంట్ అయితే బాగా మ్యాచ్ అవుతాడు. అతన్నే చూపించు. నరేగానీ ఏదన్నా డిస్కౌంట్లో, రిడక్షన్ సేల్సో లేవా" అన్నాను బేరమాడే ప్రయత్నంలో.

"సారీ మేడం! ఆడపిల్లల విద్యార్హతలు లెక్కలోకి రావు" చెప్పాడతను, కాసేపాగి "వధువు చదువుకుందిగదాని కన్సెషన్లేవీ వుండవు. పైగా మేం రేట్లెక్కువ చెప్పి తగ్గించే శ్రమ పెట్టుకోం. మావి అన్నీ ఫిక్స్‌డ్ రేట్లు.



పైసా తగ్గదు" అన్నాడతను.

"బిజినెస్‌మేన్ల రేటెలా ఉంది" అడిగాను.

ధరలడగటం, బేరమాడటం తప్ప చకచకా నిర్ణయించుకుని కొనే బావతులా లేదే అనుకున్నాడేమో అతను విసుగ్గా చూశాడో క్షణం!

మళ్ళీ ఏమనుకున్నాడోగానీ,

"బిజినెస్‌మాన్ అయితే 75 వేలకే దొరుకుతాడు. సింపిల్ అండ్ స్వీట్! తీసుకోండి."

"బాగుంది... బాగుంది... అతన్నేకొంటాను" కాస్సేపయ్యాక ఓ కుర్రాడిని తెచ్చి నా కప్పగిస్తూ "ఇదిగోనండీ ఇతనిహ మీ వాడే" అన్నాడు హడావిడిగా బిల్లు రాస్తూ.

బిల్లు ఎనభైవేలకి చూసి ఆశ్చర్యపోయాను.

"ఇదేమిటి? ఇతని వెల 75 వేలు అన్నారుగా" అన్నాను నిలదీస్తూ.

"సారీ మేడం! వేలంపాట పాడినందుకు మిగిలిన ఆ అయిదువేలు మా కమిషన్ అనుకోండి లేదా సేల్స్‌టాక్స్ అనుకున్నా సరే..."

— జ్యోతిరాణి

## బ్యాంక్ లోన్

"దండాలు దొరా"

"ఎవరున్నువ్వు?"

"నన్ను కోయమల్లు అంటారు దొరా!"

"ఏం కావాలి నీకు?"

"మీ బ్యాంకుల్లో మా కోయోళ్ళకు అప్పులిస్తారంటగద్దొరా?"

"అవును ఇస్తాం... అయితే?"

"నాక్కూడా అప్పుకావాలి దొరా"

"అప్పిస్తే ఏం చేసుకుంటావు?"

"కోళ్ళఫారం పెడతా దొరా"

"వెరీగుడ్! ప్రభుత్వం మీ కోసం అందిస్తున్న ఈ గొప్ప గొప్ప పథకాలను మీరు గుర్తిస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. మీలో ఇంత చైతన్యం..."-

"పైసలెప్పుడిస్తారు దొరా?"

"తప్పకుండా ఇస్తాం! ముందు అప్లికేషన్ ఫారం ఫిలప్ చేయాలిగా... కొన్నిరోజులు పడుతుంది"

"నాకు జల్దీ ఇయ్యాల దొరా! లేకపోతే శానా ఇబ్బందయిపోతాది"

"అలాగే ఇస్తాం. ఇంతకూ కోళ్లఫారం ఎలా కట్టాలి? కోళ్ళను ఎలా పెంచాలి? వాటి గుడ్లను ఎలా అమ్ముకోవాలి- మొదలైన వివరాలు ఏమైనా తెలుసుకున్నావా?"

"నాకు తెల్వవు దొరా"

"మరి ఏమీ తెలవకుండా కోళ్ళఫారం ఎలా పెడతావు?"

"అవన్నీ నేను ఎందుకు తెలుసుకోవాలి దొరా?"

"మరి కోళ్ళనెలా పెంచుతావు?"

"పెంచేదేందిదొరా! పెరిగినవాటినే కొనుక్కొస్తా"

"అదేమిటీ... అలాగైతే గిట్టుబాటు కాదనుకుంటానే! అయినా వాటిని ఏం చేసుకుంటావూ?"

"ఎందుకేమిటీ... పోలీసోళ్ళకియ్యొద్దూ!"

"పోలిసోళ్ళకా...!"

"అవ్‌దొరా... మా గూడెంకాడ పోలీస్ క్యాంపెట్టినారుగదా! ఇపాటికే మా కాడున్న కోళ్ళన్నీ తినేసారు. ఇంకా తెమ్మని సతాయిస్తా వుండారు. మరి వాళ్ళకియ్యాలంటే మా గూడానికి కోళ్ళఫారం వుండాలిగద్దొరా!"

— జి. రామాంజనేయులు



కవరుపేజీ ఫోటోగ్రాఫరు: అరుణ్ బేసేకర్

# బుష్ టివి

ఎలెక్ట్రానిక్ కలర్ ప్రిఫరెన్సు కంట్రోలుకల్గినది.



CTV 9774

ఇప్పుడు
గొప్ప తగ్గింపు
ధరలలో...

AUTHORISED DEALERS:- **innovations**

ELECTRONICS & HOME APPLIANCES – MOULDED FURNITURE & LUGGAGE

విజయవాడ: చల్లపల్లిబంగళా, ఏలూరు రోడ్. ఫోన్: 64024 ＊ బీసెంట్ రోడ్, గవర్నర్ పేట, ＊ బకింగ్‌హాంపేట పోస్టాఫీస్ వద్ద, జైహింద్ టాకీస్ రోడ్, గవర్నర్ పేట ＊ హెడ్‌పోస్టాఫీస్ ఎదురుగా, వన్‌టౌన్.

గుంటూరు: బ్రాడీపేట, మెయిన్ రోడ్, ఫోన్: 32103.

రాజమండ్రి: పాతకూరగాయల మార్కెట్ డౌన్, మెయిన్ రోడ్, Ph: 4696 ＊ ఎల్.ఐ.సి. ఆఫీస్ ఎదురుగా, మెయిన్ రోడ్.

గుడివాడ: ఏలూరు రోడ్డు, ఫోన్: 2400.

నెల్లూరు: 15/328, ట్రంక్ రోడ్, ఎ.సి.బిల్డింగ్స్ ఎదురుగా, Ph: 4024, O.K. కాంప్లెక్స్, పినాకిని సూపర్ మార్కెట్ ఎదురుగా.

భీమవరం: బ్యాంక్ ఆఫ్ బరోడా ఎదురుగా, ఉండి రోడ్,

ఒంగోలు: కర్నూలు రోడ్, ఫోన్: 2552 (P.P)

విశాఖపట్నం: 29 & 30, టి.యస్.ఆర్ కాంప్లెక్స్, స్టేషన్ రోడ్, Ph: 61896.

విజయనగరం: 2 & 3, బాలాజీ కాంప్లెక్స్, యం.జి.రోడ్, ఫోన్: 2984

హైదరాబాద్: రిట్జ్ హోటల్ రోడ్, ఆదర్శ నగర్, Ph. 233655. ＊ పోస్టాఫీస్ ఎదుట, చిక్కడపల్లి ＊ గ్రామర్‌స్కూల్ ఎదురుగా, అబిడ్స్.

చీరాల: S.B.I. ఎదుట, దర్బార్ రోడ్.

వరంగల్: కృష్ణకళా మందిర్ ఎదుట, హోటల్ ఏకశిల ప్రక్కన.

# చతుర

సంపుటి: 11 జూలై 1988 సంచిక: 6


## నవలా పరిచయం

"పదిమందికోసం చనిపోగల అదృష్టం ఏ కొద్దిమందికో లభిస్తుంది శారదా! నేను వారిలో ఒకన్నైతే నా జీవితానికంతకంటే సార్థకత ఉంటుందనుకోను" కాంతినిండిన కళ్ళతో దృఢంగా అన్నారు మాస్టారు.

"అవేంమాటలండీ మంగళవారంపూట" అంటూ మంగళసూత్రాలు కళ్ల కద్దుకొంది ఆయన అర్ధాంగి.

ప్రతిమనిషీ తన స్వప్రయోజనాలకోసం పరుగులు తీస్తూ, తోటిమనిషిని గురించి పట్టించుకొనే సమయం, సదుద్దేశ్యం, ఏ మాత్రంలేని నేటి యాంత్రికయుగంలో తనగురించికాక తన ఊరి ప్రజల బాగోగుల గురించి ఆలోచించే వాళ్ళు, తపించేవాళ్ళు ఉండటం చిత్రమే!

ఊరికిపట్టిన గ్రహణాన్ని వదిలించడానికి ఒక మహాయజ్ఞం తలపెట్టిన ఓ ఆదర్శమూర్తి తన పల్లెప్రజల చీకటిజీవితాలలో 'తొలిపొద్దు' పొడిచేలా ఎలా చేయగలిగాడు?

ఆ ప్రయత్నంలో ఆయన ఎదుర్కొన్న అవరోధాలు, సమస్యలూ ఎలాంటివి? గ్రామీణ వాతావరణాన్ని కళ్ళకు కట్టేలా చిత్రించిన సింహప్రసాద్ 'తొలిపొద్దు' జులై 'చతుర' సమగ్రనవల.



ఆకాశం ప్రశాంతంగానే వుంది.

గాలి ఎప్పట్లా వీస్తూనే వుంది.

ప్రకృతి పిసరంత మార్పు కూడా లేకుండా ఏమీ జరగనట్టే, మామూలుగానే వుంది.

ఎప్పుడూ సందడిగా ఉండే మాస్టారింట్లో మాత్రం తుఫాను తర్వాతి భయంకర ప్రశాంతత ఆవరించివుంది.

మాస్టారి గుండెల్లో తుఫాను చెలరేగుతూ వుంది. బడబాగ్నులు బద్దలవుతూ వున్నాయ్.

కళ్ళల్లో కన్నీటి అలలు కదుల్తోంటే కొడుకు వంక బాధగా, వేదనగా అపరిచితుణ్ని చూసినట్టు చూశారు. అసంభవం సంభవమయ్యిందని చెప్పినవారి వంకచూసినట్టు చూశారు.

చూసి చూసి నిట్టూర్చారు.

లేచి భారంగా అడుగులేస్తూ వెళ్ళి వంకెకి తగిలించివున్న చొక్కా అందుకున్నారు.

"ఏమండీ..." ఆర్తిగా అంది శారదమ్మ.

ఆమె కళ్ళనిండా నీళ్ళు!

అనునయంగా ఆమె భుజాలునొక్కి శుష్కహాసం చేశారు.

తప్పుచేసినవాళ్ళా తలొంచుకొని కూర్చునున్న కొడుకువంక చూస్తూ అన్నారు... "తప్పదు శారదా- రెక్కలొచ్చిన పక్షులు ఎంత త్వరగా పాతగూడుని వదలి ఎగిరిపోదామా అని ఉవ్విళ్ళూరుతుంటాయి. ఏదోరోజున అవి ఎగిరిపోక తప్పదు- కొత్తగూడు కట్టుకోక తప్పదు. వాళ్ళని బంధాలతో, బంధుత్వాలతో కట్టి వుంచాలని వ్యర్థప్రయత్నాలు చెయ్యడం అనవసరం. నాకు నువ్వు- నీకు నేనూ- మనకి వూరివాళ్ళూ ... మన బతుకులు గడవడానికి చాలు శరదా!"

కన్నీరు ధారలుగా బుగ్గలమీంచి కారుతోంటే బొమ్మలా భర్తనే చూస్తూండిపోయింది.

ఆ మాటలుచ్చరించిన పెదాలనీ, నాలుకనీ కాదు గుండెలోతుల్ని తడుముతోందామె చూపు. అక్కడెన్ని అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయో తెలుసు. అందుకే మౌనంగా సానుభూతిగా కళ్ళప్పగించి వుండిపోయిందామె.

"ఈ సంగతింక మర్చిపో. అలా గోదారి ఒడ్డుకి వెళ్ళొస్తాను"

తలాడించిందామె. ఇంకా ఎక్కువసేపు ఇంట్లో వుంటే తీవ్రవేదనల రాపిడి కాయన గుండె గోడలు తట్టుకోలేకపోవచ్చు. అలా షికారువెళ్తే కాస్త సర్దుకోవచ్చనిపించింది.

చెప్పులు తొడుక్కుని చేతికర్రతో బయటకి నడిచారు మాస్టారు.

దారిలో ఎదురుపడిన గ్రామస్తులాయన్ని విస్మబోతూ చూశారు. ఎప్పుడూ నవ్వుతూ వుండే మాస్టారు, నోరారా పలకరించే మాస్టారు గంభీరంగావున్నారు. నడుస్తోన్న వేదనాపర్వతంలా వున్నారు.

ఏదో దారుణమైన దెబ్బ తగిలి వుంటుందనుకుంటూ పక్కకి తొలగి దారిచ్చారు గౌరవపూర్వకంగా.

ఒకచోట అప్రయత్నంగా మాస్టారి కాళ్ళాగిపోయాయి.

ఆయన చూపులు గోపాలంగారి అరుగువైపు తిరిగాయి.

ఆయన కళ్ళల్లో బాధ సుళ్ళుతిరిగింది.

ఆ అరుగుమీద నిత్యం చతుర్ముఖ పారాయణం జోరుగా సాగుతూనే వుంటుంది. ఆ పక్కనే చిన్న టీస్టాల్ వెలిసిందంటే పేకాట ఎంత ముమ్మరంగా సాగుతూ వుంటుందో ఎవరైనా ఊహించుకోవచ్చు. మూడు నాలుగు జట్లుగా కూర్చుని పేకాడుతూంటారక్కడ. వూరికే కాదు డబ్బు పెట్టి మరీ ఆడుతూంటారు. పిల్లలు కూడా చిన్న చిన్న జట్లుగా చేరి ముక్కలు కలుపుతూంటారు. తర్వాత్తర్వాత డబ్బుపెట్టి ఆడటానికి అది ట్రైనింగుగా ఉపయోగపడుతోంది వాళ్ళకి!

కొందరు దురలవాటనే వూబిలో పూర్తిగా కూరుకుపోతారు. ఎన్నో ఆర్థిక కష్టనష్టాలకి గురవుతూ కూడా పిల్లల్ని ఆ దరిదాపులకి రావొద్దని వారించరెవ్వరూ. అంతకంటే చిత్రమేమిటంటే- తండ్రీకొడుకులు ఎదురెదురుగా కూర్చుని డబ్బుతో పేకాడుతూంటారు.

పనిలేని పెద్దలేగాక, చక్కని భవిష్యత్తున్న కుర్రాళ్ళు కూడా ఆ వూబిలో కూరుకుపోతున్నారనే మాస్టారి బాధ... ఆవేదన!

"పిల్ల కాయలూ - మీ మాస్టారి చూపువ

డిందిరా'' ఒకరు నవ్వేరు.

"పెద్దాయన... పోన్లేబాబాయ్" ఒకప్పుడు మాస్టారి దగ్గర చదువుకున్న కుర్రాడన్నాడు.

"అదేంటిరోయ్... ఆయనేమో ఊరినీ జనాన్నీ మార్చెయ్యాలని చూస్తున్నారు."

"చేతిలో మంత్రదండం వుందనుకున్న ఎర్రివాడే దభీమని చతికిలబడ్డాడు. ఇక ఇలాటోళ్ళు లెక్కా పత్రమా!"

"అలా తీసిపారెయ్యకండి మరి - మా మాస్టారు ఈ కాలపు మాస్టార్లలాంటి వారుకారు. ఆయన్దంతా గురుకులం టైపు. అసలు మాస్టారిల్లే ఓ ఆశ్రమం"

"అవునవును... ఆ ఋషికి తగ్గ శిష్యులే మీరు" వగలబడి నవ్వేరొకరు.

మిగతావాళ్ళు శ్రుతికలిపారు. ఆ మాజీ శిష్యుడి మొఖం కించిత్తు ఎర్రబడింది. అదికనబడకుండా జాగ్రత్తపడి తనూ నవ్వేశాడు వెర్రిగా.

గాఢంగా నిట్టూర్చి కదిలారు మాస్టారు.

వ్యవసాయదారులతో వచ్చిన చిక్కే ఇది. మొత్తంమీద ఏడాదికి ఆరేడు నెలల పని వుంటుంది- రైతులకీ, కూలీలకీ. మిగతాకాలమంతా ఖాళీయే. ఆ సమయంలో ఉపయోగకరమైన పనులు చేసుకునేవారు తక్కువ. పేకాటలాంటి వ్యసనాలతోనూ, రాజకీయాల కబుర్లతోనూ రోజులు దొర్లించేస్తుంటారు చాలామంది.

అందుకే గాంధీజీ ప్రతి కుటుంబానికీ ఓ రాట్నం వుండాలన్నారు. ప్రస్తుత కాలాన్నిబట్టి అదికాకపోయినా ఏదో ఒక చిన్నగృహపరిశ్రమో పాడిపరిశ్రమలాంటి ఉపవృత్తో వుండటం ఎంతైనా అవసరం. అవి వ్యవసాయదారులకి ఆర్థిక పుష్టి చేకూర్చడమేగాక గ్రామసీమల సౌభాగ్యానికి చక్కని సోపానాలవుతాయి కూడా.

కానీ ఈ గొడవంతా ఎవరిక్కావాలి?

తమ బాగేమిటో జనానికి తెలీదు. చెప్పే నాయకులూ, ప్రభుత్వమూలేరు. తనలాటివాళ్ళు చెబితే 'పిచ్చోడులే' అనుకుంటారు తప్ప ఆలోచించరు.

వాళ్ళలో మార్పు తీసుకురావటం ఎలా? ఎలా?

మాస్టారి మస్తిష్కంలో తీవ్ర మథనం!
గోదావరి గట్టెక్కారు.

చల్లగాలి ఆయన శరీరాన్ని ప్రేమగా నిమిరింది.

కొంచెం ముందుకెళ్ళి గోదావరి ఒడ్డున ఇసుకలో కూర్చున్నారు.

గోదావరి నిండుగాలేదు. అసలీ మధ్య ఎక్కువగా పొంగి ప్రవహించటంలేదు. ఎందుకనో రాన్రాను నదిలో నీరు తగ్గిపోతోంది. నదిమధ్యలో ఎన్నో ఇసుకమేటలు- వచ్చికబయళ్ళు!

పశువుల్ని ఆ బయళ్ళల్లో వదిలి కాపర్లు ఆడుకుంటున్నారు. కొందరు కుర్రాళ్ళు నదిలో ఈత కొడుతున్నారు.

ఒక్కరికీ ఒంటిమీద సరైన బట్టలేదు. ఒక్కరూ బలంగా, ఆరోగ్యంగా లేరు. ఒక్కరి పొట్టలోనూ నాలుగక్షరాలు లేవు.

ఎన్నో ఏళ్ళుగా తను తీవ్రంగా ప్రయత్నిస్తూనే వున్నాడు. అయినా తమ పిల్లల్ని అందరూ బడికి పంపించటంలేదు. వాళ్ళ కారణాలు వాళ్లకుండొచ్చు. అయినా విద్య విలువ గ్రహించలేకపోతున్నారంటే లోపం ఎక్కడుంది?.

చీకటి పడేవరకూ కూర్చుని లేచారు.

ఒడ్డునున్న సీతారాముల వారి కోవెలలో గంటలు మోగాయి.

అటు అడుగువేశారు.

ఆ గుడి అక్కడ కట్టాకే ఆ వూరు పుట్టి పెరిగిందిట. ఆ దేవుడిపేరు మీదుగానే ఆ వూరిని సీతారామపురం అంటారు. సీతారాములు ఆ వూరి ఆరాధ్య దైవాలు. ఏఇంట్లో ఏచిన్న శుభకార్యం జరిగినా ముందాగుడిలో కొబ్బరికాయ కొట్టాల్సిందే.

ఒకప్పుడాదేవాలయమెంతో వైభోగంగా వుండేది. శ్రీరామనవమికి తొమ్మిది రోజులపాటు పెద్దపెట్టున ఉత్సవం చేసేవారు. ఇప్పుడదంతా తగ్గిపోయింది. దేవాలయం పాడుబడింది. ఉత్సవాలు కనుమరుగయ్యాయి.

ఎంచేతని ప్రశ్నిస్తే గుడికి ఆదాయం లేదంటారు గ్రామపెద్ద, సర్పంచ్, ఆలయధర్మకర్త అయిన రాయుడు.

ఉండటానికి దేవాలయానికి భూమి చాలానే వుంది. కొన్ని తోటలు కూడా వున్నాయి



చతుర ...

అయినా వంటేమీ రావట్లేదంటారాయన. ఆయన్ని నిలదీయగలిగిన వాళ్ళింకా పుట్టలేదు ఆవూళ్ళో.

ఒకప్పుడు సిరిసంపదలతో పచ్చనిపైరుల్తో నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లిన గ్రామం ఇప్పుడు ఎండిమోడువారిన చెట్టులా అయిపోయింది. ముఠాలు, కక్షలు, విద్వేషాలు, దురలవాట్లు, అవిద్య, అప్పులు, ఆడంబరాలు- అన్నీ కలిసి వూరిని అస్తిపంజరం చేసి వదిలాయి

ఆ గ్రామాన్ని రెండున్నర దశాబ్దాల నుంచి రాయుడు ఏకఛత్రాధిపత్యంగా ఏలుతున్నాడు.

ఊరికి ఒక రోడ్డు లేదు. ఆసుపత్రిలేదు. బడికి మంచి భవనంలేదు. జనానికి చేతి నిండా పనిలేదు. పండిన పంటని ఇంటికి చేర్చుకునే అవకాశంలేదు.

మాస్టారు నిట్టూర్చారు.

నైవేద్యారాధనలు లేక దుమ్ముకొట్టుకుపోయి వున్న సీతారాముల విగ్రహాల వంక జాలిగా బాధగా చూసిచూసి చేతులు జోడించారు.

ఏదో చెయ్యాలన్న తపన ఆయన మనసులో రగలసాగింది.

★ ★ ★

"మాస్టారూ"

"మీరా రంగయ్యగారూ... రండిరండి- ఇలా కూర్చోండి"

"ఉత్తరం రాసిపెట్టాలి మాస్టారూ"

"అలాగే" అంటూ లోపలికెళ్ళి కళ్ళజోడు పెట్టి, కలమూ తీసుకువచ్చి అరుగుమీది చాప మీద కూర్చున్నారు మాస్టారు.

ప్రయాణపు హడావుడిలో వున్న వానుని చూసి- "అబ్బాయిగారికి హైదరాబాదులో ఉద్యోగం వచ్చిందిట కదా" అన్నాడు రంగయ్య.

"ఊఁ..."

"అంతా అక్కడికి వెళ్ళిపోతారా?"

"వాను వెళ్తున్నాడు. ఈ బొందిలో ప్రాణముండగా మేమీగడ్డని వదలం"

"ఇంతవయసొచ్చేక ఇంకా ఇక్కడ బావుకునేదేవుంది మాస్టారూ. అబ్బాయిగారి దగ్గరికెళ్ళి విశ్రాంతి తీసుకోండి"

"నాకన్నా పెద్దవారు మీరు. మీ పిల్లలంతా ఎదిగి వచ్చారు. పనీపాటా చేస్తున్నారు. అలా అని మీరు విశ్రాంతిగా వుంటున్నారా చెప్పండి? లేదు... ఇంకా పొలం వెళ్తూనే వున్నారు. అరక దున్నుతూనే వున్నారు. వయస్సు మళ్ళినా కాటికెళ్ళేవరకూ ఏదోటి చెయ్యాలన్న తాపత్రయం వెన్నాడుతూనే వుంటుంది"

"బాగా చెప్పేరు. మాకంటే పొలమూ పుట్రా వున్నాయి. ఉద్యోగస్తులు మీకేం మాస్టారూ రిటైరయ్యాక కొడుకుల దగ్గర కాలక్షేపం చెయ్యొచ్చు"

"చెయ్యొచ్చు... కాని పుట్టిపెరిగిన గడ్డమీద తిరుగుతూ అయినవాళ్ళ మధ్య బ్రతకడం ఎంతదృష్టం! ఆ అదృష్టాన్ని తోసిరాజనగలమా చెప్పండి?"

ఆయనకేం అర్థంకాలేదు. మాస్టారివంక వెర్రిగా చూసి అన్నాడు- "అబ్బాయిగారు డాక్టరీ పాసయ్యారుకదా మనూళ్ళోనే వుంటారనుకున్నాం. పురుడొచ్చినా పుణ్యమొచ్చినా పట్నం పరుగెట్టక్కర్లేదు కదా అనుకున్నాం..."

మాస్టారి మనస్సు మూల్గింది.

"మీరేమిటి... నేనూ అనుకున్నాను. నావూరికి కనీసం వైద్యసౌకర్యమైనా కలిగించి వూరి రుణం కొంతైనా తీర్చుకోవాలనుకున్నాను, అందుకే అష్టకష్టాలు పడి వానుని డాక్టర్ని చెయ్యగలిగాను. కాని వాళ్ళకి పట్నాలమీద పరాయిసీమలమీద మోజు. వాళ్ళక్కావాల్సింది జనసౌఖ్యంకాదు! డబ్బూ, హోదా, విలాసాలూనూ. అందుకే ఆ ఊరో, ఈ దేశమో వెళ్తామంటారు. మనం వాళ్ళకి చెప్పేంత వాళ్ళంకాదుగదా. చెప్పినా వింటారా- అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలొచ్చేక కాదు కదా"

నిట్టూర్చారు.

"అలాగున్నారేం మాస్టారూ?"

"ఏంలేదులెండి వుత్తరంలో ఏం రాయాలో చెప్పండి"

ఉత్తరం రాసిచ్చి పంపించారు.

భర్తమాటలు విన్న శారదమ్మకు దుఃఖ



చతుర ..

పొంగివచ్చింది. ఈ రెండ్రోజుల్లోనే చిక్కి నగమయ్యారు. ఇక ముందు ముందు ఏమవుతారోనన్న గుబులు ఆమె గుండెల్ని తొలిచెయ్యసాగింది.

మెల్లగా కొడుకు దగ్గరికెళ్ళింది.

"నువ్విక్కడుండలేవుట్రా అబ్బాయ్" అంది.

"నీకెన్నిసార్లు చెప్పాలమ్మా... నేనీవల్లెలో క్షణం కూడా వుండలేను. నువ్వుకూడా అర్థం చేసుకోవేం. మీకీ వూరు గొప్పది కావొచ్చు. సాక్షాత్తూ స్వర్గమే కావచ్చు. కాని నాకిది కుగ్రామం!
చదువుకున్నవాళ్ళకెవళ్ళకీ ఊపిరాడదిక్కడ. అలాటిచోట నన్ను కట్టేవడెయ్యాలని చూస్తారేం? ప్రజలకి ఉచితంగా వైద్యంచెయ్యాలంటారు నాన్నగారు. నేను కాదనటంలేదు. నాకు చేతనైనంత చేస్తాననే అంటున్నాను. కాని వినరేం? ఈ వూరివాళ్ళే ప్రజలైనట్లు మాట్లాడితే ఎలా?"

"నాన్నగార్ని అర్థంచేసుకోవేం రా! నీచిన్నప్పట్నుంచీ కూడా నిన్ను డాక్టర్ని చెయ్యాలనీ, ఈ వూళ్ళో ప్రాక్టీసు పెట్టించాలనీ..."

"ఇంక చాలమ్మా... ఇప్పటికి ఏ వెయ్యిసార్లో విని వుంటానామాట. మీ ఆశల్నీ ఆశయాల్నీ నామీద రుద్దాలని చూస్తారుగాని నా ఆశలర్థం చేసుకోరేం? విదేశాలకెళ్లాలనీ, విజ్ఞానాన్ని వృద్ధి చేసుకోవాలనీ, అందరి మన్ననలూ పొందాలనీ, అష్టైశ్వర్యాలతో తులతూగాలనీ నాకుంది. అందుకు తొలిమెట్టుగా ఉద్యోగంలో చేరుతున్నాను. హైదరాబాదులో వుంటే నా ప్రయత్నాలు సఫలమవుతాయని నా ఆశ. నువ్వైనా నన్నర్థం చేసుకోవేంటమ్మా"

"నిన్నూ కాదన్లేను, ఆయన్నీ కాదన్లేను. మధ్యన నాకొచ్చిపడింది చావు!"

"మధ్యలో నువ్వేం ఇదవ్వకు శారదా! ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది. అబ్బాయన్నట్టు ఒకరి ఆశల్ని మరొకరి మీద రుద్దకూడదు. ఎవరు చెయ్యగలిగింది వాళ్లు చేసుకోవాలంతే. ఎవరి రెక్కల శక్తిమేరకు వాళ్ళు ఎగరాలంతే. అలాగే రా అబ్బాయ్... నువ్వెక్కడున్నా నువ్వు సుఖంగా వుండటమే మాక్కావాల్సింది. నువ్వు విదేశాలకెళ్ళు విజ్ఞానం పెంపొందించుకో. కాని ఆ విజ్ఞానంలో కొంతైనా నీ దేశప్రజలకి వినియోగించాలని మర్చిపోకు. నీ చదువు నిమిత్తం ప్రభుత్వం ఖర్చుపెట్టిన సొమ్ము ఈ దేశ ప్రజల్నుంచి వసూలు చేసిందేనని మర్చిపోకు" అనేసి వెళ్ళిపోయారు మాస్టారు.




ప్రూన్పడిపోయాడు వాను.

★ ★ ★

బడిముందు బారులుతీరి నిలబడి పిల్లలంతా ముక్తకంఠంతో వందేమాతరం ఆలపిస్తున్నారు.

అటెన్షన్‌లో నిలబడినపిల్లలముఖాల్లో మెరుస్తోన్న కాంతిని చూస్తూ ఆశాపూరితమైన భవిష్యత్తుని తలచుకుంటున్నారు మాస్టారు.

కాని నిరాశామేఘాలు మనసున్నావరిస్తున్నాయి.

సుజలాం సుఫలాం....!

ఒకప్పుడు తన ఊరూ దేశమూ కూడా ఆ పాటలోలాగే వుండేవి.

ఇప్పుడు?

కుక్కలు చింపిన విస్తరి గుర్తొచ్చింది. చెదలుపట్టిన చెట్టు కళ్ళముందు మెదిలింది. మఱ్రినీడన అణగారిపోతున్న పేదమొక్కలు మనస్సులో కదిలాయి.

నిట్టూర్చారు.

"భారతదేశము నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు..." ప్రతిజ్ఞ చేశారు భావిభారత పౌరులంతా.

మాస్టారి కళ్ళు చెమ్మగిల్లాయి.

"మీరంతా గొప్పవాళ్ళేరా! మీ శక్తి అనమానం. మీ యుక్తి అజేయం. అణువుల్లాంటి మీరు ప్రపంచ వినాశనానిగ్గాక సౌభాగ్యానికి అహరహం శ్రమించాలి. మానవాళి ఆశాజ్యోతులు మీరేరా... మీరే"

పిల్లలంతా పాకబడిలోకెళ్ళి నేలబారు బల్లల మీద కూర్చుని పుస్తకాలు బయటికి తీస్తూ గోలగా కబుర్లు మొదలెట్టారు.

సైలెన్స్ అన్చెప్పి అటెండెన్స్ వెయ్యసాగారు మాస్టారు.

బడి అంతా ఒకటే పెద్దపాక. ఒకటినుంచి

అయిదు వరకూ తరగతులున్నా వాటి మధ్య తడికలేం లేవు. ఓ తరగతివక్కన ఓ క్లాసు, మరో వక్కన మరో క్లాసూ చెప్పున నిర్వహిస్తున్నారు. మొత్తం పిల్లలు డెబ్బై ఎన భైమంది వరకూ వుంటారు.

మాస్టారుగాక మరో అసిస్టెంటు మాస్టారు కూడా వున్నారు. ఆయన పేరు వరంధామ య్యా.

సన్నగా పొడుగ్గా రివటలా వుండి నుదుటి మీద నామాలతో తరచూ ముక్కు పొడుం తుమ్ములు తుమ్మే ఆయనంటే పిల్లలకి వేళా కోళం- నవ్వులాట!

ఆయనకి దాదావు యాభై ఏళ్ళుంటాయి. ఆ వూరివాడే. పైవ్యావకాలెక్కువ. కొద్దిగప్పో పొల ముంది. స్వయంగా వ్యవసాయం చేస్తుంటారు దూడాదుడుకూ వుంది. అది చాలాదన్నట్టు గ్రామస్తులకి దస్తావేజులూ ప్రోనోట్లూ, అగ్రి మెంట్లూ రాస్తుంటారు. వెరశి ఉద్యోగం మరు గుజ్జుదైపోయిందాయన దృష్టిలో.

అన్ని క్లాసుల్లో అటెండెన్సు అయిపోయాక వచ్చారు వరమానందయ్య.

మాస్టారి ముఖంలోని అప్రసన్నతని గమ నించి తన క్లాసులవైపెళ్ళిపోబోయారుగాని ఆయన పిలవటంతో అటు నడవక తప్పలేదు.

"మీ వద్ధతేం బావోలేదు వరమానందయ్యా గారు"

"ఇవాళ కొంచెం ఆలస్యమయింది- వనె క్కువగావుండి..."

"రోజూ ఏవో వనులుంటూనేవుంటాయి. అలా అని చేసే వృత్తికి ద్రోహం చేస్తే ఎలా? పెద్దవారు... మీక్కూడా చెప్పాల్సిరావటం సిగ్గు చేటు. అన్ని వృత్తులకన్నా వవిత్రమైనది, బాధ్యతతో కూడుకున్నది ఉపాధ్యాయవృత్తి. మన ప్రభావం వసిపిల్లల మీద చాలా వుంటుందని మర్చిపోకండి. చిత్తశుద్ధితో మన బాధ్యతని మనం నిర్వహించలేనప్పుడు గౌర వంగా తప్పుకోవడం మంచిది"

"మీరేవో పాతకాలం కబుర్లుచెబుతారుగాని ఏ వూళ్ళో ఎవరు మాత్రం సరిగా చెబుతున్నా రండీ! కొన్ని ఊళ్లల్లో బడేసరిగ్గా తెరవటంలే దుగదా"

"కొన్ని పల్లెల్లో పరిస్థితి అంతఘోరంగానూ వుంది నిజమేకానీ ఎందువల్ల? రాజకీయ పలుకుబడితో స్వగ్రామం చేరి కుటుంబవృత్తు లూ, ప్రైవేట్లూ చూసుకుంటూ అసలు వృత్తిని చిన్నచూపు చూస్తూండటంవల్లనే. బడిలోనూ బయటా కూడా ఆదర్శగురువులా మెలిగిననా డే మనం గౌరవానికి అర్హులం. మీరు మీ ప్రవర్తనని మార్చుకోకపోతే ఇంక సహించే ఓపిక నాకులేదు"

వరంధామయ్యా మొహం ఎర్రబడింది.

'నీ బోడి బెదిరింపులకెవడూ బెదరడు. మా రాయుడిగారికి చెప్పానంటే మీరు వెళ్ళి ఏ ఏజన్సీప్రాంతంలోనో కళ్ళు తెరుస్తారు' అను కుంటూ తన క్లాసుల వైపెళ్ళారు విసురుగా.

పిల్లలు గోలగా మాట్లాడుకుంటున్నారు. అసలే అవమానంతో రగులుతోన్న ఆయన కొళ్ళు మండిపోయింది. బెత్తం అందుకుని బాదేశారందర్నీ.

తలవట్టుకుని బాధగా చూస్తూండిపోయారు మాస్టారు.

ఉన్నట్టుండి వాతావరణం మారిపోయింది. ఆకాశవు మైదానంలో కారుమేఘాలు చెడుగు డాడుతున్నాయి.

"వర్షం వచ్చేస్తుంది మాస్టారూ. కుంభవృష్టి అని రేడియోలో కూడా చెప్పేరు" వరంధామ య్యా అన్నారు.

ఆయనవంక సాభిప్రాయంగా చూశారు.

"బెల్ కొట్టించెయ్యనా?"

వర్షం వస్తేచాలు బడికి సెలవ ఇచ్చెయ్యా ల్సిందే. ఎంచేతంటే బడికప్పు ఎండనుండి రక్షణ ఇవ్వగలదుగాని వాననుండి ఇవ్వలేదు. ఆ ఊరిబడి గురించి పట్టించుకునే తీరిక నాయకులకి లేదు.

ఆయన తలాడించటం ఆలస్యం "ఒరే- బెల్‌కొట్టెయ్యేంరా" అని అరవడం, బెల్‌కొ ట్టడం, బిలబిలమంటూ పిల్లలు వెళ్ళిపో వటం త్రుటిలో జరిగిపోయాయి.

బడికి తాళంవేసి ఇంటికేసి నడుస్తోంటే చినుకులు మొదలయ్యాయి. మాస్టారు ఇంటి కెళ్ళేసరికి అది పెద్దవర్షంగా మారిపోయింది

★ ★ ★



చతుర

అర్థరాత్రివేళ తలుపులు దబదబమని బాదేరెవరో.

"వస్తున్నా" అంటూ లేచివెళ్ళి తలుపు తీశారు మాస్టారు. ఆయన వెనకే వచ్చింది శారద.

వర్షంలో తడిసొచ్చిన అయ్యన్నగారి పాలేరు- "మీ అబ్బాయిగార్నోపాలి పిలవమన్నారండి అయ్యన్నగారు" అన్నాడు కంగారుగా, ఆదుర్దాగా.

"ఎందుకు?"

"అరమ్మాయికి నొప్పులొచ్చాయండి. బిడ్డ అడ్డం తిరిగిందంటండి, డాక్టరుగారికి చూపించాలంటండి. మంత్రసాని....

"అరె అలాగా... అబ్బాయి పొద్దున్నే హైదరాబాదు వెళ్ళిపోయాడే..."

"ఇప్పుడెలాగండి బాబయ్య. పెద్దపేణానికి ఇబ్బందొత్తాదో ఏమో..."

"వద... నేనూ వస్తాను" గొడుగు తీసుకుని బయల్దేరారు.

ఆ ఊళ్ళో ఆఖరికి ఆరెమ్పీ డాక్టరు కూడాలేడు. ప్రక్కవూర్నించో ఆరెమ్పీ డాక్టరొస్తుంటాడు. ఊళ్ళో ఆయుర్వేద డాక్టరొకాయనున్నాడుగాని ఆయన్దంతా దీర్ఘకాలిక వైద్యం. కడుపు నొప్పికీ, కాలునొప్పికీ కూడా పొరుగూరెళ్ళాల్సొస్తోందని చెప్పి మాస్టారు హొమియోపతి వైద్యం నేర్చుకున్నారు. ఖర్చు తక్కువ గనుక అది పేదవారి వైద్యమనీ, మనదేశం లాంటి అభివృద్ధి చెందుతున్న దేశాలు దాన్ని ప్రోత్సహించాలనీ ఆయన భావించారు. కాని ఇంజెక్షన్లమీదా, టాబ్లెట్స్‌మీదా ఉన్న నమ్మకం తీపి మాత్రల మీద లేకపోయింది జనానికి.

"మీ అబ్బాయేరి మాస్టారూ?" అయ్యన్నగారడిగారు ఆందోళనగా.

"వాడికి హైదరాబాదులో ఉద్యోగం వచ్చింది. ఈ ఉదయమే వెళ్ళేడు..."

"అయ్యో అలాగా... ఇప్పుడెలాగండీ. అమ్మాయి ప్రాణంమీదికొచ్చేట్టుంది..."

"మీరేం ఇదవ్వకండి. అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడు. అంతా నవ్యంగా జరిగిపోతుంది"

లోపలికెళ్ళారు. ఆడవాళ్లు తొలగి దారిచ్చారు. మంచంమీద మెలికలు తిరిగిపోతోంది అయ్యన్నగారమ్మాయి. నాడి చూశారు. బలహీనంగా ఉంది. మంత్రసానితో మాట్లాడారు. ఎన్నో పురుళ్ళు పోసిన ఆమె కంగార్ను చూసేనరికి మాస్టారి మొఖంలో రంగులు మారాయి.

"అయ్యన్నగార్తో చెప్పి బండి కట్టిస్తాను. వెంటనే పట్నం తీసుకుపోదాం"

మరి పదినిముషాలకి రెండెద్దులబండి సిద్ధమయ్యింది. చిన్నసైజు గూడు కూడా కట్టేరుగాని అది వర్షాన్ని పూర్తిగా నివారించగల స్థితిలోలేదు.

అయ్యన్నగారమ్మాయీ, ఆమెతల్లీ, మంత్రసానీ, మరొకావిడా బండెక్కేరు. అయ్యన్నగారూ, మాస్టారూ బండివెనుక నడవసాగేరు.

హోరున గాలివీస్తోంది.

భోరున వర్షం కురుస్తోంది.

సరైన రోడ్డులేక బండి మట్టిలో దిగబడిపోతోంది. లాగలేక లాగుతున్నాయి ఎడ్లు. బండిలో నొప్పుల బాధకి తాళలేక కేకలుపెడుతోందా అమ్మాయి.

మోకాళ్లోతు కయ్యిలోంచి నడవలేక నడుస్తున్నారు వర్షంలో- ఇంచుమించు తడిసిపోతూ మాస్టారూ, అయ్యన్నగారూ. త్వరగా పట్నంవెళ్తే బావుణ్ననీ, డాక్టర్ల చేతిలో ఆమెని పెడితే ఆమెకింకే ప్రమాదమూ ఉండదనీ ఆశిస్తున్నారు. కానీ దారి తరగటంలేదు.

సుమారు మూడు కిలోమీటర్లు వెళ్ళేరు. ఊరిరోడ్డువదలి మెయిన్‌రోడ్డు ఎక్కింది బండి.

ఉన్నట్టుండి ఆమెకు నొప్పులధికమయ్యాయి. మరి తాళలేనిస్థితికి చేరుకుందామె.

బండి కుదుపులకి పరిస్థితి విషమించిందనీ, వర్షంవల్ల అమ్మాయి తడిసి ముద్దయ్యిందనీ చెప్పింది మంత్రసాని. ఒక చోట బండిఆపి ప్రక్క ఊళ్ళోని ఆరెమ్పీ డాక్టర్ని పిలిస్తే మంచిదంది.

బండిని పెద్దమర్రి చెట్టుక్రింద ఆపించి డాక్టర్ దగ్గరకి పాలేర్ని తరిమారు అయ్యన్నగారు.

అతడలా వెళ్ళేడోలేదో అతికష్టంమీద ప్రస




వమయ్యింది. అంతా గండం గడిచినట్టు ఫీలవుతోంటే అమ్మాయికి వాతం కమ్మేసింది. డాక్టరొచ్చేసరికి ఆమె బిగునుకుపోయి కట్టెలా మారిపోయింది. ఘొల్లుమన్నారంతా.

మాస్టారు గుండె ముక్కలయ్యింది.

వాను ఇంకొక్కరోజు- అవును- ఒకే ఒక్కరోజు ఆ ఊళ్ళో ఉండిఉంటే పరిస్థితి ఇంతగా చేజారేదికాదు. ఓ ప్రాణం దారుణయాతనని చవిచూసి దుర్మరణం పాలయ్యేది కాదు.

"వానూ... నిన్నెప్పటికీ క్షమించలేన్రా క్షమించలేను!" అనహాయంగా ఆక్రోశించారు మాస్టారు!



రాయుడు ఆ ఊరికి మకుటంలేని మహారాజు.

అవడానికాయన గ్రామ సర్పంచి మాత్రమే. కాని ఆ పదవి ఆయనకో బుల్లి అలంకారమనే చెప్పాలి. ఆ ఊరి ప్రజలమీద ఆయనకున్న పట్టు అమోఘం. ఆయన మాటనీ చేతనీ ఎవరూ విమర్శించాలని కూడా అనుకోరు. ఆయన గీచిన గీటునెవరూ దాటరు. ఊరు ఆ మాత్రంగానైనా ఉందంటే అందుక్కారణం ఆయనేనని విశ్వసిస్తారు చాలామంది.

పెదవి విప్పకుండానే కేవలం కంటిచూపుతో ఊరినీ, ఊరిజనాన్నీ శాసించగల సమర్థుడాయన.

పంచాయతీ పరిపాలన వచ్చినప్పట్నుంచీ కూడా ఆయనే గ్రామనాయకుడు. ఓమారు సమితి ప్రెసిడెంటుగా కూడా ఎన్నికయ్యారు. కాని ఆయన ముఠా లీడరుకి మంత్రిపదవి పోవడంతో ఆయన అవిశ్వాస తీర్మానం ఎదుర్కోవలసివచ్చింది. ఫలితంగా పరువుపోవడంతో గ్రామాన్ని అంటిపెట్టుకునుండటమే మంచిదనుకునుండిపోయారు.

ఆయన వంశోద్ధారకుడు ప్రభాకర్‌కు కాలేజీ రోజుల్నించీకూడా రాజకీయాలంటే ఇష్టం. నాయకత్వం మరీ ఇష్టం. ప్రస్తుతం అధికార పార్టీవారి రాష్ట్ర యువజన సంఘానికి ఉపాధ్యక్షుడు. ఈసారి అసెంబ్లీ ఎన్నికల్లో ఎమ్మెల్యేగా పోటీచేయడమేగాక యువజనులకోటాక్రింద మంత్రిపదవి కూడా సంపాదించించాలని అతగాడి ప్రయత్నం. దీనికి రాయుడి ప్రోత్సాహం, ఆశీస్సులున్నాయి.

పైలెవెల్లో పలుకుబడి పెంచుకోడానికీ, భార్య కోరికమేరకు నగరజీవితం గడపడానికీ హైదరాబాద్‌లో ఇంచుమించు సెటిలైపోయాడు ప్రభాకర్. ఎప్పుడో తప్ప అతడాఊరికిరాడు. మరీ తప్పనిసరైనప్పుడే భార్యకూడా వెంట వస్తుంది.

ఈసారిద్దరూ ఫామిలీ ఫంక్షన్‌నిమిత్తం వచ్చారు.

"కాలికి మట్టి అంటే పూరంటే నాకు పరమ అసహ్యం" దమయంతి అంది వికారంగా





మొఖంపెట్టి.

"ప్లీజ్ దామూ. కొంచెం ఓపికపట్టు. రెండ్రోజుల్లో వెళ్ళిపోదాం" ఓదార్చాడు ప్రభాకర్.

"హాయిగా సిటీలో తిరక్క ఈ పల్లెటూరెందుకొస్తారో నాకర్థంకాదు"

"చదువుకున్నదానివి అవేంమాటలు చెప్పు? మనపూహలెక్కడ విహరించినా మన కాళ్ళింకా ఈ మట్టిలోనే కూరుకునున్నాయి. ఎన్నికల్లో గెలిచేవరకూ వీళ్ళనీ ఈ వూళ్ళనీ మర్చిపోకూడదు. మరిచిపోతే ఇంతే సంగతులు"

"డబ్బు విసిరేస్తే నరి చచ్చినట్టు ఓట్లు వేసేస్తారు. వీళ్లకి తమ బాగోగులగురించేమైనా తెలిస్తే కదా. పట్టి పల్లెటూరి బగ్గిరాయిలు! మట్టి మనుషులు!"

"అదంతా నిజమేకాని అలాఅని వాళ్ళమొఖంమీద అంటే ఎలాచెప్పు? ఈ మట్టి అన్నా ఈ జనమన్నా ఎంతో అభిమానమన్నట్టు కాస్త నటిస్తే చాలు అభిమానం ఓట్లై మన పెట్టె నింపుమంది. డాడీ ఎప్పుడూ ఇదే చెబుతూంటారు. మన పునాదెప్పుడూ గట్టిగా వుంచుకోవాలి. చిన్నమంత్రి మొదలు ప్రధాన మంత్రి వరకూ అంతా తమ తమ నియోజకవర్గాలని ప్రత్యేక శ్రద్ధతో చూస్తూ ప్రత్యేకమైన అభివృద్ధి పనులెందుకు చేయిస్తారనుకున్నావ్? ఎటుతిరిగి ఎటువచ్చినా కనీసం తన సీటైనా దక్కుతుందనే"

"అందుకే హాయిగా యమ్మెల్యే అయితే పోయేది"

నవ్వేడతడు "అవెప్పుడో రద్దైపోయాయిగా"

"వీళ్ళనీ వాళ్ళనీ దేవిరిస్తూ తిరిగేకన్నా పోనీ రాజ్యసభకి ట్రైచేస్తే? మా నాన్నగార్తో కూడా మాట్లాడదాం..."

"ముందు పుట్టికెగరనీ, తర్వాత స్వర్గానికెగురుదాం"

"ఏం ఎగుర్తారో ఏమోగాని నాకిక్కడ వూపిరాడదు. రేపేవెళ్ళిపోదాం"

"ఓకే. అమ్మగారి ఆజ్ఞకి తిరుగుందా"

ఇంట్లోని ఫంక్షన్ అయ్యాక రాయుడు, ప్రభాకరూ రాజకీయాలగురించీ, నాయకులగురించీ తాము అనుసరించాల్సిన ఎత్తుగడల

అన్నపూర్ణ స్టూడియోస్

సమర్పించు




యస్.యస్. క్రియేషన్స్

# రావుగారిల్లు

LAA

నిర్మాత **వై. సురేంద్ర** దర్శకత్వం **తరణి**

డి.వి.నరసరాజు • చక్రవర్తి • మహీధర్ • గౌతమరాజు • భాస్కరరాజు

గురించీ ముచ్చటిస్తూ కూర్చున్నారు.

"అబ్బాయిగారి కోసం మాస్టారొచ్చారండి" నౌకరొచ్చి చెప్పేడు.

"నా కోసమా?"

"ఆయ్"

"ఆయన కొడుక్కి హైదరాబాదులో వుద్యోగం వచ్చిందిలే. ఏదో హెల్ప్‌చేస్తావనొచ్చుంటాడు. బాగా మాట్లాడి పంపించు. అలాటివాళ్ళు బాగా వుపయోగపడ్తారు. ముందు ముందు" అంటూ లోపలికెళ్ళిపోయారు రాయుడుగారు.

"మాసార్ని లోపలికి తీసుకురా"

మాస్టారొస్తుంటే ఎదురెళ్ళి "నమస్కారం మాస్టారూ" అన్నాడు.

తనకి అక్షరాభ్యాసం చేసింది ఆయనే!

"బాగున్నావా ప్రభాకర్"

"బాగున్నానండి. మీరు?

"మాకేమయ్యా. పోయేకాలమేగాని వచ్చే కాలం కాదుకదా"

"అలాగనకండి మాస్టారూ. ఎందరికో విద్యాదానంచేసి వుత్తములుగా తీర్చిదిద్దారు. ఇంకా ఎందరికో మీరు దారిచూపాలి"

"అప్పుడే నీకు నాయకుడి లక్షణాలొచ్చేశాయి" నవ్వేరు అభిమానంగా చూస్తూ.

సిగ్గుపడ్డాడు. "అంతా మీ ఆశీర్వాద బలం"

నౌకరు కాఫీ తెచ్చిచ్చాడు ఇద్దరికీ.

"తీకుకోండి మాస్టారూ. వచ్చిన పనేవిటో చెప్పండి. మీకేమైనా ట్రాన్స్‌ఫర్ రాబోతోందా? మీరేం దిగులుపెట్టుకోకండి. చిటికెలో ఆపించేస్తాను"

"అదేంకాదులే. నాకింక సర్వీసెంతోలేదు గదా"

మరింకేమిటి మాస్టారూ వాసుకి హైదరాబాదులో వుద్యోగం వచ్చిందిట కదా. నాన్నగారు చెప్పేరు. ఎవరిచేతైనా ఏమైనా చెప్పించాలా చెప్పండి. మన మంత్రిగారు మన మాట కాదనరు"

"నాగురించీ నావాళ్ళ గురించీ నేనేమీ అర్థించడానికి రాలేదయ్యా"

"మరి..." కించిత్తు ఆశ్చర్యంగా చూశాడు.

"మన వూరి బడిసంగతి నీకు తెలుసు కదా. ఒకప్పుడందులో చదివినవాడివే గనుక అంతా గుర్తుందనుకుంటాను. ఎప్పుడో మీ తాతగారు దానమిచ్చిన పాకబడిలోనే వుంది. ఆ బడి ఇంకా అడపాదడపా బాగుచేస్తున్నా వర్షం ధారాపాతంగా కురుస్తూనేవుంది. పిల్లలకీ చదువుకీ కూడా చాలా ఇబ్బందిగా వుంటోంది. నువ్వైనా పూనుకుని ప్రభుత్వంచేత చిన్న బిఇల్డింగు కట్టించిస్తే బాగుంటుంది. ఒకప్పుడు మన చుట్టుప్రక్కల గ్రామాల్నుంచి పిల్లలు చదువునిమిత్తం ఇక్కడి కొచ్చేవారు. ఇప్పుడా వూళ్ళల్లో హైస్కూళ్ళు వచ్చాయి. మనవూరి పిల్లలే ఇప్పుడా వూళ్ళెళ్తున్నారు హైస్కూలు చదువుకి. మనస్కూల్ కనీసం అప్పర్ ప్రైమరీ స్కూల్‌గా మార్పించినా కొంత ఇబ్బంది— ముఖ్యంగా ఆడపిల్లలకి— తగ్గుతుంది..."

"అవున్నిజమే మాస్టారూ. మంచిపాయింటు చెప్పేరు. నాకింతవరకూ తోచనేలేదు. ఇంకేమేంచేస్తే బావుంటుందంటారు మన ఊరికి?"

మాస్టారికి వుత్సాహం వచ్చింది.

"రోడ్లు చాలా ముఖ్యం బాబూ. నిజంచెప్పాలంటే రోడ్లు నాగరికతకి చిహ్నం. అభివృద్ధికి ప్రథమసోపానం. వర్షాకాలంలో వూరుదాటాలన్నా వూళ్ళోకి రావాలన్నా. చచ్చినంత యాతనవుతోంది. మొన్న అయ్యన్నగారమ్మాయికి నొప్పులొచ్చాయి. కాన్పు కష్టమయ్యేట్టుందని అప్పటికప్పుడు పట్నం తీసుకెళ్దామని బండికట్టుకుని బయల్దేరేంగాని వూరుదాటేప్పటికే పరిస్థితి విషమించేసింది. ఆ అమ్మాయి మన చేయిదాటిపోయింది"

"అరె— అలాగా పాపం. మనూళ్ళో సరైన డాక్టరుకూడా లేకపోయారు సుమా"

"అవును బాబూ. రోడ్లు వుంటే బస్సుతిరుగును. రాకపోకలకి ఇబ్బంది లేకపోతే ఎవరోక మంచి డాక్టరొచ్చి ప్రాక్టీసుపెట్టేవాడేమో..."

"ఏ అరెమ్బీలో రావాలిగాని యం.బి.బి.యస్ డాక్టర్లు ఈ పల్లెకెందుకు




వస్తారు మాస్టారూ "

"బొత్తిగా అలాతీసిపారెయ్యకు ప్రభాకర్"

"మీరెక్కడో నత్తెకాలవు మనుమలు మాస్టారూ. ఈకాలం కుర్రాళ్ళ పద్ధతి వేరు. ఆలోచన వేరు అంతెందుకు మీ వానుకూడా డాక్టరే కదా. అతడ్నే ఇక్కడ ప్రాక్టీను పెట్టమనకపోయారా?" అనుకోకుండానే వ్యంగ్యం కదిలిందతడి స్వరంలో.

"అందునిమిత్తమే అష్టకష్టాలువడి చదివించాను. అందలం ఎక్కేక గుండెల మీద తన్నేసి వెళ్ళిపోయాడు" ఆవేదనగా అన్నారు మాస్టారు.

ప్రభాకర్ చిన్నగా నవ్వేశాడు" అంతా అంతే మాస్టారూ. పెద్ద టౌన్లోనో, సిటీలోనో



ప్రాక్టీసుపెడితే కన్సల్టేషన్ ఫీజు మనిషికి యా భైరూపాయలన్నా రోగులు క్యూలో నిలబడతా రు. ఇక్కడేమిస్తారు రూపాయీ రెండూ తప్ప. పైగా ఇక్కడో సౌకర్యమా ఓ ఎంటర్‌టెయిన్ మెంటా!"

"బాగా చెప్పేవుకాని అలాటి డబ్బు డాక్టర్లి క్కడ ప్రాక్టీసుపెట్టకపోవడమే మంచిదిలే బాబూ. సేవాభావం వున్నవాళ్ళకే ఇక్కడస్థానం వుంది. వాళ్ళని జనం కుబేరుళ్ళని చెయ్యలేక పోవచ్చుగాని దేవుళ్ళని చెయ్యగలరు ప్రభా కర్. ఏదో రోజున మానవత్వం మూర్తీభవించిన డాక్టర్లు తమ చదువుని సార్థంకంచేసుకోడానికి జనాన్ని వెదుక్కుంటూ పల్లెలకి రాకపోరు"

"మీవన్నీ భ్రమలు మాస్టారూ..."

"పోనీలే బాబూ నీలాంటి యువత చేతిలో నేవుంది మనగ్రామ భవిష్యత్తూ దేశ భవిష్యత్తూ కూడా. మన ఊరి అభివృద్ధికి నువ్వు ఓ చేయి అందిస్తావనే ఆశతో వచ్చాను!"

"తప్పకుండా మాస్టారూ ఇవాళే డాడీతో మాట్లాడతాను"

"మాట్లాడటమేకాదు పని జరిగేట్లు చూడాలి. వస్తాను ప్రభాకర్" అంటూ వెళ్ళిపోయారా యన.

కాస్సేపు మాస్టారు చెప్పినదానిగురించే ఆలో చిస్తుండిపోయాడు ప్రభాకర్. ఆలోచిస్తున్న కొద్దీ అందులో చాలా నిజముందనిపించింది.

దేశానికి స్వాతంత్ర్యంవచ్చి నలభైఏళ్ళైనా ఇంకా రోడ్లులేని గ్రామాలు, కనీస సౌకర్యాల్లేని గ్రామాలు ఎన్నెన్నో వున్నాయంటే మనం సాధించిన ప్రగతికి అర్థమేమిటి? మిగతావాటి సంగతలావుంచితే తన తండ్రి నేతృత్వంవ హిస్తోన్న తమ గ్రామం కొడిగట్టిన దీపంలా ఎందుకుండిపోయింది? కొన్ని చిన్న చిన్న పనులు చేబట్టి వూరిరూపురేఖలు మార్చెయ్యొ చ్చు. రెండు ఎలక్షన్లకి సరిపడా గౌరవాన్ని సంపాదించుకోవచ్చు!

ఇంక తిన్నగా వుండలేకపోయాడు.

తండ్రి గదిలోకి నడిచాడు ప్రభాకర్.

మందహాసం చేస్తూ ఆహ్వానించారు రాయు డు

"నువ్విలా ఆవేశపడ్తూ వస్తావని తెలుసు. నీ రక్తం అలాంటిది. తానె లా రెచ్చగొట్టాలో మాస్టార్లాంటి వాళ్ళకి బాగా తెలుసు. హ్హు హ్హు హ్హు..." అంటూ నవ్వేశారు.

ఆ నవ్వు ఆయన ట్రేడ్ మార్క్. తను గొప్పవాడిననీ ఎదుటివాడు బొత్తిగా బుర్రలేని వాడనీ చెబుతుందా నవ్వు కొత్త బ్లేడుతో ఒంటిని చీల్చి కారం అద్దినట్టుగా వుంటుందా నవ్వు విన్నవాళ్ళకి.

ఆయన మాటలకి కోపం రగిలినా ఆ నవ్వు చూశాక మరేమీ అన్లేక వెర్రి నవ్వు నవ్వి తలాడించి వెళ్ళిపోతూంటారంతా.

ప్రభాకర్ ఒళ్ళుకూడా చీమలు పాకినట్లు చివచివలాడిందా నవ్వుకి అయినా భరిస్తూ కూర్చున్నాడు.

"అది కాదు డాడీ. మాస్టారు చెప్పింది నిజమే. మానూరి బడికి సరైన బిల్డింగులేదు. ఊరికి రోడ్లులేవు. ఆసుపత్రి లేదు..."

"కుళాయిల్లేవు బస్సుల్లేవు. పశువులాసు పత్రి లేదు. బ్యాంకులేదు. ఫ్యాక్టరీల్లేవు. రైలు మార్గంలేదు. సినిమాహాలు కూడా లేదు..."

తండ్రివంక అయోమయంగా చూశాడు.

హ్హు హ్హు... అంటూ పొట్టినవ్వు నవ్వేరు.

"అందుకే అంటారు కోర్కెలు కోటి అని. ఎన్నిచేసినా లోపాలు కన్పిస్తూనేవుంటాయి. చె య్యాల్సిన వాటి లిస్టు పెరుగుతూనే వుంటుంది..."

"కనీస సౌకర్యాలైనా..."

"అవెందుకు లేవు? రెండు చెరువులు తవ్వించాను. పంట పొలాలకోసం ఓ కాల్వ నాహయాంలోనే తవ్వించాను. బడి పెట్టించా ను. మట్టిదే అయితేనేం రోడ్డు వేయించాను. కరెంటు తెప్పించాను..."

"అయినా చెయ్యాల్సింది చాలావుంది కదా..."

"వుంటుంది. నువ్వు చెప్పినవి చేస్తే ఇంత క్రితం నేను చెప్పినవి మిగుల్తాయి. అవీ చేస్తే ఇంకొన్ని సిద్ధమవుతాయి. ఇంతచేసినా జనం మనల్నే అంటిపెట్టుకునుంటారంటావా? నమ్మకం లేదు. ఇందిరాగాంధీ రాయబరేలీని అంత అభివృద్ధిపర్చినా ఓడించిపారేశారు. చే సిన మేలు ఎక్కువకాలం గుర్తుపెట్టుకోకపో




వటం కలికాలంలో జనుల లక్షణం!''

ఆయన మాటలకి కన్విన్స్ కాలేదు ప్రభాకర్. అనంతృప్తిగాచూశాడు.

మామూలుగా నవ్వేరీసారి'' అసలు సంగతేవిటంటే నేను సమితి ప్రెసిడెంటుగా వున్నప్పుడు మనూరిని మోడల్ విలేజ్‌గానో చిన్నసైజు టౌన్‌గానో మార్చేద్దామనే చూశాను. కాని పాలిటిక్స్ మారిపోవడంతో అవకాశం చేజారిపోయింది. తర్వాతి సమితి ప్రెసిడెంటు మన పార్టీవాడే అయినా మన ముఠావాడు కాదు. అంచేత పనులుచెయ్యటంలోనూ గ్రాంట్సు ఇవ్వటంలోనూ మన ఊరిమీద శీతకన్నేశాడు. నేనూ దేబిరించలేదు. అధికారం చెలాయించటమే మన రక్తానికి తెలుసుకదా ఇకపోతే వువ్వన్నవన్నీ ఇప్పుడు చేయించెయ్యొచ్చు. మండలాధ్యక్షుడు మనవాడే గనుక మనకెదురుండదు. కానిప్పుడు చేయించను...''

"ఏం?"

"నీకోసం. అసెంబ్లీ ఎలక్షన్లముందు చేయిస్తాను. నువ్వే పూనుకుని చేయించావని ప్రచారం చేస్తాం. కాలిన ఇనుము తేలిగ్గా ఒంగుతుంది. పొంగిన అభిమానాన్ని తేలిగ్గా ఓట్లు చేసుకోవచ్చు. ఇనుము చల్లారినా పొంగు చల్లారినా ఫలితం సున్నా...''

ఈసారి ఒంటిమీద చీమలు ప్రాకలేదు. అభినందన పూర్వకంగా చూశాడు "మీది చాలా దూరదృష్టి డాడీ''

"అది పాతమాట. ప్లానింగ్ అన్నది ఈ కాలవుమాట. రూలూ, రైమూ సిగ్గూఎగ్గూ మంచీ మర్యాదా ఏమీలేని చిత్రవిచిత్రమైన రాజకీయ చదరంగంలో చావకుండా నిలబడాలంటే ఎదుటివార్ని చంపాలి. అందుకు ఎత్తుగడలు కావాలి. చక్కని ప్లానింగ్ కావాలి. అప్పుడు నువ్వే విజేతవి!''

గీతోపదేశం చేసిన కృష్ణుడు కన్పించాడు తండ్రిలో.

ఆరాధనగా చూశాడు ప్రభాకర్.

మాస్టారు చెప్పిన చద్దిఅన్నం మాటలాంటి మాటల్ని పూర్తిగా మర్చిపోయాడు.

★ ★ ★

"అనగనగా చైనాదేశంలో ఓ చిన్నగ్రామం. ఆ ఊళ్ళోవాళ్ళంతా కాయకష్టంచేసి తిండికీ, బట్టకీ సంపాదించుకుంటారు. కాని ఉన్నఊళ్ళో పనులేంలేవు. అందుకనంతా రోజూ పారుగూరెళ్ళి పనిచేసి వచ్చేవారు. అవడానికి పారుగూరు బాగా దగ్గిరేగాని సరైన రోడ్డులేదు. పైగా ఆ ఊరికీ, ఈ ఊరికీ మధ్యన పెద్ద కొండ వుంది. అందుకని రోజూ కొండచుట్టూ తిరిగి పొరుగూరెళ్ళాల్సొచ్చేది పాపం- ఇంకో అడ్డదారేం లేకపోవడంతో కోడి కూసినప్పుడులేచి ఇంతన్నం ఉడకేసుకుని మూటకట్టుకుని బయల్దేరేవారు. కొండ చుట్టూ తిరిగెళ్ళేసరికి పనివేళయ్యేది. మళ్ళీ సాయంత్రం పనయ్యాక పొరుగూళ్ళో బయల్దేరి కొండ చుట్టూ తిరిగొచ్చేసరికి ఎంతో రాత్రయ్యేది. కానేంచేస్తార్లు పాపం- ఇంకో దారేంలేదు గనుక అలాగే కష్టపడుతూండేవారు.

ఆ ఊళ్ళోనే ఓ చురుకైన కుర్రాడున్నాడు. వాడు కూడా ఊరందర్తోబాటు పనికెళ్ళేవాడు. రోజూ కొండచుట్టూ తిరిగెళ్ళాలంటే ఎంతో బాధన్పించేది. కాళ్ళు పీకేసేవి. దారిలో నిద్రొచ్చేసేది కూడా. అయినా ఓపిగ్గా తిరిగేవాడు- కొండని తిట్టుకుంటూ.

ఓరోజున వాడికేమనిపించిందో తెలుసా పిల్లలూ?

కొండలోపల్నించి సొరంగం తవ్వేస్తే రోజూ కొండచుట్టూ తిరగక్కర్లేదుకదా అన్పించింది. కొండలోంచి అడ్డదారి ఉంటే పొరుగూరు త్వరగా వెళ్ళిపోవచ్చు. పొరుగూర్నించి త్వరగా వచ్చేయొచ్చు. బోల్డు దూరం నడక కలిసొస్తుంది గనుక శ్రమ బాగా తగ్గిపోతుంది.

ఊరి పెద్దలకీ ఆలోచనెందుకురాలేదో అని ఆశ్చర్యపోతూ అందరికీ చెప్పేడు. అంతా పగలబడి నవ్వేశారు. కొండలోంచి సొరంగం తవ్వటం నీ తరమూకాదు, మా తరమూకాదన్నారు. మా తాత ముత్తాతల్నుంచీ ఈ కొండ ఇలాగే ఉంది. అంతా ఇలా కొండచుట్టూ తిరిగే పనికెళ్ళేవారు. వాళ్ళందరికన్నా గొప్పవాడివైనట్లు మాట్లాడతావేంటీ అని గేలిచేశారు.

అయినా ఆ కుర్రాడు వినలేదు. నిరుత్సాహపడలేదు. ఏమైనాసరే సొరంగం తవ్వాల్సిందేననుకున్నాడు. సాయం రమ్మంటే ఒక్కరూ రాలేదు పాపం. అప్పుడాకుర్రాడు ఏం

జేశాడో తెలుసా? అందరిమీదా కోప్పడ్డాడా? లేదు. అందర్నీ తిట్టాడా? లేదు. అందరితోబాటు తనూ కిమ్మనకుండా పూరుకున్నాడా? లేదు. పలుగూపారా అందుకుని కొండని తవ్వటం ప్రారంభించాడు.

అంతావాణ్ని పిచ్చివాడికింద చూశారు. నవ్వేరు. మందలించారు. ఆ పని విరమించేట్లు చెయ్యాలని శతవిధాల ప్రయత్నించారు. ఊహూ- ఆ కుర్రాడు వినలేదు... తన పట్టు వదల్లేదు. ఇక లాభంలేదని వాడోపిచ్చివాడనుకుని వదిలేసి తమదారిన పోయారంతా.

ఠంగ్ఠంగ్మని శబ్దం వస్తోంది తప్ప కొండవగలటంలేదు. చెమటలు కారిపోతున్నాయ్. చేతుల్లోని శక్తి నశిస్తోంది. అయినా దీక్షనడల్లేదు. తవ్వుతూనే ఉన్నాడు పట్టుదలగా.

అలా కొన్ని రోజులు గడిచాయి. కొంచెం మాత్రం తవ్వగలిగాడు. ఇలా కొంచెంకొంచెం చొప్పున తవ్వితే చనిపోయేప్పటికి సారంగం నగం కూడా తవ్వలేవురోయ్ అని నవ్వేరంతా. నేను పోతే నాలాటివాడు మిగిలిన పని పూర్తి చేస్తాళ్ళే అని జవాబిచ్చాడు. మరికొంచెం తవ్వేడు. కొండ చాలా పెద్దది. అయితేనేం కొండ లొంగిపోతున్నట్లుగా అన్పించి మరింత దీక్షగా తవ్వసాగేడు.

ఓరోజున ఆకాశంలోంచి దేవుడు విహారానికెళ్తూ వెళ్తూ ఆ కుర్రాణ్ని చూశాడు. జాలేసి కిందకి దిగివచ్చాడు.

"కొండ చూస్తే పెద్దది. నువ్వేమో చిన్నవాడివి- సారంగం ఎలా తవ్వగలననుకుంటున్నావు బాబూ?" అనడిగాడు దేవుడు.

"నేను మొదలుపెట్టానండి- ఇవాళకాకపోతే రేపు, నేనుకాకపోతే ఇంకొకరు ఈ పని పూర్తిచెయ్యక పోతారా అని నా ఆశ.

"ఈ పని పూర్తవ్వకుండానే నువ్వు చనిపోయావనుకో- తర్వాతెవరో సారంగం తవ్వితే నీకేం లాభం చెప్పు?" అని ప్రశ్నించాడు.

దానికా కుర్రాడేమని జవాబిచ్చాడో తెలుసా పిల్లలూ?

"నా ఒక్కడికోసం ఇంతశ్రమపడి సారంగం తవ్వటం లేదండి! అందరికోసమూ తవ్వుతున్నాను. మావూరివాళ్ళకీ, పొరుగూరివాళ్ళకీ శ్రమ తగ్గుతుందని తవ్వుతున్నాను. తరతరాలవాళ్ళూ మాలాగా కొండచుట్టూ తిరిగెళ్ళాల్సిన శ్రమలేకుండా చెయ్యాలని తవ్వుతున్నాను-" అన్నాడు.

దేవుడెంతో సంతోషపడిపోయాడు.

"నేనుకూడా సాయం వస్తానుబాబూ- అంటూ పలుగు తీసుకుని తవ్వేడోలేదో క్షణంలో కొండ ఈ వక్కనుంచి ఆ వక్కవరకూ సారంగం ఏర్పడిపోయింది.

ఆ కుర్రాణ్ని దీవించి అదృశ్యమైపోయాడు దేవుడు."

కథ చెప్పటం పూర్తిచేసి పిల్లల మొహాల్లోకి చూశారు మాస్టారు. అందరూ ఉత్సాహంగా తనవంక చూస్తుండటమేకాదు వారి మొహాల్లోని వెలుగు చూసి పొంగిపోయారు.

"అందర్లా ఆ కుర్రాడూ నాకెందుకులే అని పూరుకుంటే ఎప్పటికైనా సారంగం మార్గం ఏర్పడేదా? ఊహూ.. ఆ కథ మనకి చెప్పే నీతి ఏమిటంటే- పదుగురికోసం ఎవరైనా మంచికార్యం చేబడితే దేవుడు కూడా తప్పకుండా సాయపడతాడు."

తలాడించారంతా.

మంచి నీళ్ళుతాగి కుర్చీలో వెనక్కి వాలారు మాస్టారు.

పిల్లలకోసం చెప్పిన ఆ చైనా దేశపు జానపదకథ తనకీ, తన ఊరికీ కూడా అన్వయిస్తుందన్పించింది.

ఎవరో వచ్చి పిల్లిమెడలో గంటకడతారని చూస్తూ కూర్చునేకన్నా తానే ముందు కదుగెందుకెయ్యకూడదు?

★ ★ ★

మాస్టారు బడినుంచొచ్చి చొక్కాతీసి వంకెకి తగిలిస్తోంటే వంటింట్లోంచి సరిత గొంతు విన్పించింది.

"ఏమ్మా సరితా - అంతా బావున్నారా?" లోపలికెళ్ళి పలకరించారు.

తలొంచుకుని తలాడించింది- కళ్ళల్లో కదిలిన కన్నీటి పొర కన్పించకుండా.

అయినా ఆ సంగతి పితృహృదయం పసిగట్టింది.







"అల్లుడు ఇదివరకట్లానే వుంటున్నారా లేక..." ఆవేదనగా చూశారు.

"బాగానే వుంటున్నారు నాన్నా..."

"ఊఁ..." నిట్టూర్చారు.

"పిల్లలైనా తీసుకురావాల్సింది నాలుగురోజులుండి వెళ్దురు"

"వెంటనే వెళ్ళిపోవాలి నాన్నా"

ఉలిక్కిపడి చూశారు.

"తర్వాత మాట్లాడుకోవచ్చుగాని ముందు కాళ్ళూచేతులూ కడుక్కోండి"

భార్యవంక అనుమానంగా చూశారు.

ఆయన చూపుల్నుంచి తప్పించుకు వెళ్ళి

పోయిందామె.

ఉస్సురని కదిలారు.

ముఖమూ కాళ్ళూ కడుక్కొని అరుగు మీది పడక్కుర్చీలో కూర్చున్నారు మాస్టారు. టీ తెచ్చింది శారద.

"అమ్మాయి ఏమంటోంది...?"

"ఎప్పటి భాగోతమే!"

"అంటే అల్లుడు మళ్ళీ..."

"డబ్బు తెమ్మని తరిమాడు. స్కూటరు మూలనపడిందిట. వెయ్యి రూపాయలు కావాల్ట!" విసుగ్గా అంది.

బాధ రెపరెపలాడిందాయన వదనంలో.

సరిత!

సరిగమపదనిస... అంటూ గొంతెత్తి శ్రావ్యంగాపాడే తెల్లని కోయిల. సన్నగా సరదాగా ఆడేపాడే రాయంచ. కళ్ళల్లో మెరుపులూ పెదాలమీద మందహాసం నిత్యం నర్తించే మల్లెమొగ్గ.

ఆమెలానే ఆమె వైవాహిక జీవితం కూడా సరాగాలాలపిస్తుందనెంతగానో ఆశించి శక్తిని మించి కట్నమిచ్చి నందనరావుకి కన్యాదానం చేశారు.

కానతడామె జీవితాన్ని నందనవనం చెయ్యలేదు. మరుభూమిచేశాడు. ఆమె సంగీతపు ప్రపంచంలోకి అపస్వరంలా ప్రవేశించి ఆమెరంగుల కలల్ని చిన్నాభిన్నం చేసేశాడు!

నిట్టూర్చారు మాస్టారు.

"ఒకసారి టీవీ కొనాలి. ఇంకోసారి స్వంత ఇంటికోసం వాయిదా కట్టాలి. మరోసారి ఇంకేవో చెయ్యాలి- ఇలా అయినదానికీ కానిదానికీ అల్లుడు మన పీకలమీద కూర్చుంటే ఎలాగ? పెళ్లయ్యేక వాళ్ళ బాగోగులు వాళ్ళు చూసుకోవాలిగాని ఇంకా మనమీద స్వారీచేస్తానంటే మనం మాత్రం ఎంతసేపు పరుగెత్తగలం? ఏమైనా అంటే మధ్యన అమ్మాయిమీద చేయి చేసుకుంటాడు. నిక్షేపంలాంటి ఉద్యోగం చేసుకుంటూ కూడా ఇంత అత్యాశ అయితే ఎల్లాగ? దీనికేదో అంతం చూడాల్సిందే"

అంది శారద.

"సముద్రానికైనా అంతముంటుందేమో గాని ధనతృష్ణకి అంతముండదు శారదా? అమ్మాయినిచ్చిన పుణ్యానికి అల్లుడి కాళ్ళు కడిగి ఆ నీళ్ళు నెత్తిన చల్లుకోవడమేకాదు- అతగాడి గొంతెమ్మ కోర్కెలు కూడా తీర్చాల్సిన దౌర్భాగ్యపు వ్యవస్థలో పీకలదాకా మునిగిపున్నాం. తప్పదు... వాళ్ళ వికటాట్టహాసాల్నీ వికృతపు చేష్టల్నీ భరించకతప్పదు!"

"లేదు నాన్నా... ఇంకా భరించగల ఓపిక నాకు లేదు"

"సరితా... అంతమాటనకమ్మా! నీకా ఇంట్లో సుఖంలేదని తెలుసు. అయినా పిల్లలకోసం... తప్పదమ్మా..."

"వాళ్ళని తలచే ఇంకా మీ కళ్ళముందు తిరుగుతున్నాను. లేకపోతే ఎప్పుడో...!"

"సరితా!"

బావురుమందామె.

శారద కూడా ఏడ్చేసింది.

"ఊరుకోమ్మా... నువ్వెప్పుడూ అలా ఆలోచించకు. చావుదేనికీ పరిష్కారంకాదు. ఈ ప్రపంచం చాలా విశాలమైందమ్మా! నువ్వా నరకపు గూటిలో ఇమడలేనప్పుడు స్వేచ్ఛగా బయటికొచ్చెయ్. నాలికమీద, నాలుగక్షరం ముక్కలు ఉన్నదానివి. నీకూ నీ పిల్లలకీ ఏ లోటూరాదు. పైగా తలెత్తి సగర్వంగా బతగ్గలవు"

"బాగానే వుంది... అదా మీరు దానికి నూరిపోసేది? దాని అత్తకి తెలిసిందంటే ముందే మీద కిరసనాయిలు పోసేస్తుంది!"

"అలాఅని కుక్కినపేనులా పడుండాల్సిన ఖర్మ దానికిలేదు"

"నిజమేనండీ... అలాగన్చెప్పి కాపురాన్ని కాలదన్ని రాలేదుకదా! ఇంకేదో పరిష్కారం ఆలోచించాలిగానీ..."

"దానికొకటే పరిష్కారం... ఆ చెక్కా ఇలా ఇయ్యి"

"నాన్నా... నా గురించి మీరు అప్పులపాల వ్వొద్దు"

"పిచ్చిదానా... నీ గురించి కాదమ్మా మా బిడ్డ సుఖంకోసం. కాలుకందకుండా పెంచిన మా చిట్టితల్లి అడకత్తెరలో పోకచెక్క కాకూడద




నమ్మా మా తాపత్రయం''

ఆమె తల నిమిరి కళ్ళు తుడుచుకున్నారు.

పైపంచె భుజాన వేసుకుని నరసింహం ఇంటివైపు నడిచారు. తాను సాలెగూడులో చిక్కుకుపోతున్న సంగతి గ్రహించగల స్థితిలో లేరు మాస్టారు.




నరసింహంగార్లోని సింహం నరుణ్ని చంపేసిందనీ వెరశి సింహం మాత్రం మిగిలి వుందనీ ఆయన్నెరిగినవాళ్లంతా అంటుంటారు.

'అబ్బే... నేను పళ్లు లేని ముసలి సింహాన్ని' అంటారాయన బోసిగా నవ్వేస్తూ.

'ఆయనవి పైకి కన్పించని విషపు పళ్లు' అంటారాయన పంజా దెబ్బతిన్న వాళ్లు.

ఏమైతేనేం గ్రామంలోనివాళ్లందరికీ ఆయన షావుకారు.

అప్పులివ్వడం ఆయన ప్రధాన వృత్తి. పొలాలమీద, పంటలమీద, పశువులమీద, ఇళ్లమీద, బంగారంమీద, వెండిమీద-మనుమలమీద తప్ప కాస్త విలువున్న ప్రతిదానిమీదా అప్పులిస్తుంటాడు. అందుకే ఆయన షావుకారయ్యాడు.

ఏదో బలహీనక్షణాన ఆయన దగ్గరికెళ్లి తమ పుట్టు పూర్వోత్తరాలు చెప్పుకోనివాళ్లావూళ్లో అతి కొద్దిమంది మాత్రమే వున్నారంటే అబద్ధం కాదు. ఒక్కసారి ఆయన్ని ఆశ్రయిస్తే ఆ తర్వాత ఆయన చెప్పే షరతులకి తలవూపక తప్పదు. తమ పొలాల్నో ఇళ్ళనో తక్కువ ఖరీదుకి ఆయనకి రాసిచ్చేసి నెత్తిన చెంగేసుకుని పట్నాలకు వలసపోక తప్పదు.- కనీసం కొందరికైనా.

యమధర్మరాజుకి చిత్రగుప్తు డెలాగో ఆయనకి వంతులు అలాగ.

చిత్రగుప్తుడి రాత ఇతరులకి అర్థమవుతుందేమోగాని వంతులి రాత వంతులిక్కూడా అర్థంకాదు. అయినా ఆ రాత తనకి లాభకరమే అని షావుకారు విశ్వసిస్తుంటే తమ రాతల్ని మార్చేస్తుందేమోనని భయపడుతూంటారు జనం.

షావుకారుగారబ్బాయి సుదర్శనం ధాన్యం కమీషనర్. అంటే రైతుల దగ్గర ధాన్యం కొని మిల్లులకి అమ్ముతూ మధ్యన బస్తాకి మూడో నాలుగో కమీషన్ కింద గుంజుతూంటాడు. షావుకారు దగ్గర అప్పుతీసుకున్న రైతులంతా ధాన్యం సుదర్శనం ద్వారా అమ్మితీరాల్సిందే. ఆ రూలు అతిక్రమిస్తే ఉప్పు పుట్టదెవరికీ.

సుబ్బరామయ్య విషయంలో అదే జరిగింది.

ఆయన బక్క రైతు. అయిదెకరాల భూమి వుంది. కాని ఆదాయం తిండికి, బట్టకూ సరిపోకుండా వుంది. ఆమధ్య కూతురి పెళ్లి నిమిత్తం షావుకారు దగ్గర అప్పుచేశారు. అయితే గుండెల మీదినుంచి ఓ కుంపటి దింపుకుని మరో కుంపటి ఎత్తుకున్నట్టయింది. వడ్డీ తీర్చడానికే వూపిరందక గిలగిల తన్నుకొంటుంటే ఓ చిన్న సంఘటన జరిగింది.

అవడానికది చిన్నదేగాని కోతి పుండుని బ్రహ్మారాక్షసిగా చేశారు షావుకారు.

సుబ్బరామయ్య అల్లుడిది ఆ సమీప గ్రామమే. అతడు కొత్తగా కమీషన్ వ్యాపారం ప్రారంభించాడు. సహజంగానే మావగారి ధాన్యం తననే అమ్మమన్నాడు. తప్పులేదాయనకి.సుదర్శనంకన్నా బస్తాకి అయిదు రూపాయలు ఎక్కువ ఇస్తుండటమేగాక సొమ్మంతా ఒక్క రోజులో ఇచ్చెయ్యడం కూడా ఓ కారణమని చెప్పాలి. సాధారణంగా సుదర్శనం ధాన్యం అమ్మిన వారం పది రోజులకి డబ్బిస్తుంటాడు. ఈసారి కొడుక్కి కాలేజీ ఫీజు కట్టడానికి డబ్బు అత్యవసరమయ్యిందాయనకి.

ఈ సంగతి షావుకారికి తెలిసి అదిరిపడ్డారు. మిగతా రైతులు కూడా సుబ్బరామయ్య అల్లుడి వైపు మొగ్గుచూపుతున్నారని చెవినబ

డేసరికి ఆయన కన్నెర్రబడింది.

దానితో సుబ్బరామయ్యకి కష్టాలు ప్రారంభ మయ్యాయి.

వ్యవసాయపు పెట్టుబళ్ళకి డబ్బు అవసర మై అప్పుకోసం వచ్చేడు సుబ్బరామయ్య.

గొంగళి పురుగులా విదిలించేశారు షావుకా రు. పైగా తన పాత అప్పు తీర్చమని పీకల మీద కూర్చున్నారు. వడ్డీ సొంతం కట్టలేదని రాపాడిస్తున్నారు.

ఏటికెదురీదలేమని తెలిసిపోయింది. పొలం అమ్మి ఊబినుండి బయట పడదామని బేరం పెట్టేరుగాని కొనేవాళ్లక్కడా లేకుండా కట్టడిచేశారు షావుకారు.

ముందు గొయ్యి, వెనుక నుయ్యి.

గిలగిల్లాడుతున్నాడు సుబ్బరామయ్య.

షావుకారు తూగుడు బల్లమీద విష్ణుమూ ర్తిలా పవ్వళించి కునుకు తీస్తున్నారు- తమ లోగిలిలోని మండువాలో.

ఓపక్కన రాత బల్లముందు కూర్చుని బ్రహ్మ రాత రాసేస్తున్నాడు పంతులు మధ్య మధ్య ముక్కుపొడుం దట్టిస్తూ.

సుబ్బరామయ్య వచ్చేడు.

"ఎవరూ" కళ్లజోడు పైనుంచి చూసి "ఓ హెూ- తమరా రండి... రండి- ఏమైనా జమక డుతున్నారా?" అనడిగాడు పంతులు.

"లేదు పంతులుగారూ... కొంచెం గడువి స్తే...."

"నీకూ నాకూ చచ్చేవరకూ గడువిచ్చినా జమ కట్టకుండానే చచ్చూరుకుంటామయ్యా" అని కసురుకుని-

"అయ్యా! సుబ్బరామయ్య వచ్చాడు" అన్నాడు గట్టిగా.

"ఏ సుబ్బరామయ్య?" కళ్లు తెరవకుండానే అడిగారు షావుకారు.

"మనూరి సుబ్బరామయ్యే"

"తండ్రి పేరు?"

"శివయ్య"

అదిరిపడి లేచి కూర్చుని కాల్చేసేలా చూశా రు. "వట్టి చేతుల్తో వచ్చావేం- చేతులు నరు క్కోనా?"

అప్పుకోసం వచ్చినప్పుడెంత సరళంగా మాట్లాడతారో తీర్చనప్పుడంత పరుషంగానూ మాట్లాడతారు. అందుకనే ఆయనకి పాములా రెండు నాలుక లున్నాయంటారు కిట్టనివాళ్లు.

"కొంచెం గడువిస్తే...."

"ఇవ్వను... చచ్చిగీపెట్టినా ఇవ్వను. ఇంకో రెండ్రోజులు చూస్తాను. తీర్చకపోయావో పశువు ల్ని వేలం వేయిస్తాను. ఇంటినీ పొలాన్నీ జప్తు చేయిస్తాను. నిన్ను జైల్లోపెట్టిస్తాను. ఏ అల్లుడు నిన్నాదుకుంటాడో నేనూ చూస్తాను. దిష్టిబొ మ్మలా నిలబడ్డావేం- ఫో అవతలికి. ఆపత్సమ యంలో ఆదుకుంటున్నానన్న విశ్వాసం కూడా లేని జంతువ్వి నువ్వు. నీ నీడపడినా మహాపా తకం చుట్టుకుంటుంది. ఫో. ఇంక..."

ఒగర్చసాగాడు షావుకారు.

బిక్కచచ్చివెనుదిరిగాడు సుబ్బరామయ్య.

దారిలో ఎదురయ్యారు మాస్టారు.

"అలా వున్నారేంటి...?" మాస్టారే పలక రించారు.

"మామూలు ఝంఝాటాలేనండి. నాలుగు రోజుల్నుండి మీ దగ్గరకి రావాలని చూస్తున్నా నుగాని వీలుపడలేదండి..."

"ఏమైనా పనుందా?"

"పనంటే పనికాదనుకోండి- మావాడి గు రించి మాట్లాడదామనీ..."

"భార్గవ గురించా? వాడి గురించి మీరేం బెంగపెట్టుకోవద్దు. వాడు మెరిట్ స్టూడెంటు. నా ప్రియశిష్యుడు- ఏమనుకుంటున్నారో" చిన్నగా నవ్వుతూ గర్వంగా అన్నాడు.

తలాడించి మెల్లగా అన్నారు- "ఈమధ్యన అల్లరి చిల్లరిగా తిరుగుతున్నాడని తెలి సింది"

విస్మయంగా చూశారు మాస్టారు. "నేన్నమ్మ ను- ఎవరో కిట్టనివాళ్ళు..."

"కిట్టనివాళ్ళు కాదండి... పోలీసులు కూడా చెప్పేరు"

"పోలీసులా... ఏం జరిగిందనలు?" ఆదు ర్దాగా అడిగారు.

"ఏదో విద్యార్థి సంఘంలోనంట, చురుగ్గా




# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం— బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



తిరుగుతున్నాడంట..."

"అరె... అలాగా!"

సుబ్బరామయ్య మరీ ఇదైపోవటం చూసి నర్దుకున్నారు మాస్టారు. "మీరేం ఇదవ్వకండి. వేడి రక్తం కదూ చిన్న అన్యాయాన్ని కూడా సహించలేక ఎదురుతిరుగుతూంటారు కుర్రాళ్ళు. నేను భార్గవతో మాట్లాడతాను కదా. ఓసారి నాక్కన్పించమని చెప్పండి"

ఆ తండ్రి ఆందోళనని మరోకోణం నుంచి చూశారు తప్ప పరిస్థితిని అంచనా వెయ్యటంలో విఫలమయ్యారు మాస్టారు.

"వాణ్ని మీరే దార్లోకి తీసుకురావాలి మాస్టారూ! లేకపోతే... లేకపోతే... నాకుటుంబం మట్టిగొట్టుకుపోతుంది!" గొల్లుమన్నారు నడిరోడ్డుమీదే.

షావుకారుగోళ్ళు సుబ్బరామయ్య శరీరంలో దిగబడ్డాయని మాస్టారికి తెలుసు, జరగబోయే తంతూ తెలుసు. సానుభూతిగా చూసి ఓదార్చి భారంగా ముందుకడుగేశారు.

"ఎవరూ... మీరా మాస్టారూ... రండి రండి-కూర్చోండి" ఆహ్వానించాడు పంతులు.

"షావుకారుగారు నిద్రపోతున్నారుకాబోలు-మళ్ళీ వస్తాన్లెండి" "వచ్చినవారు వూరికే తిరిగెళ్తే అయ్యగారు బాధపడిపోరూ? కూర్చోండి"అన్చెప్పి-

"అయ్యా... మాస్టారొచ్చారు" అన్నాడు షావుకార్తో.

"ఏ మాస్టారు?"

"మనూరి మాస్టారు"

"తండ్రిపేరు?" అలవాటుగా అడిగాడు.

"మనవూరి బడిపంతులండీ."

"ఓహెూ... మాస్టారా- కూర్చోండి. ఏమిటి చాన్నాళ్ళకొచ్చారు?"

"ఒక వెయ్యి రూపాయలు కావాలండి..."

"మీకు తెలీందేవుంది మాస్టారూ! ఈమధ్యన గాలి బాగాలేదు. వడ్డీ వ్యాపారం తగ్గించేద్దామనుకుంటున్నాను. అందరిచేతా ఆడిపోయించుకోవడం తప్ప కలిసొచ్చేదేముంది చెప్పండి! ఏ సినిమాహాలో కట్టుకున్నా కడుపులో చల్లకదలకుండా లక్షలు సంపాదించుకోవచ్చు"

"ఎంతో ఆశతో వచ్చాను. ఈసారికైనా ఇస్తే..."

"కంగారుపడకండి మాస్టారూ మీకు లేదంటానా? కానీ ఇదివరకు ఎక్కువే ఇచ్చాననుకుంటాను... ఏం పంతులూ?"

"ఇంతవరకూ మాస్టారు తీసుకున్న అప్పు వడ్డీతోసహా ఇవాల్టికి అక్షరాలా పధ్నాలుగు వేల ఏడువందల యాభై ఒక్క రూపాయల అరవై మూడు పైసలయ్యిందండి"

"చాలానే వుందే. మాస్టారిల్లు పెద్దగా ఖరీదు చెయ్యదనుకుంటాను"

"రిటైరైతే గవర్నమెంటు బోల్డు ఇస్తుందండీ! పైగా కొడుకు డాక్టరాయె!" అన్నాడు పంతులు.

"అవునుకదూ... ప్రోనోటు రాయి. ఎంతకావాలంటే అంత తీసుకోండి మాస్టారూ"

"ప్రస్తుతం వెయ్యి చాలండి"

"మీ ఇష్టం... మా మనవళ్ళు బాగా చదువుతున్నట్టు లేదండీ! మీరు కాస్త శ్రద్ధ తీసుకుని రెండు ముక్కలు చెప్పండి మాస్టారూ"

"బాగానే చదువుతున్నారే"

"ఏం బాగాలెండి. మీ ఇంటికి పంపిస్తాను-పొద్దున్నో సాయంత్రమో ఓ గంటసేపు చెప్పకూడదూ?"

"అలాగేనండి. పంపించండి"

"ఎలాగైనా మాస్టారు చాలా పెద్దమనిషి"

ప్రోనోటు మీద సంతకం పెడుతోంటే ఎందుకో మాస్టారి చెయ్యి వణికింది.

★ ★ ★

వంతెన దగ్గర బస్సాగింది.

కుర్రాళ్ళు బేగ్గులు భుజాలకి తగిలించుకుని దిగారు.

దుమ్మురేపుకుంటూ వెళ్ళిపోయింది బస్సు.

ఓపక్క పంటలకి జీవనాధారమైన పంటకాలువ నిండుగా ప్రవహిస్తోంది. మరోపక్క పచ్చని తివాచీ పరచినట్టున్న వరిచేలు మందహాసం చేస్తున్నాయి. చేలగట్లు మీది కొబ్బరి చెట్లు తలలూపుతూ స్వాగత గీతాలాలాపిస్తున్నాయి.

"సూపర్బ్... ప్రకృతి చాలా బాగుంది. రేయ్! పల్లెటూరివాళ్ళు నిజంగా చాలా అదృష్టవంతులా... వచ్చని ప్రకృతి, పరిశుభ్రమైన గాలి, నిర్మలమైన నీరు, పౌష్టికాహారం- ఓహ్... ఎంత అదృష్టం!" సుబ్రహ్మణ్యం పరవశించాడు.

"స్టాప్ స్టాప్... ఇంక చెప్పొద్దు. ఎన్నడూ పల్లెమొఖం చూసెరుగని పట్నంబాబువని తెలుస్తూనేవుందిగాని మనమీ పల్లెలో మూడునెలలుంటాం. మన గైడు ఒప్పుకుంటే మరో మూడు నెలలు ఇక్కడే వుంటాం. లేదా మరోపల్లెలోవుంటాం. అంచేత వెళ్ళేప్పుడు చెబుదువుగాని పల్లెల గురించీ, పల్లెజనం గురించీ" నవ్వేడు శివం.

"పల్లెటూరు మన భాగ్యసీమరా- అని సినిమాల్లోనే పాడుకోవాలి గురూ. వాస్తవంలో కాదు" మౌత్ ఆర్గాన్ బయటికి తీస్తూ అన్నాడు గాంధీ.

"మన భవిష్యత్తులు విలేజస్‌తో ముడిపడి వున్నాయి. చెడుని మంచిగా మార్చుకుంటూ ముందుకి సాగకతప్పదు. పదండి" జాన్సన్ అన్నాడు.

"పదండి ముందుకు పదండి తోసుకు పోదాం పోదాం పైపైకి..." గొంతెత్తాడు గాంధీ.

"ఎంత దూరం నడవాలి బ్రదర్?"

"మూడు కిలోమీటర్లు. అంటే మనమిప్పుడు మా ప్రెసిడెంట్ రాయుడిగారి రాజ్యంలో ప్రవేశించామన్నమాట"

"అబ్బో— అంత గొప్ప రాజా... అయితే చూడాల్సిందే" గాంధీ అన్నాడు.

"నువ్వే చూస్తావుగా" అన్నాడు శివం.

వాళ్ళారుగురూ అగ్రికల్చరల్ బియస్సీ స్టూడెంట్స్. 'రావే' ప్రోగ్రాం అంటే రూరల్ అగ్రికల్చరల్ వర్క్ ఎక్స్‌పీరియన్స్ ప్రోగ్రామ్ నిమిత్తం ఆ వూరొచ్చారు. అగ్రికల్చరల్ రీసెర్చి స్టేషన్‌కి చెందిన అగ్రికల్చరల్ ఎక్స్‌టెన్షన్ స్పెషలిస్టు వారికి ప్రోగ్రాం కోఆర్డినేటర్‌గానూ, గైడ్‌గానూ వుంటారు. ఆయన వారికి సీతారామపురం ఎలాట్‌చేశారు. వాళ్ళంతా ఒక్కొక్కరూ ఒక్కో మంచి రైతుని ఆశ్రయించి వుండాలి.

సామాన్యంగా రావే ప్రోగ్రాం ఖరీఫ్ సీజన్లో ఆరునెలలుంటుంది. ఒకేగ్రామంలోగాని, విభిన్న పరిస్థితులకూ, పంటలకూ ఎక్స్‌పోజ్ చెయ్యబడటానికి వీలుంటుందనుకుంటే రెండు గ్రామాల్లోనూ వుండాల్సుంటుంది.

రైతుల్తోబాటు వుంటూ, పనిచేస్తూ, నలహోలిస్తూ వారి వ్యవసాయపద్ధతులలో అనుపానులూ, అభిప్రాయాలూ తెలుసుకోవాలి. కాలేజీలో నేర్చుకొన్న విషయాలు కార్యాచరణలోపెట్టడం వారానికోసారి రీసెర్చి స్టేషన్‌కెళ్ళి తామునేర్చుకొన్నదీ, గమనించినదీ రిపోర్టుచెయ్యాలి. వివిధ రికార్డులూ తయారుచేయాలి.

రావే ప్రోగ్రాం అయ్యాక ఇంకో సెమిస్టరు వుంటుంది. దాంతో డిగ్రీ కోర్సు పూర్తవుతుంది.

ఆ వూరికి ఎలాట్‌చేయబడిన వాళ్ళలో శివం తప్ప రాష్ట్రం నలుమూలలకీ చెందినవాళ్ళే... శివం మాత్రం ఆ వూరివాడు.

ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

ఒకచోట బోదె దగ్గర ఇద్దరు ఘర్షణపడుతూండటంచూసి ఆగారు.

వారిలో బలంగావున్నతను బక్కవాడిని ఒక్కతన్ను తన్నాడు. వాడెళ్ళి బోదెలోపడ్డాడు.

బాణంలా రివ్వున దూసుకెళ్ళాడు శివం బోదెలో పడ్డతనికి చేయి అందించి బయటికి లాగుతూ- "ఏమిటీ దౌర్జన్యం?" అనడిగాడు.

కాని కండలుతిరిగి వస్తాదులా ఉన్న వ్యక్తి జవాబివ్వలేదు. మౌనంగా వేగంగా బోదెలోని నీరు పక్కచేలోకి వెళ్ళకుండా అడ్డగట్టు వెయ్యసాగాడు. అతని పేరు వీరేశం.

లబోదిబోమన్నాడు బక్కవాడు సింహాద్రి.

"మీరే నాయం సెప్పండయ్య. ఇది నా పొలం. అల్లదిగో ఆకిందది రాయుడుగార్ది. ఆరి చేలోకి నీళ్ళు మళ్ళేదాకా నా పొలానికి నీళ్ళెట్టుకోకూడదంట. ముందుగాలున్నది నా పొలమే కదా బాబయ్య. నీటి చుక్కకోసం చేను ఎట్టాలల్లడిపోతాందో తమరే సూడండి..." మొత్తుకున్నాడు.

నంగతి అర్థంకావడంతో గబుక్కున ముందుకెళ్ళాడు శివం.

"ఎవడ్నువ్వు?" తీవ్రంగా చూశాడు వీరేశం.

"తర్వాత చెబుతానుగాని ముందు నువ్వేసిన అడ్డగట్టు తీసెయ్యి"

"తీత్తానికి ఏత్తంలేదు"

"ఎందుకేస్తున్నా తియ్యక తప్పదు"

"పేద్ద సెప్పొచ్చాడు మొగాడు... ఎల్లెల్లు" విదిలించేశాడు.

"వెళ్ళను... నిన్ను వెయ్యనివ్వను..." స్థిరంగా అన్నాడు శివం.

ఈలోగా మిగతావాళ్ళు కూడా వచ్చేసి, "ఏవిటయ్యా అంత దౌర్జన్యం?" అనరిచారు.

"పట్నంబాబులు మీకెందుకు... ఎల్లండెల్లండి"

"పట్నమైనా పల్లెనా న్యాయం ఒకటే. పై పొలానికి నీళ్ళు ఎక్కాకే కింది పొలానికి నీళ్ళు వెళ్ళాలి అదీన్యాయం"

"కిందపొలం ఎవర్దో తెలిత్తే మీరామాటనరు"

"ఎవరిదైతేనేం? న్యాయం... న్యాయమే"

"రాయుడుగోర్ది!" అని నవ్వి గట్టువెయ్యసాగాడు.

"ఆగు... ఎవడిదైనాసరే గట్టు వెయ్యడానికి వీల్లేదు. ముందీ చేను నిండనీ"

విస్మయంగా చూశాడు వీరేశం శివంవంక.

"ఒంటిమీద తెలివుండే మాటాడతున్నావా?"

"ఆఁ... నేనీవూరి వాడ్నే. రాయుడిగారి గురించి బాగా తెలునుగాని ముందిక్కడ్నుంచి నడు"

"రాయుడిగోర్తో సెప్పేనంటే పుచ్చెలెగిరిపోతాయి మరి"

"ఇక్కడెవరూ గాజులు తొడిగించుకోలేదు గాని మర్యాదగా నువ్వేసిన అడ్డగట్టు తీసేసి నడు"

"చెప్పింది చెయ్యి... అది నీ ఒంటికీ, మా బట్టలకీ మంచిది" గాంధీ అన్నాడు.

అతణ్ణి కాల్చేసేలా చూశాడు వీరేశం. వాళ్ళ మీదకి కర్రెత్తుదామనుకున్నాడో క్షణం. కాని ధైర్యం చాలిందికాదు. అడ్డగట్టు తీయకుండానే వినవిసా వెళ్ళిపోయాడు కసిదీరా తిడుతూ.

శివం అడ్డగట్టుని తోసేశాడు కాలితో.

నీరు వడిగా చేలోకి పారసాగింది.

చేతులుజోడించాడు బక్కరైతు సింహాద్రి.

"ఎడ్డుల మొత్తుకోళ్ల భాష కొందరికి అర్థంకాదు. ఆ సంగతి మనం తెలుసుకోకపోతే మనల్ని తుంగలో తొక్కేస్తారు" శివం అన్నాడు.

"జాగ్రత్తబాబూ- వీరేశం తాచుపాములాటోడు..." భయంగా అన్నాడు సింహాద్రి.

"మేం పాముల్ని పట్టుకుని ఆడించే వాళ్ళంలే" ముందు కదుగేస్తూ అన్నాడు శివం.

ఊళ్ళో ప్రవేశించారంతా.

గ్రామస్థులు వాళ్లవంక చిత్రంగానూ, కుతూలంగానూ చూడసాగేరు. కొందరు కుశలప్రశ్నలేశారు. ఎక్కువ మందడిగింది ఒకటే ప్రశ్న- "ఎవరింటికి?"

"ఊరింటికి" అని నవ్వి, "మాస్టారింటికి" అని చెప్పసాగేడు శివం. "ముందు మాస్టారింటికెళ్దాం"మన్న శివం మాటలకి- "పద- నువ్వు చెప్పింది విన్నాక మాస్టార్ని చూడాలని మాకూ ఎంతో ఇదిగా ఉంది" అన్నాడు గాంధీ.

"ఈ రోజుల్లో కూడా డెడికేటెడ్ టీచర్స్ ఉన్నారంటే అది ఎనిమిదో వింతే మరి" జాన్సన్ అన్నాడు.

"అయితే పల్లెటూళ్ళల్లోని ఉపాధ్యాయులు కూడా చక్కని వాళ్ళేనన్నమాట. ఎంతదృష్టం. టౌన్‌లో ట్యూషన్ మాస్టార్లేగాని బడిలో పాఠాలు చెప్పేక్లాసు మాస్టార్లుండరు"

సుబ్రమణ్యం మాటలకి నవ్వేరంతా. వాళ్లెందుకు నవ్వేరో అర్థంగాక బుర్రగోక్కున్నాడతడు.

★ ★ ★

"నమస్కారం మాస్టారూ"

శివంని చూస్తూనే పరమానందపడిపోయారు మాస్టారు.

"నువ్వటోయ్... రారా- ఎలావున్నావ్ ఏవిటీ?" అన్నారు ఎదురొచ్చి ఆప్యాయంగా అక్కున చేర్చుకుంటూ.

"బాగానే ఉన్నాను మాస్టారూ"

"శారదా... ఎవరొచ్చారో చూడు" "ఎవరూ?" అంటూ వచ్చిందిశారద. ఆమె మొఖం విప్పారింది.

"నువ్వా శివం... రారా- చాన్నాళ్ళయ్యింది

చూసి. ఈమధ్య బొత్తిగా నల్లపూసైపోయావ్. ఉత్తరంముక్క రాసేంత తీరుబడి కూడా లేద న్నమాట''

''అది కాదమ్మా... ఫైనల్ ఇయర్‌కదా. ఇదిగో ఇప్పుడు ఫ్రెండ్స్‌తోసహా వచ్చేశాను. కనీసం మూణ్ణెల్లపాటు మీ కళ్ళముందే తిరుగుతాం''

''సంతోషం బాబూ... రండి కూర్చోండి...'' అంటూ లోపలికెళ్ళి టీ తయారు చెయ్యసాగింది.

''రండిబాబూ... కూర్చోండి. మీరేం సంకోచించొద్దు. ఇది మీ ఇల్లే అనుకోండి'' మాస్టారన్నారు అరుగుమీద చాపపరుస్తూ.

ఒక్కొక్కర్నీ పరిచయం చేస్తూ, ''వీడు గాంధీ అండి. చాలా సరదామనిషి. శ్రావ్యంగా



పాడతాడు. మిమిక్రీ కూడా చేస్తాడు'' అన్చెప్పే డు శివం.

''గాంధీ... చాలా మంచిపేరు బాబూ. మీ నాన్నగారికి దేశాభిమానం ఎక్కువన్నమాట''

''పేరులో ఏముందన్నాడు షేక్స్‌పియర్. గులాబీని మరో పేరుతో పిలిచినా దాని సువాసనపోదు కదా?'' జాన్సన్ అన్నాడు.

''నిజమే బాబూ... కాని కొన్ని పేర్లు కొన్ని ఉద్యమాలతో, సంఘటనలతో ముడిపడి ఉంటాయి. ఆ పేర్లని మంత్రంలా ఉచ్చరిస్తే చాలు ఉత్తేజితులవుతాం. అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, సుభాష్‌చంద్రబోస్‌లాంటి మహావ్యక్తులపేరు చెబితే చాలు మనరక్తం ఉప్పొంగదా చెప్పండి.''

''మాస్టారు పూనుకోకపోతే నేనేమైపోయేవాడ్నో తలచుకుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది'' అన్నాడు శివం.

''నాదేముంది శివం... నీ కృషి, పట్టుదలా నిన్నింతవాణ్ణి చేశాయి''

''అలాగనకండి మాస్టారూ... శివం నాకంతా చెప్పేడు. ఎదిగేదశలోనే మొక్కకి పూతంకావాలి. నీరు కావాలి. అప్పుడు నిలబడగలిగిందంటే తర్వాత్తర్వాత పెనుతుఫానుల్ని కూడా తట్టుకోగలదు'' గాంధీ అన్నాడు.

''బాగా చెప్పేవుగాంధీ... మీలాంటి యువకులే ఇది గాంధీ పుట్టిన దేశమని ప్రపంచానికి సగర్వంగా సాధికారంగా చెప్పే రోజుని తీసుకురావాలి''

''మనది గాంధీపుట్టిన దేశమేకాదండీ గాంధీని చంపిన దేశంకూడానూ''

''అవునయ్యా... గాంధీనే కాదు, ఆయన ఆదర్శాలను కూడా హత్యా చేశాం. ఆ పాపాన్ని ప్రక్షాళనం చెయ్యగలశక్తి మీకే ఉంది. చెయ్యాల్సిన బాధ్యత మీమీదే ఉంది''

''తాపీగా చర్చించుకుందురుగాని ముందు టీ తాగండి- చల్లారిపోతోంది'' శారద అంది.

''గాంధీజీ చెప్పిందంతా మనకి శిరోధార్యమంటారా?'' జాన్సన్ ప్రశ్నించాడు.

''అంతా శిరోధార్యమని ఎవరూ అనరనుకుంటాను. ఎంచేతంటే గాంధీజీతత్వం కొన్ని ఆదర్శాలకి కట్టుబడివున్నది. కొన్ని ప్రత్యేక సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితుల్లో రూపుదిద్దుకున్నవి ఆయన ఆలోచనలు. ఇప్పుడా పరిస్థితులు మారాయి. ఆయన బతికుండగానే హిందూముస్లింలకలహాలు చూసి మనుమలెందుకిలా ప్రవర్తిస్తారా అని కలతపడ్డారు. ఇప్పుడిహ చెప్పేదేముంది? ధనికులతో 'మీరు మీ ఆస్తిపాస్తులకి ధర్మకర్తలుగా వ్యవహరించండి' అంటే వింటారా చెప్పండి? అందువల్ల కాలంతోబాటే ఆలోచనలూ, సిద్ధాంతాలూ మారకతప్పదు. దేశకాలమాన పరిస్థితుల్నిబట్టి రూపుదిద్దుకోక తప్పదు. గాంధీ సిద్ధాంతమైనా అంతే మార్క్స్ సిద్ధాంతమైనా అంతే''

''కాని గాంధీకన్నా మార్క్స్ సర్వజనావళి శ్రేయస్సుకి శాస్త్రీయమైన సిద్ధాంతం చెప్పేడనుకుంటాను''

''ఆ బాగోగులు చెప్పాల్సింది సిద్ధాంత విమర్శకులూ, మీలాంటి యజ్ఞకర్తలూనూ నేనేం చెప్పగలను? నేనో చిన్న బతకలేని బడిపంతుల్ని. నాది చాలా చిన్న ప్రపంచం'' నవ్వేరు మాస్టారు.

★ ★ ★

ఊరంతా చీకటిపాశాల్లో చిక్కుకుపోయింది గానీ, ప్రభుత్వ సారాయి దుకాణం మాత్రం పెట్రొమాక్స్‌లైట్ కాంతిలో వెలిగిపోతోంది.

దుకాణం ప్రాంగణమంతా తాగినవాళ్ళతోనూ, తాగటానికొచ్చినవాళ్ళతోనూ తినుబండారాలమ్మే వాళ్ళతోనూ సందడిగా ఉంది.

''ఏంటండోయ్ పోతురాజుగారూ- రెండుగలాసులేసుకున్నా మత్తెక్కటంలేదేంటండి బాబూ'' నారిగాడన్నాడు తూలిపోతూనే.

''నీకూ నాకూ రెండు గ్లాసులేమూలకురోయ్ పైసల్తియ్ ఇంకోటిస్తాను''

''పైసల్లేవండి... రేపిచ్చేత్తానుగాని బాబ్బాబు ఓ గలాసు పొయ్యండి''

''అరువు మనకాడలేదొరేయ్''

''బాబ్బాబు... మీ కాళ్ళకి దన్నమెడతాను సగం మందుతో నంపేయకండి''

''నీకూనాకూ డబ్బుక్కరువేంట్రా. ఎక్కడో ఓచూపు చూడు- జేబు నిండిపోద్ది''

''ఇయాలరేపు దొంగతనాలు మానేసేనండి''

''నువ్వా పెద్దమనిషివైపోతే దేశం ఏంకా




వాలోరేయ్ నారిగే" పోతురాజు మాటలకు నారిగానితోసహా అంతా వగలబడి నవ్వేశారు. చిన్నతనంగా అన్పించలేదు. పైగా అదేదో గొప్పతనంగా భావించి పొంగిపోతూ నవ్వేశాడు. నారిగాడు.

"మీమాటలకి నిసాపోయింది పోతురాజుగే రూ. రెండు గలాసులు అప్పియ్యాలి"

"ఏమైనా అడుగ్గానిరేయ్ అప్పుమాత్రం అడక్కు"

అక్కడున్న అందర్నీ అడిగాడు. దేబిరించాడు. అంతా విదిలించారు. అయినా సిగ్గువళ్ళేదు. మందుకోసం మనస్సు మారాం చేస్తోంటే ఒకరకమైన దాహంతో అల్లల్లాడిపోతూ బతిమాలసాగాడందర్నీ.

"ఒరే నారిగే- నువ్వింకా ఇక్కడే ఉన్నావేంట్రా- నీకొడుకు శివం వచ్చేడ్రా" అన్నాడొకడు వస్తూనే.

అదిరిపడ్డాడు నారిగాడు. నిషా పూర్తిగా దిగిపోయింది.

"ఏంటండి బాబు... శివంగాడా...?"

"నిజంగా వచ్చేడ్రా... కాలేజీ సేస్తాల్లో వచ్చేడు. మూణ్నెల్లదాకా వుంటాడంట. మాస్టారింటి కాణ్నుంచి ఇంతక్రితమే మీ ఇంటికెళ్లేడు"

"చచ్చేన్రోయ్" వరుగందుకున్నాడు నారిగాడు.

తన గుడిసె అల్లంతదూరాన కన్పిస్తోంటే అతడి కాళ్ళాగిపోయాయి. ఎంత ప్రయత్నించినా ముందుకడుగెయ్యనని మొరాయించాయి.

గుడిసెముందు వేసిన నులకమంచంమీద కూర్చునున్నాడు శివం. ఇరుగుపొరుగువాళ్ళొచ్చి కుతూహలంగా చూస్తూ కుశలప్రశ్నలేస్తున్నారు. అతడి తల్లి వుల్లల మంటమీద అన్నం వండుతూ కొడుక్కి కబుర్లు చెబుతోంది.

కొడుకుని చూస్తోంటే నారిగాడి కళ్ళు చెమ్మగిల్లాయి. దొరబాబులా ఉన్నాడు. తనలా పందుల్ని మేవుకుంటూ మేదరబుట్టలల్లి అమ్ముకుంటూ, చిల్లర మల్లర పనులుచేస్తూ గంజితాగాల్సిన అగత్యం వాడికి లేదుగాకలేదు!

ఇస్త్రీ బట్టలు తొడుక్కుని నీడపట్టున కాలుమీద కాలేసుకుని మహారాజులా బతుకుతాడు!

ఎంతదృష్టవంతుడు. దురదృష్టవశాత్తూ తన కొంపలో పుట్టినా వంకంలో పుట్టిన పద్మంలా వికసించాడు. తను తండ్రైవుండి కూడా లేశమంత సాయపళ్ళేదు. పైగా మాస్టారి దగ్గర పాలేరుగా కుదిర్చాడు. కానీ, అదే వాడి పాలిట వరమయింది. మాస్టారు వాడికి తిండీ బట్టాఇచ్చి అక్షరం ముక్కలు నేర్పారు. చదువు మీద వాడి ఆసక్తిచూసి బడిలో చేర్చుకున్నారు. తర్వాత పట్నంలో హైస్కూల్లో చేర్పారు. తనొక్క పైసా ఇవ్వకపోయినా హాస్టల్లో చేర్చి స్కాలర్ షిప్ తెప్పించి మధ్య మధ్య ఆయన కూడా కొంత డబ్బిచ్చి చదివించారు.

తనకి ఆసరాగా వుండేవాణ్ని చదువంటూ తీసుకుపోయినందుకు "నానోటికాడి కూడులాగేశారు" అంటూ మాస్టార్నెన్ని తిట్టాడప్పుడు! ఎన్నన్నా మాస్టారు కోప్పడలేదు. ముందు ముందు నువ్వే తెలుసుకుంటావన్నారు. కొడుకుని బలవంతాన హాస్టల్నుంచి తీసుకొచ్చేద్దామని కూడా తాను ప్రయత్నించాడుగాని శివం ఒప్పుకోలేదు. పైగా తనని అసహ్యించుకున్నాడు!

ఏమైతేనేం తన అజ్ఞానం వాడి కాళ్ళకి బంధాలు వెయ్యాలని చూసినా వాడు వాటిని మొండిగా తన్నేశాడు. తన బతుకు బాటని స్వయంగా వేసుకున్నాడు. ఇవాళ గొప్పవాడయ్యాడు. అదే పదివేలు తనకి!

మురిసిపోయాడు నారిగాడు.

కొడుకు దగ్గరికెళ్ళమని మనస్సు తొందరపెడుతోంది. కాని కాళ్ళు కలసి రావట్లేదు.

కొడుకుముందుకెళ్లటానికి తనకి మొహం చెల్లటంలేదంటే ఏమనుకోవాలి?

చూసి చూసి మరివుండబట్టలేక ముందుకడుగేశాడు.

"అయ్యా..." శివం కేకపెట్టాడు.

వరుగునవెళ్ళి కొడుకు చేతులు పట్టుకుని ఏడ్చేశాడు.

"ఊరుకో అయ్యా... ఏడుపెందుకు? వూరుకో"

శివం తలనీ వీపునీ నిమురుతూ ఉండిపోయాడు తప్ప పెదవి విప్పలేదు.

అతడికనుమానమొచ్చింది. "చుక్కేసుకు

న్నావా అయ్యా?"

తలొంచేనుకున్నాడు.

"ఎప్పుడూ ఇదే పనిరా బిడ్డా! ఆడా ఈడా వన్జెయ్యటవూఁ అదట్టుకెళ్ళి సారా కొట్టోడి మొకాన్ని కొట్టడవూ. ఈడితో ఏగలేక సత్తన్నానను కోరా. వన్దొరకనప్పుడు ఎక్కడో కన్నం ఏసేత్తాడు. ఆళ్ళట్టుకుని తన్నితే లబోదిబోమంటాడు. ఛీ-ఎధవ జలమ ఎందుకంట?" చిర్రుబుర్రుమంది తల్లి.

"అయితే నువ్వింకా మారలేదన్నమాట" విచారంగా అన్నాడు శివం.

"ఇంకేం మారడం- కాటికెల్లేకే మారాలి"

"తాగుడు మానెయ్యరా అయ్యా! అది గుండెల్ని తినేస్తుందిరా మనిషిని పీల్చిపిప్పి చేస్తుంది. ఆయుష్షుని తగ్గించేస్తుంది..."

"నాటుసారా కాదురా సర్కారు సారాయే తాగుతున్నా..."

తండ్రి వంక బాధగా చూశాడు శివం.

"ఏ సారాయైనా ఒకటే అయ్యా... అన్నీ హానికరాలే. ప్రజల ఆరోగ్యాల కన్నా ప్రభుత్వానికి ఆదాయం ముఖ్యమైపోయింది. అందుకే ప్రభుత్వ సారా వచ్చింది. తర్వాత ప్రభుత్వ లాటరీలొచ్చాయి. ముందు ముందు ప్రభుత్వ దొంగలూ, ప్రభుత్వ వ్యభిచారమూ వచ్చినా ఆశ్చర్యపడక్కర్లేదు"

అక్కడ చేరినవాళ్ళకి ఒక్క ముక్కా అర్థంకాలేదు. చిత్రంగా చూస్తూండిపోయారు.

ఆ చుట్టుపక్కలవాళ్ళంతా వెనుకబడ్డ కులాలవాళ్లు. ఒకప్పుడు సంచారజీవులు. తర్వాత్తర్వాత ఒకో వూళ్ళో స్థిరజీవనం ఏర్పరచుకున్నారు. అయినా జీవితాల్లో స్థిరత్వంలేదు. చిన్న చిన్న గుడిసెలు. ప్రక్కనే పందుల గుడిసెలు. పందుల్లాంటి జీవనం. ఒంటిమీద పూర్తి బట్టవుండదు.

ఇంత కష్టపడటం, ఎంతోకొంత సంపాదించుకోవడం, కల్లోగంజో తాగటం, తాగి తందనాలాడటం - ఇదీ వాళ్ళ జీవితం!

ప్రభుత్వం హరిజనుల గురించీ, గిరిజనుల గురించీ చేసిందాన్లో వందో వంతుకూడా ఈ వెనుకబడ్డ జాతులగురించి చెయ్యలేదు.





కారణం?

ఓట్లనుబట్టి మనుషులకు విలువిచ్చే పార్టీలు ఏలుతున్న కాలమిది!

ఏంచేస్తే వీళ్ళు బాగుపడతారు? వీరి జీవన విధానం మార్చటం ఎలాగ?- తీవ్రంగా ఆలోచించసాగాడు శివం.



3

మాస్టారు రైతుల్తో మాట్లాడి ఆరుగురు విద్యార్థులకీ ఆరిళ్ళల్లో ఆశ్రయం ఏర్పాటుచేశారు. మొదట వారి కులమతాల గురించీ, మంచిచెడ్డల గురించీ కొంచెంగా సంశయించినా మాస్టారి మాటని తోసిపుచ్చలేక వారిని తమ కుటుంబాల్లోని కాహ్వానించారు రైతులు.

గాంధీ సుబ్బరామయ్య ఇంట్లో ప్రవేశించిన వారంరోజులకల్లా ఆయన కుటుంబ పరిస్థితులు పూర్తిగా అర్థమయ్యాయి. ముఖ్యంగా ఆయన విధవ చెల్లెలు సునందని చూసి అతడి మనస్సు వేదనతో, సానుభూతితో నిండిపోయింది పట్టుమని పద్దెనిమిదేళ్ళైనాలేని ఆమెని తెల్లచీరలో, కళాహీనమైన ముఖంతో చూస్తోంటే. గుండెలు తరుక్కుపోతున్నాయి.

సుబ్బరామయ్యతో కలిసి పొలం వెళ్లేడు గాంధీ. వెన్నుమీదున్న వరి చేలకి పురుగు పట్టకుండా మందు స్ప్రే చేశారు. కొన్నిచోట్ల ఎలక మందు పెట్టేరు. తర్వాత పక్కరైతుల్తో మాట్లాడాడు. వారి చేలు కూడా చూసి తగిన సలహా ఇచ్చాడు. వారి అనుభవ సారాన్ని తనూ తెలుసుకున్నాడు.

తిరిగి ఇంటికొచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయ్యింది. ఎండదెబ్బకి వడలిన తోటకూర కాడలా తయారైన గాంధీని చూసి నొచ్చుకున్నారు సుబ్బరామయ్య.

"ఎండలో, వానలో కష్టపడటం.మాకెలాగూ

# కొత్త సెరిలాక్ ఆరంజ్




## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్. మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు, అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం. దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది.

మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే, అతనికి సెరిలాక్ లాభాలన్నింటిని యిస్తూనే ఉన్నారన్న మాట–ప్రతి సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి, క్షణాలలో తయారు కావడం.

కాబట్టి, పాలు త్రాగించడంతోబాటు, 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్, 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి–మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు.

పరిశుభ్రంగా తయారు చేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకుగాను, దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి.






Nestlé

R K SWAMY/FSL/4974-TEL

తప్పదు. నువ్వు కూడా శ్రమ పడటం ఎందుక య్యా హాయిగా నీడపట్టున కూర్చోక"

"పొలం గురించీ, వంటగురించీ నేర్చుకోవా లంటే ఎండావానా రాత్రీపగలూ అనుకుంటే ఎలా చెప్పండి. పైగా మా వుద్యోగాలు వంట లతో రైతుల్తో ముడిపడి వున్నాయి"

"ఎక్కడ కూర్చుంటే ఎవరు కాదన్నార య్యా. డిమానుస్త్రేటరుగారుగాని, వీడీవోగాని ఒక్కనాడూ మా పొలాల వంక చూళ్లేదు"

"అంచేత వుద్యోగం వచ్చేక నన్నూ వాళ్లలా ఆఫీసు ఫైల్సులో కూరుకు పోమంటారా?" నవ్వేడు.

"భలేవాడివే" అంటూ భార్యని పిలిచి-

"వంటయ్యిందా?" అనడిగారు.

"అయ్యిందిగానీ..."

సందేహం వచ్చి అడిగారు- "ఏంకూరొండా వ్?"

"మీరొచ్చేక ఏదైనా తెస్తారనీ..."

"ఇంట్లో ఏమీ లేవా... మనమంటే ఏదో తినేస్తాం. గాంధీని కూడా ఎలా మార్చగలమే?"

"మీరలా నన్ను వేరుచేసి మాట్లాడొద్దు. నేనూ మీవాణ్నే మీతోబాటే ఏదుంటే అది సంతోషంగా తింటాను...."

కన్నీళ్లు కన్పించకుండా మొఖం చాటే సిందాయన భార్య. పచ్చడి మెతుకుల్తో భోజనం పెట్టలేక ఆ పని సునందకి అప్పజె ప్పింది.

కాళ్లు కడుక్కునొచ్చి విస్తరి ముందు కూర్చు న్నాడు గాంధీ.

అన్నీ వడ్డించి పక్కకి తప్పుకుందామె.

"ఇవాళ కూర చెయ్యలేదు... ఏమీ అనుకో కండి" తలుపు చాటు నుంచి అంది మెల్లగా.

"పరవా లేదండి... ఆవకాయ పచ్చడు న్నాయండి. పచ్చడి చాలా బాగుంది కూడాను".

"మొహమాటానికంటున్నారు...."

"కాదండి... నిజంగానే అంటున్నాను. మీ రంతా నన్ను పరాయివాడిగా చూస్తున్నారనేది మాత్రమే బాగాలేదు"

 

"అబ్బెబ్బే- మేమెవ్వరం అలా అనుకోవ డంలేదు"

"అయితే కూర చెయ్యలేదనీ అదనీ అన కండి. పచ్చడైనా పరమాన్నమైనా మీతోనే"

"మీదెంత మంచిమనస్సు"

నవ్వి వూరుకున్నాడు.

సాయంత్రంవేళ స్నేహితులంతా మాస్టా రింట్లో సమావేశమయ్యారు. తాము గమ నించిన విషయాల గురించి చెప్పుకొంటోంటే "పల్లెటూళ్లలో ఎరువులు వెయ్యని కాయగూర లు దొరుకుతాయనుకునేవాణ్ని. కానిక్కడా మందులు విరివిగా వాడేస్తున్నారు" అన్నాడు సుబ్రమణ్యం.

"మొక్కలకీ, మనుషులకీ కూడా మందు ముఖ్యమైపోయిందోయ్"

"ఇంకా పల్లెటూరివాళ్ల ఆరోగ్యాలు బాగుంటాయనుకునేవాణ్ని. కాని, మేమే నయ మనిపిస్తోంది"

"నాయనా సుబ్రమణ్యం! టౌన్లలో అమ్మే కాయగూరలూ, పండ్లూ, పంటలూ అన్నీ ఇలాంటి పల్లెల్లో పండినవే. ఇక్కడివాళ్లూ వాటినే తింటారు. వెరశి అందరి ఆరోగ్యాలూ ఒక్కరకంగానే వుంటాయ్"

"ఏవిటయ్యా విశేషాలూ?" అంటూ వచ్చి కూర్చున్నారు మాస్టారు.

"చాలానే వున్నాయి మాస్టారూ. మునియ్య మీకు తెలుసుకదా? షావుకారిగారి దగ్గర చేసిన అప్పు నిమిత్తం తనకున్న పాతిక సెంట్లూ రాసిచ్చేసి భార్యాబిడ్డల్తో పట్నం వెళ్లిపోయా డు. అక్కడేదో బతుకుతెరువు దొరక్కపోదని ఆశ" అన్నాడు శివం.

"అలాగా... ఇలా ఆర్థికంగా దెబ్బతినో, అథ ర్వవు కోల్పోయో పని దొరక్కో ఏడాదికి నాలుగై దు కుటుంబాలు పట్నాలకి వలసపోతు న్నాయి శివం. పరిస్థితులు మెరుగు పరచక పోతే అదో సమస్యగా మారే ప్రమాదం లేకపోలే దు"

"ఇలా జనం వలసపోతున్నందునే టౌన్సులో జనాభా పెరిగి ఎన్నో సమస్యల సృష్టికి కారణ మవుతోంది. ఆ సమస్యల విశ్వరూపాన్ని మనం కలకత్తాలో చూడొచ్చు" అన్నాడు జాన్సన్.

"ఇంత చక్కని ప్రశాంత ప్రదేశాన్ని వచ్చిని

ప్రకృతినీ వదిలి రణగొణ ధ్వనుల ఫ్యాక్టరీ ధూమపు భుగభుగల పట్నాలకి ఏంబావు కుందామని ఎగబడుతున్నార్సార్?'' సుబ్రమ ణ్యాం ఆశ్చర్యపడ్డాడు.

అంతా అతడి వంకచూసేసరికి కంగారు పడ్డాడు.

''కాలే కడుపుకింత మండే గంజి సంపా దించుకోడానికి బాబూ''

మాస్టారి స్వరంలోని బాధ అందరి గుండెల్లో నూ ప్రతిధ్వనించడంతో మౌనం వహించారు కాస్సేపు.

''మాస్టారూ... నాదో చిన్న సందేహం'' గాంధీ అన్నాడు.

''చెప్పు బాబూ''

''భర్తపోయిన ఆడవాళ్లు బొట్టూ గాజులూ పూలూ రంగు వస్త్రాలూ ధరించ కూడదనీ, తెల్లని బట్టలు మాత్రమే ధరిస్తూ ఎవరికీ కన్పించకుండా ఒక మూలన అణగారిపోవా లనీ శాసించటం న్యాయమేనా చెప్పండి?''

''ముమ్మాటికీ అన్యాయమే. ఒకానొకప్పుడు సతీ సహగమనం పేరిట చనిపోయిన భర్తతో బాటు భార్యనీ దహనం చేసి చంపేవారు. ఈనాడు భర్తపోతే భార్యని వితంతువని ముద్ర వేసి ఆంక్షలు విధించి జీవశ్చవం చేస్తున్నారు. ఒక నిండుజీవితాన్ని నిలువునా దహనం చేస్తు న్నారు. నిజానికి ఇదీ హత్యే. మరో రకమైన సతీ సహగమనమే. భర్తతోడిదే భార్య జీవితం. అతడితోబాటే ఆమె సుఖ సంతోషాలకి కాలం చెల్లిపోతుందన్న సూత్రాలే ఆ రెంటికీ ఆధారం!''

''ఇదన్యాయమని తెలిసుండీ ఇంకా కొనసా గించడం దారుణం కదండీ! ముఖ్యంగా చిన్నవయస్సులోనే భర్త పోయిన స్త్రీల పరిస్థితి హృదయవిదార కంకదండీ''

''అవును గాంధీ... ఈ సాంఘిక దురన్యా యాన్ని ఖండించి వితంతు వివాహంచేసిన నవయుగవైతాళికుడు వీరేశలింగం పంతులు గారు. తర్వాత్తర్వాత జనం దృక్పథంలో ఆలోచ నలో కొంత మార్పువచ్చినా అదెక్కువగా పట్నా లకీసంపన్నులకీ పరిమితమైపోయిందని చె ప్పాలి. ఆడపిల్ల పెళ్ళిచెయ్యడమే ఓ భగీరధ యత్నం అయిపోయిన ఈరోజుల్లో వితంతు వివాహం తలపెట్టగల సాహసం ఎందరి కుంటుంది?''

''అంటే డౌరీసిస్టమే దీనిక్కారణ మంటారా?'' జాన్సన్ ప్రశ్నించాడు.

''కొంతవరకూ! వితంతువుల్ని వివాహమా డటానికి సిద్ధపడుతున్న యువకులున్నారు గాని కట్నం లేకుండా చేసుకోడానికి ముందుకొ స్తున్నవాళ్ళు దాదాపుగాలేరు. ఈ పరిస్థితిని మార్చాలన్నా యువతుల్ని కట్నాలసంకెళ్ళ నుంచి రక్షించాలన్నా అంతా మీ చేతుల్లో వుంది. దేశభవిష్యత్తూ మీమీదే ఆధారపడి ఉంది''

సాలోచనగా చూస్తూండిపోయాడు గాంధీ.

★ ★ ★

''ఇయాలరాత్రి పెశిడెంటుగోరింటి దగ్గర దొంగల సంగం సమావేశమవుద్దిగన్క అంతా రావాలహొ....''

డప్పువాయిస్తూ- ఊళ్ళో చాటింపు వేస్తూ వేస్తూ సుబ్బరామయ్య ఇంటికొచ్చాడు వెట్టోడు.

కొడుకు శవానికి తలకొరివిపెట్టివచ్చిన తండ్రిలా సుబ్బరామయ్య కూర్చున్నారు మోకా ళ్ళలో తలదూర్చి. కొంచెం దూరంలో స్తంభానికా నుకుని డీలాపడి కూర్చున్నాడు గాంధీ.

చాటింపువిని ఉలిక్కిపడి చూశాడాయన వంక.

ఆయన కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. శుష్కహాసం కదిలిందాయన పెదాలమీద..

''చావుదెబ్బతీయబోతున్నారన్నమాట''

''ఎవరు?''

''గ్రామపెత్తందార్లు''

''అంటే?''

ఆయన జవాబుగా వెట్టోడివంక చూశారు.

''రాత్రికి తవర్ని రమ్మని మరీమరీ సెప్పమ న్నారండి పెశిడెంటుగోరు'' తలాడించారా యన.

వెట్టోడు వెనుదిరగ్గానే ''దొంగల సంఘ మంటే దొంగలుకలిసి పెట్టుకున్న సంఘమా?'' అన్నాడు గాంధీ.

నవ్వేరాయన- ''అది దొంగల్ని శిక్షించడాని

కేర్పడింది. కాని ఆ సంఘానికి ప్రత్యేకంగా పేరుపెట్టకపోవడంతో దొంగలసంఘంగా వాడుకలోకొచ్చింది''

"ఓహో...పెద్దల ముఠాయా! వాళ్ళ ఆటలు సాగనివ్వం'' దృఢంగా అన్నాడు గాంధీ.

"ఏమైనా మనం ఎదిరించకుండా వుండాల్సిందేమో బాబు'' ఆవాళ జరిగిన ఘటనని తలచి అన్నారాయన.

"అన్యాయాన్ని ఎదిరించకపోతే ఎలాచెవ్వండి? మనం వూరుకున్నంతకాలం మన నెత్తిన కూర్చుని వూరేగుతారు. మనం నోరుమూసుక్కూర్చుంటే మన వీపెక్కి సవారీచేస్తారు. లేకపోతే చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోగల హక్కెవరిచ్చారు వాళ్ళకి?''

"మా అసహాయత! మా బలహీనత! మా చేతకానితనం!''

"అది నిన్నటివరకూ... ఇవ్వాళదాన్ని మార్చేస్తాం'' అతిశయించిన ఆత్మవిశ్వాసంతో అన్నాడు.

ఆవాళ జరిగిన సంఘటనలో తాము పొరబాటుగా ప్రవర్తించలేదని గట్టిగా విశ్వసిస్తున్నాడతడు.

అసలేం జరిగిందంటే-

ఓ మధ్యాహ్నంపూట నరసింహం మనుమలొచ్చారు సుబ్బరామయ్య పశువులశాలకి.

మాట ఇచ్చినప్రకారం సుబ్బరామయ్య నరసింహం అప్పుతీర్చలేకపోయాడు. ఇలా జరుగుతుందని ముందే ఊహించిన షావుకారు ఈ సమయంకోసమే కాచుక్కూర్చున్నారేమో- గడువుతీరిన వెంటనే తన మనుమల్ని పంపించేశాడు.

వాళ్ళు సుబ్బరామయ్య ఎద్దుల్ని గేదెల్ని బలవంతంగా తోలుకెళ్ళిపోబోతోంటే గాంధీ అడ్డుకున్నాడు.

"ఇది అక్రమం. వాటిని తోలుకెళ్ళనివ్వం''

"పానకంలో పుడకగాడివి- నువ్వెవడివోయ్... తప్పుకో'' తోసేశారు వాళ్ళు.

విసిరికొట్టిన బంతిలా లేచాడతడు.

"మర్యాదగా చెబుతున్నాను వాటిని వదిలెయ్యండి. వీటిని జప్తుచేసే అధికారం మీకూ, మీ షావుకారుకీలేదు. అప్పువసూలుకోసం కోర్టుకెక్కమనండి. కోర్టు ద్వారా జప్తుచేసుకోండి. అంతేతప్ప దౌర్జన్యంగా పశువుల్ని తోలుకుపోతామంటే ఊరుకోం''

గాంధీ మాటలకి రెచ్చిపోయారు వాళ్ళు. సుబ్బరామయ్య అతణ్ని వెనక్కిలాగాలని ప్రయత్నించటం వాళ్ళకి ఊతమిచ్చింది. రౌడీ జులుం ప్రదర్శించాలని చూశారు. కానింతలో సంగతి తెలిసి శివం, జాన్సన్, సుబ్రమణ్యం పరుగునవచ్చారు. ఊళ్ళోని కొందరు కూడా వారికి తోడయ్యారు.

అంతా కలిసి ఎదురుతిరిగేసరికి మరి చేసేదిలేక బుసలుకొడుతూ వెళ్ళిపోయారు.

సంగతి తెలిసి తోకతొక్కిన త్రాచుఅయ్యాడు షావుకారు. తన అధికారపీఠం కదులుతున్నట్టనిపించింది. హుటాహుటినిరాయుడింటికెళ్లారు.

ఇలాటి విషయాల్ని శంఖంలోపోసి తీర్థమంటూ ఊరందర్నీ నమ్మించడంలో ఇద్దరూ సిద్ధహస్తులే. కనుక వెంటనే దొంగలసంఘసమావేశం ఏర్పాటుచేసేశారు.

సంఘం తంతు గురించి ఏమీతెలీని కుర్రాళ్ళు ఏవో చెయ్యాలని ఆవేశపడుతున్నారు.

"రాముడు గారు మంచోడుకాదు'' సునంద అన్నదారాత్రి భోజనం వడ్డించాక గాంధీతో.

"ఆ సంగతి ఈ ఊళ్ళోఅడుగుపెట్టీపెట్టగానే తెలిసింది''

"అయనతో తగవుపెట్టుకోకండి. మా గురించి మీరు దురదృష్టం కొనితెచ్చుకోకండి''

"నేను వేరు, మీరు వేరని నేననుకోవడంలేదు''

మరి మాట్లాడలేక అభిమానంగా బాధగా చూస్తూండిపోయింది సునంద.

సంఘ సమావేశానికి వెళ్ళేముందు గాంధీ, శివమూ కలిసి సుబ్బరామయ్యకి గట్టిగా నచ్చచెప్పేరు. వారి తీర్పుకి కట్టుబడవద్దన్నారు. షావుకారు చాలా ఎక్కువ వడ్డీ వసూలుచేస్తున్నారనీ, కోర్టుకెళితే చాలా తగ్గించేస్తారనీ చెప్పేరు. అన్నిటికీ మౌనంగా తలాడించారాయన. ఆయన మనస్సులో ఏముందో మిత్రులిద్దరికీ అంతుబట్టలేదు.




రాత్రి తొమ్మిది గంటల ప్రాంతాన ప్రెశి డెంటుగారి అరుగుమీద దొంగల సంఘం సమావేశమయింది.

రాయుడూ, షావుకారూ, మాజీ మునసబూ, సంఘపెద్దలు. మునసబు ఇదివరకు ప్రముఖ పాత్ర వహించేవారుగాని మాజీ అయ్యాక ఆయన మరుగుజ్జు అయిపోయాడు. ఇక మిగి లిన ఇద్దర్లో ఒకరు సుబ్బరామయ్యకి వ్యతిరే కంగా రిపోర్టు చేసినవారే. న్యాయం ఎవరికి జరిగేదీ, తీర్పు ఎవరికనుకూలంగా వచ్చేదీ అందరికీ తెలిసిన రహస్యమే.

ఊరిజనం పాతికముప్పైమంది వచ్చారు. వాళ్ళైనా మొహమాటానికి వచ్చారు తప్ప కుతూహలంతో రాలేదు. జరిగేతంతు తెలీనివా



రెవరూ లేరక్కడ.

జనాన్ని తేరపారిచూశారు రాయుడు. ఓ పక్కన ఆరుగురు కుర్రాళ్ళూ నిలబడి ఉండ టంచూసి ఉలిక్కిపడ్డారు. పళ్ళునూరుకున్నా రు.

వాళ్ళు ఊరొచ్చినప్పట్నుంచీ వాళ్ళంటే ఆయనకి కంటగింపుగానే ఉంది.

వస్తూనే పొలం దగ్గర వీరేశంతో తలప డటం ఓ కారణమైతే ఊరినేత అయిన తనని ఆశ్రయించకుండా మాస్టారిద్వారా కొందరు చిన్న రైతుల్ని ఆశ్రయించడం మరో కారణం. ఇప్పుడు షావుకారి అధికారాన్ని సవాలు చె య్యడం అగ్నికి ఆజ్యంలా తోడయింది.

వాళ్ళనిలా యథేచ్ఛగా వదిల్తే ఊరి కుర్రా ళ్ళుకూడా చెడిపోతారేమోనన్పించింది. అది తనపాలిట ముప్పుగా పరిణమిస్తుందేమోనని భయమేసింది.

'ఉండేలు దెబ్బంటే ఏవిటో తెలీని ఈ పిల్లకాకులకి ఆ దెబ్బ రుచి చూపించాలి' అనుకున్నారు.

గోటితోపోయేదాన్ని గొడ్డలివరకూ తీసుకురా వటం విజ్ఞుల లక్షణం కాదనుకుని పైకి చిన్నగా నవ్వుకున్నారు రాయుడు.

షావుకారు తరఫున పంతులు కేసు వివ రించాడు.

సుబ్బరామయ్య షావుకారుదగ్గర అప్పుచేశా డనీ, ఎన్నిసార్లడిగినా ఆఖరికి వడ్డీకూడా తీర్చ లేదనీ చెప్పేడు. వడ్డీకింద పశువుల్ని జప్తుచే స్తోంటే పొరుగూరి కుర్రాళ్ళని రెచ్చగొట్టి దౌర్జ న్యానికి దిగాడని ఆరోపించారు. సుబ్బరామ య్య దగ్గర్నుంచి తన అప్పు వడ్డీతోసహా అణా పైసల్తో వసూలుచేసిపెట్టమని షావుకారు సంఘాన్నీ ఊరి జనాన్నీ అర్థిస్తున్నారని చెప్పే డు.

"ప్వూప్వూ..." అప్పుడే ప్రథమంగా విన్నట్టు విని అన్నారు రాయుడు, నవ్వుతూ.

గాంధీ నుదురు ముడిపడిందా నవ్వుకి.

"ఏం... సుబ్బరామయ్యా ఏమంటావ్?"

తలొంచుకున్నాడాయన.

"మౌనం అర్థాంగీకారం అన్నారు. నీమీద మోపబడిన ఆరోపణల్ని అంగీకరిస్తున్నావన్న మాట..."

"... ... ..."

సుబ్బరామయ్య పెదవి విప్పకపోయేసరికి, "మేం అంగీకరించడంలేదు" అని అరిచాడు గాంధీ.

"ప్వూ-? ఇది ఊరిజన సంఘ సమావేశం. ఇది మా కట్టుబాటు. ఇక్కడికి ఊరివాళ్ళే రావాలి. బయటివాళ్ళొకవేళ వచ్చినా మాట్లాడ కూడదు"

"అన్యాయాన్ని వేలెత్తి చూపడానికి ఊరివా ళ్ళే కావాలా? మేం ఊరివాళ్ళకి కావాల్సినవా ళ్ళం..."

"మీలాటి కుర్రకారు మా ఊరికక్కర్లేదు. ఇంకోమాట- అతిగా మాట్లాడినా సహించేదిలే దు" మండిపడ్డారు రాయుడు.

"నేనీ ఊరివాణ్నే. షావుకారు ఆరోపణ పచ్చి అబద్ధం అని చెబుతున్నాను. అప్పుని దౌర్జ న్యంగా వసూలు చేసుకోగల హక్కు షావుకారు గ్గానీ, ఈ దొంగల సంఘానిగ్గాని లేదని చెబు తున్నాను"

శివం మాటలకి నివ్వెరపోయారంతా.

వాతావరణం ఒక్కసారిగా స్తబ్దం అయిపో యింది.

రాయుణ్నెదిరించగల తెగువగలవాణ్ని ప్ర ప్రథమంగా విస్ఫారిత నేత్రాలతో ఆశ్చర్యంగా చూడసాగారు జనం.

"ప్వూప్వూ... ఎరుకల నారిగాడి కొడుకు హీరో అయ్యాడన్నమాట"

"అతిగా మాట్లాడుతున్నారు"

"ఏం... నువ్వు ఎరుకలవాడివికాదా?"

"నా కులం గురించీ, మీ గోత్రం గురించీ జనానికందరికీ తెలుసు. మీరు ప్రత్యేకంగా నొక్కిచెప్పాల్సిన అవసరంలేదు. మీ దొంగ లంతా కలిసి ఊళ్ళు పంచుకుందామంటే ముక్కుమూసుక్కూర్చోడానికి సిద్ధంగా లేరెవ రూ ఇక్కడ"

"ఓహెూ... నాలుగక్షరంముక్కలు ముక్కున బట్టేసరికి మొనగాడివయిపోయావన్నమాట. సంఘాన్నెదిరించడానికి సిద్ధపడుతున్నావన్న మాట"

"నేనేకాదు... ఈ దుర్మార్గపు తీర్పుల్నెది రించడానికి ఇక్కడున్నవాళ్ళంతా సిద్ధపడుతు న్నారు"

"హ్హహ్హహ్హ.... పిల్లకాకి! ఇక్కడ గొంతెత్తితే రేపటికాగొంతు పూడుకుపోతుందని జనానికి తెలునుగాని ఊరికే మొరగకు. అనవసరంగా కల్పించుకోకు. ఏం సుబ్బరామయ్యా- జనాన్ని బాగానే వెంటేసుకొచ్చావే? అప్పు ఎగ్గొట్టేద్దా మనా?"

"రామరామ... అలాటి ఉద్దేశం నాకులేదు గాకలేదండీ"

"నువ్వు షావుకారు దగ్గర అప్పుతీసుకున్నదీ చెల్లించకుండా వున్నదీ అబద్ధమా?"

తల అడ్డంగా ఊపారాయన.

"అయితే షావుకారి ఆరోపణంతా నిజమేన న్నమాట. నువ్వు పరువూ మర్యాదలున్న పెద్ద మనిషివి. ఆ అప్పుతీర్చాలనుకుంటున్నావు తప్ప ఎగవెయ్యాలనుకోవడంలేదని భావిస్తు న్నాం... అవునా?"

తలూపారు మళ్ళీ.

"అయితే ఇప్పటికిప్పుడు అప్పుతీర్చేయ్"

కళ్ళనీళ్ళుపెట్టుకుని బేలగా చూశాడు సు బ్బరామయ్య.

"హ్హ హ్హ హ్హ... తీర్చలేవు. పోనీ తగుదున మ్మా అని ఎగుర్తున్న ఈ కుర్రాళ్ళు తీరుస్తా రేమో కనుక్కో..."

"అంతమాత్రాన మీరు ప్రభుత్వం నిర్ణ యించిన వడ్డీకన్నా అత్యధికంగా వడ్డీని వసూ లు చేయటం అన్యాయం" గాంధీ అన్నాడు.

"ఈ పసివాడెవడోయ్! ఒరే పిల్లకాకీ- నీలాంటివాళ్ళిలా నీలిగి కోర్టుకెక్కుతారనే షావు కారులాటివాళ్ళు రెండు ప్రోనోట్లు రాయించు కుంటారు. ఒకటి తీసుకున్న అప్పు సొమ్ముకు ఒప్పుకున్న వడ్డీతో రాస్తారు; రెండోది తీసుకున్న అప్పుకన్నా ఎక్కువ సొమ్ముకి ప్రభుత్వం నిర్ణ యించినవడ్డీకి రాయించుకుంటారు. కోర్టుకె క్కితే రెండోది దాఖలు చేస్తారు. ఏ రాయైనా ఒకటేరా పళ్ళూడగొట్టుకోటానికి!" విరగబడి నవ్వాడు రాయుడు.

కొందరాయన్తో కలిసి నవ్వేసరికి గాంధీ ముఖం ఎర్రబడింది. ఏదో అనబోతోంటే వారించాడు జాన్సన్. సుబ్రమణ్యానికంతా అయోమయంగా వుంది. మంచి, మమత, న్యాయం, ధర్మం- పల్లెల్లో నాలుగు పాదాలమీద నడుస్తాయనుకున్నాడుగాని వాటికి బొత్తిగా విలువలేకుండా పోతుందనుకోలేదు. ఆ నూ తన సత్యాన్ని నమ్మలేక, నమ్మకుండా వుండ లేక నలిగిపోతున్నాడతడు!

"సుబ్బరామయ్యా... షావుకారు చెప్పిన వడ్డీ కి ఇష్టపడే అప్పు తీసుకున్నావుకదూ?"

తలాడించారు.

"మరైతే అందులో అన్యాయమేమీలేదు గనుక షావుకారు లెక్కలప్రకారం అప్పు తీర్చక తప్పదు. నువ్విప్పుడు తీర్చగల స్థితిలో లేవు గనుక ఇప్పుడే డబ్బు అవసరమని షావుకారు పట్టుబడుతున్నాడు గనుక ఇవాళే మనం అప్పు సంగతి పరిష్కరించాలి" అందరి ము ఖాల్లోకి చూస్తూ అన్నారు రాయుడు.

ఎక్కడా ప్రతిఘటన ఛాయలు కన్పించలే దు.

తృప్తిపడి, మునసబుతో ఏదో మాట్లాడి మెల్లగా గొంతు సవరించుకున్నాడు రాయు డు.

"సుబ్బరామయ్య షావుకారు అప్పుతీర్చా ల్సిందేనని సంఘం భావిస్తోంది. తనిప్పుడు తీర్చలేనంటున్నాడు గనుక ఎకరం పొలాన్ని స్వంత ఖర్చుల్తో షావుకారిపేర్నగాని, అతడు చెప్పినవారి పేర్నగాని రాసివ్వాలనీ; ఎద్దుల జతనీ, ఒక గేదెనీ స్వయంగా తోలుకెళ్ళి షావుకా రుకప్పజెప్పాలనీ సంఘం తీర్పు నిస్తోంది....!"

సుబ్బరామయ్య కుప్పలాకూలిపోయాడు

"ఇది చాలా అన్యాయం... దారుణం. షావు కార్ని సపోర్టుచేస్తూ ఇచ్చిన ఈ తీర్పు చెల్లదు" జనాన్నుద్దేశించి అన్నాడు శివం.

తీర్పు అశనిపాతంలా అన్పించిందందరికీ. అయినా కుక్కిన పేనుల్లా, మన్నుతిన్న పాము ల్లా వుండిపోయారంతా.

"మాట్లాడరేం... ఈ అక్రమాన్ని ఎవరూ ఎదిరించరేం? నిన్న మునియ్య, ఇవాళ సుబ్బ రామయ్య. రేపు ఇంకొంకరు- ఎల్లుండి మరొక రు. ఈ దోపిడీకి అంతంలేదా? ఇది దారుణ మని చెప్పగల సాహసం కూడా మీలో లేదా?

మీరే సుబ్బరామయ్యా స్థానంలో వుంటే ఏం చేస్తారు?'' ఆరుగురు కుర్రాళ్ళలో ఒకరరిచారు.

''ఉరి బోసుకుంటారు!'' రాయుడన్నాడు.

అదిరిపడ్డారంతా.

ఉలిక్కిపడి కన్నీటి తెరలోంచి చూశారు సుబ్బరామయ్యా.

''మీ అధికారం, మీ జులుం శాశ్వతమనుకుంటున్నారు కాబోలు. ఏదోరోజున ఈ జనమే మీకు బుద్ధిచెబుతారు. మీ కోరలు విరిచేస్తారు- గుర్తుంచుకోండి''

''హ్హహ్హ...'' అన్నారు రాయుడు హేళనగా.

''ఊళ్ళోవాళ్ళకే పట్టనప్పుడు ఇవాళుండి రేపెళ్ళిపోయే మనకెందుగ్గాని పద శివం'' అన్నాడు జాన్సన్.

''బాపురే- ఎంత రౌడీయిజం!'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

గాంధీ సుబ్బరామయ్యాని నడిపించుకుంటూ వెళ్ళిపోయాడు.

★ ★ ★

మర్నాటి ఉదయమే సుబ్బరామయ్యా ఎద్దుల్నీ గేదెనీ పావుకారింటికి తోలుకెళ్తోంటే ఆడవాళ్ళు గొల్లుమన్నారు.

''తీర్పుని కాదన్లేరా?'' గాంధీ అడిగాడు ఆశపూర్తిగా చావక.

''ఊళ్ళో ఉప్పు పుట్టాలంటే తప్పదు బాబూ, అంతేకాదు! మేమెలాగూ కోలుకోలేనంత దెబ్బతిన్నాం. కాడివుండి ఎద్దుల్లేని రైతునికదా! పెద్దల్నెదిరిస్తే ముందు మీమీద కన్నెర్రచేస్తారు. మా అబ్బాయిలాటివాడివి. నిజంగా మీ మేలుకోరేవాణ్నైతే వాళ్ళ తీర్పుని శిరసావహించక తప్పదు. నువ్వేం ఇదవ్వకు బాబూ... చదువు నిమిత్తం వచ్చినవాడివి! మా సంగతంటావా- నుదుటిరాతనెవరు తప్పించగలరు?''

పశువుల్ని తోలుకువెళ్ళిపోతోంటే గాంధీ నిస్సహాయంగా చూస్తూండిపోయాడు చాలాసేపు.

తర్వాత మెల్లగా మాస్టారింటికెళ్ళాడు. అప్పటికే అక్కడికి శివం వచ్చి వున్నాడు.

''రాత్రి మీర్రాలేదేం మాస్టారూ'' గాంధీ అడిగాడు. ఆయన రాకపోవటం చాలా అసంతృప్తిని, నిరుత్సాహాన్ని కలిగించిందతడికి.

''ఇలాంటివి చాలా చూశానయ్యా! వచ్చిప్రయోజనం వుండదనుకున్నాను''

''అదేవిటి మాస్టారూ... మీరు కూడా మాతో కలిస్తే ఎదురుతిరగమని అందర్నీ ప్రోత్సహించేవాళ్ళం. ఇక వారి ఆట కట్టించటం ఎంతసేపు చెప్పండి?''

అనుభవజ్ఞుడిలా నవ్వారాయన.

''ఉడుకు రక్తపు ఆవేశంలో అలాగే అన్పిస్తుంది గాంధీ! సినిమాల్లోనూ కథల్లోనూ చూపించినట్టు నాలుగువేడి మాటలకెవరూ రెచ్చిపోరు. కల్పనవేరు వాస్తవంవేరు. మనం చెప్పినట్టు వాళ్ళెదురుతిరిగారనుకో అప్పుడేమవుతుంది? రాయుడిలాంటి పెత్తందారునెదిరించి వూళ్ళో క్షేమంగా వుండగలరా? పైగా జనంలోని చాలామంది పావుకారి దగ్గర అప్పు చేసినవాళ్ళే. ఆయన కక్షకట్టి అందర్నీ అప్పుకక్కమంటే ఏం చేస్తారు? దానికితోడు పెళ్ళిళ్ళకో, పురుళ్ళకో, వ్యవసాయపు పెట్టుబళ్ళకో కొత్తగా అప్పుచెయ్యక తప్పదు; పావుకారి గుమ్మం తొక్కకా తప్పదు. అప్పు పుట్టే మరో మార్గం చూపించకుండా
ఈ మార్గాన్ని మూసేసుకోమని ఎలా చెప్పగలం? చెబితే మాత్రం ఎవరు వింటారు? వినలేదని వాళ్ళమీద కోప్పడటం సబబేనా?''

''అయినా అంతంత అప్పులెలా అవుతాయంటారు? మంచం ఉన్నంతవరకే కాళ్ళు చాపుకోవచ్చు కదా!''

''సాధ్యంకాదయ్యా. అప్పుచెయ్యక తప్పదు. తీర్చకా తప్పదు. ఏంచేత? ఆదాయం తక్కువ. పండిన పంటకి విలువ తక్కువ. కొనాల్సిన ఎరువుల, ఇతర సరుకుల ధరలెక్కువ. ఇక పెళ్ళిళ్ళ ఖర్చు, వైద్యం ఖర్చు, చదువుఖర్చు, వ్యవసాయపు ఖర్చు- బతుకే ఓఖర్చు. ఆఖరికి చావుకూడా ఖర్చే కదా. ఆదాయపు మార్గాలని పెంచుకోవాలి. ఆడంబరాలు తగ్గించుకోవాలి. పండిన పంటకి విలువ పెరగాలి. రూపాయి విలువ నిలబడాలి. అప్పుడే రైతులైనా కూలీలైనా మరొకరైనా అప్పుల ఊబిలోంచి బయట

 

వడగలరు. అంతెందుకు- ఎన్నో ఏళ్ళనుంచి ఉద్యోగం చేస్తున్న నేను కూడా షావుకారికి బాకీపడ్డాను. ఇక మిగతావాళ్ళ గురించి చెప్పే దేముంది?"

టీ గ్లాసుల్తో "మీకబుర్లకి విరామం వుండదా ఏం" అంటూ వచ్చింది శారదమ్మ.

"ఏంశివం- పెళ్లెప్పుడు చేసుకుంటావ్?" అంది నవ్వుతూ.

"మీరెప్పుడు చేస్తే అప్పుడు"

"అయితే పిల్లని చూడనా?"

"ఉద్యోగం చేస్తున్న అమ్మాయిని చూడండి నన్ను పోషిస్తుంది" నవ్వేడు.

"నీకంత కర్మేమిటయ్యా రాజాలాంటి ఉద్యోగం వస్తుంది"

"వచ్చేక ఆలోచిద్దాం లెండి"

"ఏమైనా ఈకాలం పిల్లల వద్ధతే వేరు!" శారద వ్యాఖ్యానించింది.

"అవును శారదా... ఈ కాలవుపిల్లలు నిజాన్ని చూస్తున్నారు. న్యాయంకోసం తపిస్తున్నారు. అందరికోసం ఆలోచిస్తున్నారు. నమాజాన్ని మార్చాలనుకుంటున్నారు. మానవాళి శ్రేయస్సుకోసం అహరహం శ్రమిస్తున్నారు. రాబోవు తరాలదూతల్లాంటి ఆ యువకులకి ఆహ్వానం వలకటం, స్వాగతం చెప్పటం మన బాధ్యత... మన ధర్మం!" అన్నారు మాస్టారు.

★ ★ ★

రాంస్వామిగారమ్మాయి పెళ్లికి ఊరివాళ్ళతో బాటు ఆరుగురు మిత్రుల్ని కూడా ఆహ్వానించారు.

తలలో నాలుకలా తిరుగుతున్నారేమో ఈ కొద్దిరోజుల్లోనే మిత్రబృందం అంటే గ్రామస్తులకి ప్రత్యేకాభిమానం ఏర్పడిందని చెప్పాలి. వీళ్ళక్కూడా ఊరివాళ్ళతో అవినాభావ నంబంధం ఏర్పడిపోయింది. కేవలం చదువు నిమిత్తం వచ్చినా రైతుకూలీల స్థితిగతుల్ని కష్టసుఖాల్ని దగ్గర్నుండి పరిశీలించే అవకాశం ప్రతిస్పందించాల్సిన అవసరమూ కలిగాయి మరి!

భోజనాలనంతరం గ్రామస్తుల్తో కబుర్లు చెబుతూ పెళ్లివందిట్లో కూర్చున్నారు. పెళ్లికింకా వ్యవధి వుంది. వియ్యాలవారు విడిదినుంచి అప్పుడే రావడంతో వందిరంతా నందడిగా వుంది.

ఇంతలో ఒకరొచ్చి గాంధీని పాడమన్నారు. మరికొందరు బలవరిచారు. ఒకతనేకంగా మైకు ఏర్పాటు చేసేశాడు. మిత్రులు మిమిక్రీ చెయ్యమని కోరారు. దాంతో లేవక తప్పలేదతడికి.

మౌత్ ఆర్గాన్‌మీద ఒకటీ, విడిగా రెండూ సినిమాపాటలు పాడేక మిమిక్రీ ప్రారంభించాడు. పెళ్లికూతలూ, పిల్లల ఏడ్పూ, రైలుశబ్దం వగైరాలయ్యాక సినీనటుల్నీ రాజకీయనాయకుల్నీ అనుకరించాడు. అప్పుడు రాయుడూ ఆయన, మేనరిజమ్సూ గుర్తొచ్చాయి. ఆయన్ని ఎండగట్టడానికిదే అదనన్పించింది.

"ఇంతవరకూ మీరు చూడనివాళ్ళని అనుకరించాను. ఇప్పుడు మీరెరిగిన, ప్రత్యక్షంగా చూసినవారిని అనుకరిస్తాను వినండి... అంటూ వ్హూ వ్హూ... లతో ప్రారంభించి సుబ్బరామయ్య కేసు నందర్భంగా దొంగల నంఘననమావేశంలో ఆయనన్న మాటలన్నీ విన్పించాడు.

జనం విరగబడి నవ్వేరు.

నరిగ్గా అప్పుడే వందిట్లోకొచ్చిన రాయుడి మొఖం మాడిపోయింది. అతడి అనుచరులు అగ్గిమీది గుగ్గిలమయ్యారు. కానీ ఏమీఅన్లేక తేలుకుట్టిన దొంగలా మిన్నకుండిపోయారంతా.

గాంధీ కూడా రాయుడ్ని చూశాడు. చూడనట్టే నటిస్తూ మరింత విజృంభించాడు.

రాయుడెవ్పుడెలా ప్రవర్తిస్తాడో, అతడెంత దుర్మార్గుడో వివరిస్తూ తనువిన్నవాటికీ కన్నవాటికీ నాటకీయత జోడించి అనుకరించేనరికి వందిరంతా హర్షధ్వానాలతో మార్మోగింది.

పెళ్లికని పిలిచి తద్దినం భోజనం పెట్టినట్టు అవమానంగా ఫీలై విసురుగా నిష్క్రమించారు రాయుడు. అతణ్ణనునరించింది అనుచరవర్గం.

రాంస్వామిగాని, అతడివాళ్ళుగాని ఆగమంటూ వచ్చి బతిమాలనందుకు మరింత మండిపోయారు. వడగమీద బలమైన దెబ్బ తగిలిన త్రాచులా కొట్టుకోసాగారు రాయుడు.




"వాళ్ళు కుర్రాళ్ళుకాదు చిచ్చరపిడుగులు" అప్రయత్నంగా పైకనేశారు.

"ఎవరయ్యగోరూ" నమ్మినబంటు వీరేశం అడిగాడు.

"సుబ్బరామయ్య ఇంట్లో వుంటున్న కుర్రాడికి ముహూర్తం పెట్టాల్రా..."

"ఎప్పుడెట్టమంటారు?"

"ఎప్పుడో ఎందుకు రేపేపెట్టేయ్"

"చిత్తం"

"మనిషికాటు అని చచ్చినా తెలీకూడదు"

"నరమానవుడికి తెల్దండి"

"భేష్... ఖుషీ చెయ్యి" అంటూ నోట్లు తీసిచ్చారు.

ప్రసాదంలా అందుకున్నాడు.

★ ★ ★

అగ్రికల్చరల్ బియస్సీ విద్యార్థుల అభ్యాస కాలం సగం పూర్తయింది.

ఆ ఆరుగుర్నీ సమీపప్రాంతానికి చెందిన మరోగ్రామానికి ఎల్లాట్ చేశాడు ప్రోగ్రాం కోఆర్డినేటర్. అక్కడ మరో మూడునెలలు గడిపేక కాలేజీకి వెళ్ళి పోవాల్సుంటుంది.

"మళ్ళీ ఎప్పుడైనా ఇటుకేసి వస్తారా?" ఆఖరిసారి భోజనం వడ్డించి అడిగింది సునంద.

"తప్పకుండా వస్తానండి" గాంధీ జవాబిచ్చాడు.

"మమ్మల్ని గుర్తుంచుకుంటారా?"

"జన్మలో మర్చిపోగలమా?"

సంభాషణ ఆ తర్వాత సాగలేదు. ఈ కొద్దిరోజుల్లోనే ఇదీ అని చెప్పలేని మూగబంధమేర్పడింది ఇద్దరి మధ్యా. ఇంకా ఏదో చెప్పాలని ఎన్నో చెప్పుకోవాలనిగుండెలుగుసగుసలాడినా మౌనంగా ఒకర్నొకరు చూసుకుంటూ ఉండిపోయారు.

"మీ అభిమానం ఎన్నటికీ మర్చిపోలేను. మీకోసం మళ్ళీ వస్తాను" అనేసి వచ్చేశాడు.

ఆ రెండు మాటలే ఆమెకు పన్నీటి జల్లయ్యాయి. మోడువడిన ఆశలచెట్టు చిగురించింది. ఊహల తుమ్మెదకి రెక్కలొచ్చాయి.

"వెళ్లిపోవాలా బాబూ" బేలగా అన్నారు సుబ్బరామయ్య.

అతడింట్లో తిరుగుతోంటే కొడుకు తిరుగుతున్నట్టే వుండి ఎంతో ధైర్యంగా వుండగలుగుతున్నారు. పరిస్థితుల మోసాన్ని గుండె దిటవు చేసుకొని భరిస్తున్నారాయన.

"ఇన్నాళ్లూ మాకు కొండంత అండగా వున్నావు. నీకు సరైన భోజనం కూడా పెట్టలేకపోయాం" అంది సుబ్బరామయ్యగారి ఇల్లాలు.

"మీరలా అనుకోకండమ్మా!" అన్నిటినీ మించిన మీ అందరి అభిమానం, ఆప్యాయత నాకు లభ్యమయ్యాయి. అదే పంచభక్ష్యపరమాన్నాల పెట్టు!"

"ఆ మాట చాలు బాబూ... మా కడుపు నిండిపోయింది. నిన్ను కన్న తల్లిదండ్రులు నిజంగా ధన్యులు"

"వస్తానండీ... చదువు పూర్తవ్వగానే వస్తాను- నమస్తే"

బేగ్ తీసుకుని కళ్లు తుడుచుకుంటూ మాస్టారింటివైపు నడిచాడు గాంధీ.

శివం తల్లిదండ్రుల దగ్గర సెలవు తీసుకునొచ్చాడు.

ఇన్నాళ్లూ వూళ్లోనేవున్నా అప్పుడప్పుడు మాత్రమే ఇంటికెళ్లి వస్తున్నాడు. ఊళ్లో వుండి కూడా తమ ఇంట్లో వుండనందుకు నొచ్చుకుంది తల్లి.

"చదువు నిమిత్తం తప్పలేదమ్మా! ఇంకొద్ది నెలల్లో నా చదువు పూర్తైపోతుంది. అప్పుడు ఏకంగా వచ్చి ఇక్కడే వుంటాను. నా చదువుని వూరి జనంకోసం వుపయోగిస్తాను"

"ఉద్యోగం చెయ్యవేంట్రా బిడ్డా?"

"ఒకరి దగ్గర వుద్యోగం చెయ్యాల్సిన అవసరం లేదమ్మా! నేనే కొందరికి వుద్యోగం ఇస్తాను- నువ్వే చూస్తావుగా"

"ఏంటో- నీమాటలో పట్టాన అర్థమవ్వవురోయ్"

"అయ్యచేత తాగుడు మాన్పించేస్తాను" తండ్రి వంక ఓరగా చూస్తూ అన్నాడు.

"ఆ పనిచేసి పున్నెంకట్టుకోరా- నచ్చి నీ కడుపున పుడతానుగానీ"

"అనల్నేను తాగటం నేదురోయ్"

"అట్టాగా. సారా సీసామీద పెమానం-సెయ్ బడాయేంటో బయటపడద్ది"

భార్య మాటలకి తలొంచేసుకున్నాడు నారిగాడు.

చిన్నగా నవ్వుతూ, "మన సంపాదననీ, ఆరోగ్యాన్నీ పీల్చి పిప్పిచేసే తాగుడు మనకొద్దు అయ్యా! నామాటిని మానెయ్. అది మానిననాడు దొంగతనం చెయ్యాల్సిన అవసరమూ, నలుగురిచేతా ఈసడింపబడాల్సిన అగత్యమూ నీకుండదు" అని నచ్చచెప్పి వచ్చేడు శివం.

జాన్సన్, సుబ్రమణ్యం తదితరులు కూడా వచ్చేశారు మాస్టారింటికి.

అంతా దిగులుగా వున్నారు. మాటలు దొర్లటం లేదు.

"ఆఖరిసారి నాచేతి వంట రుచి చూడాల్సిందే" అని పట్టుబట్టి భోజనానికాపేసింది శారద.

"మీరొచ్చేక వూళ్లో కదలిక వచ్చింది. ఊరికి వుత్సాహం వచ్చింది. మీలాటివాళ్లు పదిమంది వుంటే ఈ వూరేకాదు ఏ వూరైనా నందనవనమై తీరుతుంది" మాస్టారన్నారు.

"మీరు నేతృత్వం వహించండి చాలు-తప్పకుండా వూరిని మార్చేస్తాం" అన్నాడు శివం.

"నా ఆశలన్నీ మీమీదే శివం" అన్నారాయన పొంగిపోతూ.

"మీ ఆశలకి వూపిరి పోసి తీరతాం మాస్టారూ" గాంధీ అన్నాడు.

"చాలా సంతోషం బాబూ"

"పల్లెల్లో ఇంతగా కక్షలూ, కార్పణ్యాలూ, మోసాలూ, దోపిళ్లూ, నిరక్షరాస్యత, నిరుద్యోగం, అంటరానితనం, దారిద్ర్యం తిష్టవేసుక్కూర్చున్నాయని కలలో కూడా అనుకోలేదు మాస్టారూ" సుబ్రహ్మణ్యం విచారంగా అన్నాడు.

"నువ్విదివరకు భావించినట్టుగానే ఒకప్పుడు పల్లెటూళ్లు పచ్చగా కలకలలాడుతూండేవి. ఐశ్వర్యం, ఐకమత్యం జంటగా వర్ధిల్లేవి. సద్భావం, సహకారం, నచ్చీలత పెనవేసుకునుండేవి. ఇప్పుడదంతా మాయమైపోయింది. కుళ్లూ, కుతంత్రం, అసూయా, దోపిడీ రాజ్యమేలుతున్నాయి. వేరుపురుగులు చేరి పచ్చని గ్రామ వృక్షాన్ని పీల్చి పిప్పి చేస్తున్నాయి" ఆవేదనతో చెప్పేరు.

"మీరన్నది నిజమే మాస్టారూ! ఈ త్రీ మంత్స్‌లో చాలా తెలుసుకున్నాం. ముఖ్యంగా మీరందించిన హెల్ప్ మరువలేనిది" జాన్సన్ అన్నాడు.

భోజనాలయ్యాక మాస్టారి దగ్గరా, శారదమ్మ దగ్గరా సెలవు తీసుకుని బయల్దేరారు మిత్రులంతా భారమైన హృదయాలతో.

కన్నీటితో వీడ్కోలు చెప్పేరు మాస్టారు.

సూర్యుడు తాటితోపులో క్రుంగిపోతుంటే చేల గట్లమీంచి, తోటల్లోంచి కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు మిత్రులు.

గాంధీ కాళ్లని సునంద చూపులు కట్టిపడేస్తోంటే ఆమెనే తలుస్తూ మౌత్ ఆర్గాన్ వాయించుకుంటూ మెల్లగా వెనుకగా నడుస్తున్నాడు గాంధీ.

రాయుడి మామిడి తోటని దాటేశారంతా. గాంధీ కూడా దాటుతూండగా ఓ బలమైన హస్తం వచ్చి అతడి నోరు మూసేసి పొదల్లోకి లాక్కెళ్లిపోయింది.

అతడు పెనుగులాడాడుగాని లాభం లేకపోయింది.

చిరుచీకట్లో కొరివి దెయ్యంలా నవ్వుతూ ముందుకొచ్చాడు వీరేశం. అతడి చేతుల్లో మూతి కప్పిన కుండ వుంది.

అయోమయంగానూ, భయంగానూ చూశాడు గాంధీ.

గబుక్కున అతడి చెయ్యి పట్టుకుని కుండ లోపలికి తోసి గుడ్డతో కుండ మూతిని మూసేశాడు వీరేశం.

కుండలో రెండు విషనాగులున్నాయ్!

గాంధీ కెవ్వుకెవ్వుమని అరిచాడుగాని బయటికి పెద్దగా శబ్దం రాలేదు... రానివ్వలేదు!

చెయ్యిలాగేసి కుండ మూతికి గుడ్డకట్టేసి, "వదిలెయ్‌రా నాయాల్ని! ఇంకో సెనంలో చచ్చూరుకుంటాళ్ళే" అన్నాడు వీరేశం. అతన్ని వదిలేసి ఇద్దరూ ఉత్తరక్షణాన అదృశ్యమయ్యారు.




"శివం... ...!" బాధతో మెలికలు తిరిగిపోతూ కేకపెట్టాడు గాంధీ.

ఆర్తనాదంవిని పరుగునొచ్చారంతా.

"గాంధీ... గాంధీ... ఏవయ్యిందిరా?"

అతడేదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు గాని చెప్పలేకపోతున్నాడు. నోటినుంచి నురగ కారుతోంది.

దూరాన ఇద్దరు వ్యక్తులు పారిపోతూండటం లీలగా కన్పించింది శివానికి.

"డాక్టర్ దగ్గరికి తీసుకెళ్దాం పదండి... పాము కరిచినట్టుంది" అంటూ అతణ్ని భుజాన వేసుకుని పొరుగూరివైపు పరుగుపరుగున నడవసాగాడు శివం.



కాని మధ్యలోనే తలవేలాడేశాడు గాంధీ!

గాంధీకి స్పృహతప్పి వుంటుందనుకుని వేగంగా డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళారు.

డాక్కరు నాడిచూసి పెదవి విరిచాడు.

అతడి చేతిమీదున్న పాముకాట్లుచూసి అదిరిపడ్డాడతడు.

"బాపురే... ఇదెవరో కావాలని రెండు మూడు పాములచేత కరిపించారుతప్ప యాక్సిడెంటల్‌గా పాము కరవడంకాదు" అన్నాడు డాక్టర్.

శివం నుదురు ముడిపడింది.

అతడి కళ్ళముందు 'హ్హహ్హ...' అంటూ విషపునవ్వు నవ్వుతూ కదిలాడు రాయుడు.

అతడి పిడికిళ్ళు బిగుసుకున్నాయి!




"మీ మాస్టారు దీవించి రాయునది.

ఏ మాస్టారనుకుంటున్నావుకదూ? అప్పుడెప్పుడో మీ చిన్నప్పుడు మీచేత ఓనమాలు దిద్దించిన బతకలేని బడిపంతుల్ని!

నన్నూ మన బడినీ, మన ఊరినీ మీరు మర్చిపోలేదన్న దృఢ నమ్మకంతో ఈ రెండు ముక్కలూ రాస్తున్నాను.

మీరిప్పుడు పెద్దవారయ్యారు. బాధ్యతగల పౌరులయ్యారు. అపారమైన తెలివితేటలతో, విజ్ఞానంతో వర్ధిల్లుతున్నారు. చక్కని హోదాలో అమితమైన గౌరవాభిమానాలు పొందుతున్నారు. అందుకు చాలా సంతోషంగా ఉందయ్యా.

కాని బాబూ- మన ఊరిబడి మీరు చదువుకున్ననాటికన్నా దిగజారిపోయింది. పాక శిథిలావస్థకు చేరిందయ్యా. అయినా పట్టించుకునేనాథుడు కనుచూపు మేరలో లేకుండాపోయాడు!

ఇక మన గ్రామంకూడా దిష్టిబొమ్మలా తయారయిందయ్యా! ఎలాంటి అభివృద్ధికీ నోచుకోకుండా నానాటికీ దిగజారిపోతోందయ్యా. మన ఊరి గురించి- మిమ్మల్ని మినహాయించి గర్వంగా చెప్పుకునే సంగతి ఒక్కటి కూడా లేదంటే నమ్మండి. సర్వ అవలక్షణాలూ, సమస్త దుష్టతత్వాలూ ఊరిని అస్థిపంజరం చేస్తున్నాయి.

ఏదో ఒరగబెడతారని గ్రామ నాయకత్వాన్ని అర్థించాను. అధికారులకి అర్జీలు పెట్టేను. అన్నీ బధిరశంఖారావమైపోయాయి. గ్రామ దుస్థితివంక కన్నెత్తి చూడగల మనస్సు కూడా లేకపోయిందెవరికీ!

ఊరికి మళ్ళీ జవసత్వాలు కలిగించాలంటే అది మీలాంటి యువకులకే సాధ్యమవుతుంది. ఊరికి కొత్తరక్తం ఎక్కించి ఆరోగ్యంతో కళకళలాడేట్లు చేయగల మహత్తరశక్తి కేవలం మీకేవుంది.

మనదేశం గ్రామాల్లో జీవిస్తోందన్నారు గాంధీజీ.

గ్రామాల్ని సుసంపన్నమూ, సౌభాగ్యవంతమూ చెయ్యాల్సిన అవసరం వుందని నొక్కి వక్కాణించారెందరో మహానుభావులు.

అందునిమిత్తం యువకులు గ్రామాలకి తరలాలని పిలుపునిచ్చారు బాపూజీ.

అంచేత మిమ్మల్నిక్కడికొచ్చి స్థిరపడమని కోరడానికీ ఉత్తరం రాయటంలేదు. మీ ఉద్యోగాల గురించీ, బరువు బాధ్యతల గురించీ నాకు తెలుసయ్యా!

కాని మీరు తలచుకుంటే ప్రత్యక్షంగానో పరోక్షంగానో మన గ్రామ పునరుజ్జీవానికి చేయూతనివ్వగలరు. ఈ మహాయజ్ఞానికి ఓ సమిధని సమర్పించగలరు.

మీ శక్తియుక్తులు నాకు తెలుసు.

మీరు సంకల్పిస్తే ఇది మీకు తలకు మించిన బరువుకాదనీ, దీనిని అవలీలగా జయప్రదం చెయ్యగలరనీ నాకు తెలుసు.

అంచేతే కొండంత ఆశతో, ఆకాంక్షతో రిపబ్లిక్‌డేనాడు మన ఊరిబడిలో చిన్న సమావేశం ఏర్పాటు చేస్తున్నాను. మీలాటి శిష్యులందర్నీ




ఆహ్వానిస్తున్నాను.

మీరొచ్చి మన గ్రామపు దీనత్వాన్ని స్వయంగాచూసి ఈ బృహత్తర కార్యక్రమానికి రూపురేఖలు దిద్దుతారని ఆశిస్తున్నాను. మీమీ పనుల ఒత్తిడివల్ల మీరు రాలేకపోతే మీమీ అభిప్రాయాల్ని ఉత్తరంద్వారా తెలియజేస్తారని భావిస్తున్నాను.

మీమీ కార్యక్రమాలనీ బాధ్యతలనీ ప్రక్కన బెట్టి ఒకే ఒక్కక్షణం మన ఊరి గురించి ఆలోచిస్తారని, స్వార్థత్యాగంతో ముందుకొస్తారని మనస్ఫూర్తిగా ఆశిస్తూ వేయికళ్ళతో ఎదురు చూస్తున్నాను.

మన గ్రామ ఇలవేల్పులైన సీతారాములు మీకు ఆయురారోగ్య ఐశ్వర్యాలివ్వాలని మనసా వాచా ఆకాంక్షిస్తున్నాను''

ఉత్తరం రాయటం పూర్తిచేసి సరిచూను కొంటోంటే శారదమ్మవచ్చి కూర్చుంది.

బియ్యంలోని రాళ్ళేరుతూ- అంది "ఏవిటండీ... అన్ని ఉత్తరాలు ముందేసుక్కూర్చున్నారు? ఆ ఉత్తరం ఎవరికి- అబ్బాయికా?''

"వెళ్ళి ఇన్నాళ్ళైనా వానుకి మనం గుర్తురాలేదు. ఏ ముఖంపెట్టుకుని ఉత్తరం రాయను చెప్పు?''

"కొత్తగా ఉద్యోగంలో చేరాడాయె- బరువులూ బాధ్యతలూ వుంటాయిమరి'' కొడుకు ఉత్తరం ముక్కరాయలేదన్న బాధ తననీ తొలుస్తోన్నా బింకంగా అంది.

"అవునవును... కనిపెంచి, పెద్దచేసి చదివించినవారికి కార్డుముక్క రాసేంత తీరిక కూడా ఎక్కడుంటుందిలే''

"అమ్మాయి బతుకలా అయిందనుకుంటే తవ్వి తలకెత్తాల్సినవాడు ఇలాగయ్యాడు''

"అందుకే అన్నారు శారదా- అద్దాలనాడు బిడ్డలుగాని గడ్డాలొచ్చేక బిడ్డలా చెప్పు?''

"ఎన్నుకుంటే ఏమిటిలెండి! కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది. ఇంతకీ ఆ ఉత్తరం ఎవరికో చెప్పలేదు''

"ఒకప్పుడు మనబడిలో చదివి ఇవాళ ఒక ఉన్నతస్థానంలో వున్న నా శిష్యులందరికీ ఉత్తరాలు రాస్తున్నాను''

"మీరు రిటైరవుతున్నారా?'' ఆందోళనగా అడిగింది.

"ఇంకొన్ని నెలల సర్వీసుందిలే'' నవ్వేరు.

"మరిప్పుడీ ఉత్తరాలన్నీ...''

"ఒక చిన్న సమావేశం ఏర్పాటుచేస్తున్నాను. నా శిష్యుల్లో కొందరైనా మనవూరొచ్చి ఇక్కడి పరిస్థితి చూసి వూరి బాగుకోసం ఎంతో కొంత కృషిచేస్తారని నా ఆశ. శివం వాళ్ళూ కొన్నాళ్ళుండి వెళ్ళేక యువకులు నా కలల్ని నిజం చెయ్యగలరన్న నమ్మకం బలపడింది. శారదా.''

"మీకేమైనా మతిపోయిందా- కడుపున బుట్టిన వాసు విన్లేదుగాని మరెవరో కన్నబిడ్డలు మీ మాట వింటారా?''

"కొడుకులు వేరు శిష్యులు వేరు. నా శిష్యుల మీద నమ్మకం వుంది నాకు''

"వుండొచ్చండీ... కానీ వూరు సంగతి తెలిసితెలిసి వాళ్ళని ఈ వూబిలోకి తీసుకొస్తానంటారేం?''

"గాంధీ దుర్మరణం నీచేత ఆ మాట న్పించిందని తెలుసు శారదా! దాని గురించి నాకూ ఎంతో బాధగా వుంది; దోమలు రొమ్ము విరుచుకు తిరుగుతున్నారే అని ఆవేదనగా వుంది. అదే సమయంలో వారి చేతులకి సంకెళ్ళు పడేరోజు రాకపోదన్న ధీమా కూడా వుంది. గాంధీకి పట్టిన గతి మరెవ్వరికీ పట్టకూడదని ఊరికి పట్టిన సమస్తగ్రహణాల్నీ సమూలంగా నిర్మూలించాలని ఈ మహాయజ్ఞంచేబట్టాను. ఇందులో నేను ఆహుతి అయిపోయినా ఫర్లేదు- లక్ష్యసిద్ధి నాకు ముఖ్యం!''

"అవేం మాటలండీ మంగళవారంపూట'' మంగళసూత్రాలు కళ్ళకద్దుకుంది.

"పదుగురి కోసం చనిపోగల అదృష్టం ఏ కొద్దిమందికో లభిస్తుంది శారదా! నేను వారిలో ఒకణ్నైతే నా జీవితానికంతకంటే సార్థకత వుంటుందనుకోను''

కాంతి నిండిన ఆయన కళ్ళనూ, తేజస్సు నిండిన ఆయన మొఖాన్నీ కళ్ళప్పగించి చూస్తూండిపోయింది శారదమ్మ.

★ ★ ★

సుబ్బరామయ్యగారబ్బాయి భార్గవ కన్పించటంలేదన్న వార్త దావానలంలా చుట్టే

సిందా వూర్నీ.

మాస్టారు మొదటా వార్తని నమ్మలేకపోయారు. నలుగురూ నమ్మబలకటంతో హుటాహుటిన సుబ్బరామయ్య ఇంటికెళ్లారు.

మాస్టార్ని చూసి బావురుమన్నారాయన.

"నేను విన్నది నిజమేనా?"

తలాడించారు.

"ఎక్కడికెళ్ళినట్టు?"

"అదే తెలీడంలేదు... నాలుగైదు రోజుల్నుండి ఎవరికీ కన్పించలేదుట"

"ఏదైనా వూరెళ్ళాడేమో... మిత్రుల్ని కనుక్కున్నారా?"

"అందర్నీ కనుక్కోలేదు"

"నేవెళ్ళి కనుక్కొస్తాను... మీరు ధైర్యంగా వుండండి. మీరే ఇలా అధైర్యపడితే ఇంక ఆడవాళ్లెలా? అవసరమైతే పోలీస్ రిపోర్టు కూడా ఇచ్చొస్తాను" అన్చెప్పి వచ్చేశారు.

భార్గవ ఏమైవుంటాడు?

కొన్నాళ్ళక్రితం సుబ్బరామయ్య చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. విద్యార్థి సంఘంలో భార్గవ చురుగ్గా తిరుగుతున్నాడన్నారు. తను పెద్దగా సీరియస్‌గా తీసుకోలేదప్పుడు. దానికీ, ప్రస్తుత అదృశ్యానికీ ఏమీ సంబంధంలేదు కదా?

మనస్సు పరిపరివిధాలపోతోంటే రెండు మెతుకులు కొరికి పట్నం వెళ్ళేరు మాస్టారు. తిన్నగా భార్గవ గదికెళ్లారు. గదికి తాళం వేసివుంది. భార్గవ మరొకర్తో కలిసి అందులో అద్దెకుంటున్నాడనీ, హోటల్లో భోంచేస్తూ చదువుకుంటున్నాడనీ ఆయనకి తెలుసు.

అతడి రూమ్మేట్ కోసం నిరీక్షిస్తూ అరుగు మీద కూర్చున్నారు.

మరో గంటకొచ్చాడతను.

"ఎవరు కావాలండీ?"

"నువ్వు భార్గవ రూమ్మేట్‌వా బాబూ?"

"అవునండీ... మీరు...?

"నేను సీతారామపురం మాస్టార్నిలే. భార్గవ గురించి నీతో కొంచెం మాట్లాడదామనొచ్చాను"

"లోపలికి రండి"

కూర్చుని మంచినీళ్ళు తాగేక మెల్లగా సంభాషణ ప్రారంభించారు-

"భార్గవ ఎక్కడికెళ్లాడో తెలుసా బాబూ?"

"తెలీదండి. చాలారోజుల్నుంచి రూముకి రావట్లేదు"

"ఏ వూరైనా సభలకెళ్ళేడేమో?"

"సాధారణంగా ఎక్కడికెళ్ళినా నాతో చెబుతాడండి. అతడితోబాటు మీటింగులకీ, సభలకీ వెళ్ళే ఒకరిద్దరు స్నేహితులు వ్వాళ్ళోనేవున్నారు- వాళ్ళుకూడా భార్గవ గురించి తెలీదన్నారు"

"ఈమధ్య అతడి ప్రవర్తనలో ఏమైనా మార్పువసిగట్టావా బాబూ?"

"చాలా మార్పొచ్చిందండీ! ఒక ఏడాది నుంచి విద్యార్థి సంఘంలో చురుగ్గా తిరుగుతున్నాడండి. చిన్న విషయానిక్కూడా పెద్దగా రియాక్టె కయ్యానికి దిగుతున్నాడు. కాలేజీలో లైబ్రరీలో, హోటల్లో, ప్రతి చోటా గొడవే. ఎంతో అసహనంగా, అశాంతిగా వుంటున్నాడు. తనలో తనెంతో మధనపడేవాడు. కొన్ని రాత్రుళ్ళు నిద్రపోకుండా తీవ్రంగా ఆలోచిస్తూ పచార్లు చేసేవాడు. పదిపదిహేను రోజులక్రితం వాళ్ళ నాన్నగారొచ్చారు. అప్పు గురించి పొలమూ, పశువులూ జప్తుచేశారని చెప్పారు. అప్పట్నుంచీ కాలేజీ మానేశాడు. ఒంటరిగా తీవ్రంగా ఆలోచిస్తూండిపోయాడు. ఎంత తరచి అడిగినా ఏమీ చెప్పేవాడుకాదు. ఉన్నట్టుండి మాయమైపోయాడు. బట్టలూ, పుస్తకాలూ కూడా పట్టుకెళ్ళలేదండి. ఏమయ్యాడో ఏమిటో అర్థంగాకుండా వుంది"

"వస్తాను బాబూ... నీకేమైనా సమాచారం తెలిస్తే నాకందజెయ్యి". అంటూ ఎడ్రసిచ్చి తిన్నగా పోలీస్‌స్టేషన్‌కెళ్లారు.

"భార్గవ అనే స్టూడెంటు అయిదార్రోజుల్నుండి కన్పించటంలేదు. రిపోర్టిద్దామనొచ్చాను"

"భార్గవ అంటే సీతారామపురం సుబ్బరామయ్య కొడుకేనా?"

"అవునండి"

"మీరేనా సుబ్బరామయ్య? చూస్తోంటే చదుకున్నవార్లా వున్నారు- కొడుకుని దార్లో పెట్టుకోలేకపోతే ఎలాగయ్యా..."


తూనికరాళ్ళు వేయకుండ ఆ బేగ్ వేసి తూస్తారేమిటండి?
ఇది నాగార్జునసిమెంట్ బేగ్ సార్! తూనికరాళ్ళ కంటే కూడా కరక్టుగా తూస్తుంది!!
చౌక ధరల దుకాణము నెం. 293.
MAM109

"క్షమించండి... నేను భార్గవ ఊళ్లో స్కూలు మాస్టార్ని మాత్రమే"

"ఏం మాస్టార్లో ఏమో... కొందరు లెక్చరర్లే అతణ్ని మార్చేసి పాడుచేసేశారు! అవడానికి కుర్రాడు తెలివైనవాడే కానేం లాభం?"

"నాకేవీ అర్థంకావట్లేదు. మీకతడు తెలుసా?"

"తెలుసా అని నెమ్మదిగా అడుగుతారేవిటి- ఇదిగో ఫైల్నిండా అతడి గురించే రాసివుంది. ఎప్పుడెక్కడికెలా వెళ్ళాడో ఎవర్తో మాట్లాడేడో అతడికూడా ఎవరెవరున్నారో అన్నీ వివరంగా రాసివుంది"

"అంటే..."

"అర్థంకాలేదూ... నువ్వేం మాస్టారివయ్యా! అతడు ప్రభుత్వాన్ని కూల్చెయ్యాలని చూసే విద్యార్థి సంఘంలోనివాడు. అందుకని అతడి మీద నిఘావేశారు. ఏదోరోజున పారిపోతాడని తెలును. కానింత అకస్మాత్తుగా మా కన్నుగప్పి మాయమవుతాడనుకోలేదు"

ఓ క్షణానంతరం అన్నారు "అయితే రిపోర్టు..."

"ఇచ్చినా ఇవ్వకపోయినా మేమాప్రయత్నంలోనే వున్నాం. ఇవాళకాకపోయినా రేపైనా పట్టితీరతాం. ఈలోగా మీకేమైనా ఆచూకీ తెలిస్తే మాకు తెలియజేయండేం! అది అతడికీ, మీకూ కూడా మంచిది" హెచ్చరింపు ధోరణిలో అన్నాడు ఇన్‌స్పెక్టర్.

బాధగా నిట్టూర్చారు మాస్టారు!

★ ★ ★

తూర్పున వెలుగురేఖలు విచ్చుకుంటున్నాయి.

గోపాలాచార్యులుగారు గోదావరిలో స్నానంచేసి సంధ్యావందనం తీర్చుకుని రాగిపాత్రలో నీళ్ళుతీసుకుని సీతారాముల కోవెలకొచ్చారు.

తాళంతీసి తలుపుతెరిచారో లేదో ఒక్కసారే విస్మితులయ్యారు.

ఒక్కసారి - క్షణంలో వెయ్యోవంతుసేపు - అనంతమైన కాంతి గర్భగుడిలో మెరిసి అదృశ్యమయింది!

అనుకోకుండా సూర్యకిరణాలు అద్దంమీదో లోహపు పళ్ళెంమీదోపడి వక్రీభవించినట్లున్నాయి.

కానీ ఆయన ఆలోచించలేదు. ఎన్నడూలేనిది ఇవ్వాళిలా జరిగిందంటే అది దైవలీలే అనుకున్నారు. తన జన్మధన్యమైందనుకున్నారు. ఆనందభాష్పాలు రాలుస్తూ చేతులు జోడించారు.

శరీరంలోని ప్రతి అణువూ పులకించిపోతోంటే తన్మయులై అరమోడ్పు కన్నుల్తో సీతారాముల విగ్రహాలనంక చూశారు. వాటి మొఖాల్లో కొత్త కాంతి - మున్నెన్నడూ కన్పించని కాంతిద్యోతకమయింది. శ్రీరాముడు చిర్నవ్వు చిందిస్తూ అభయహస్తం పట్టినట్టు అనుభూతి చెందారు.

కళ్ళనుంచి ఆనందభాష్పాలు జలజలారాలిపోతోంటే సాష్టాంగ నమస్కారం చేశారు.

గబగబా గర్భగుడిని శుభ్రంచేసి విగ్రహమూర్తులకి గోదావరి నీటితో అభిషేకం చేశారు. నామమాత్రపు ఫలహారంపెట్టి పూలతో పూజించారు. ఉచ్చైస్వరంతో మంత్రాలు పఠించారు.

ఇన్నాళ్ళూ అజ్ఞానంలో పడికొట్టుకుపోతూ ధూపదీపనైవేద్యాల సంగతి సరిగ్గా పట్టించుకోనందుకు క్షమించమంటూ వేడుకున్నారు. బొందిలో ప్రాణముండగా ఇంకెప్పుడూ అలా జరగనివ్వనని లెంపలేసుకున్నారు.

పూజాదికాలయ్యాక, ఆ సంగతి రాయుడుగారికి నివేదించడానికి వేగంగా వెళ్తోంటే దారిలో మాస్టారు కలిశారు.

"ఆచార్యులుగారూ... హడావిడిగా వెళ్తున్నారేవిటి కథ?" అంటూ.

"కథకాదండీ... మహాత్మ్యం - శ్రీరామచంద్రుడి మహాత్మ్యం..."

"మహాత్మ్యమా? ఏంజరిగిందండీ?"

"రోజూలానే స్వామివారికి అభిషేకం చేద్దామని ఉదయమే ఆలయతలుపులు తెరిచానో లేదో కళ్ళు మిరుమిట్లు గొల్పేంత కాంతి గర్భగుడి అంతా నిండిపోయిందంటే నమ్మండి. రెప్పపాటుకాలంలో అది అదృశ్యమైపోయింది. తప్పకుండా సాక్షాత్తు శ్రీరామచంద్రుడే వచ్చి




వుంటాడు. మనవూరికి కొత్తరోజులు రాబోతున్నాయన్నమాట. మన వూరికి శుక్రమహర్దశ పట్టబోతోందన్నమాట.

"అయితే నా సంకల్పానికి భగవంతుడి ఆశీర్వాదం కూడా లభించిందన్న మాట. ధన్యుణ్ని స్వామీ" భక్తితో కళ్ళు మూసుకున్నారు దేవదేవుణ్ని స్మరిస్తూ.

మాస్టారివంక పిచ్చిగా చూస్తూ, "మీ సంకల్పమా?" అనడిగారు.

"అవును ఆచార్యులుగారూ... ఒకప్పుడు మన ఊరిబడిలో చదువుకుని ఇవాళ ఉన్నత స్థానంలో ఉన్న నా శిష్యులందర్నీ పిలుస్తున్నాను. వారిలో కొందరైనా పూనుకుని మన ఊరి రూపురేఖలు మార్చేస్తారని నా ఆశ. మళ్ళీ మన ఇలవేల్పుకీ, మనఊరికీ మంచిరోజులొస్తాయని నా నమ్మకం- ప్రయత్నం"

"మీ సదాశయాన్ని దశరథ తనయుడు దీవించుగాక" ఆశీర్వదించి ముందుకు నడిచారు ఆచార్యులవారు.

అరగంట నిరీక్షించేక రాయుడి దర్శనమయింది.

ఉప్పొంగిపోతూ విషయాన్ని మనవి చేశారు ఆచార్యులుగారు.

కానాయనేమీ ప్రతిస్పందించలేదు.

"మీరెక్కడ పిచ్చివారు ఆచార్యులుగారూ! కలికాలం దేవుడెవరికీ కన్పించడు. ఎలాటి మహత్యాలూ చూపించడు. చూపించాడనెవరైనా చెబితే వాళ్ళు భ్రమపడైనా ఉండాలి. పిచ్చిలోపడైనా వుండాలి లేదా ఎదుటివారిని మోసగించాలని చూస్తూవుండనైనా ఉండాలి- హ్హహ్హ..."

ఎర్రచీమలు నఖశిఖ పర్యంతం ప్రాకినట్టు ఫీలయ్యారు ఆచార్యులుగారు.

"తమకెలా మనవి చెయ్యాలో తెలీటంలేదు. నేను చూసిందీ, చెప్పిందీ సాక్షాత్తూ సత్యమండి. ఆ సత్యసంధుడిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను"

"ప్రమాణాలకి కోర్టులోనే విలువలేదుగాని నాదగ్గరుంటుందా చెప్పండి? ఇంతకీ ఏవిటంటారు? ఇక నుంచి పూజలన్నీ ఘనంగా జరగాలంటారు. అందుకు నన్ను ఏర్పాట్లుచెయ్యమంటారు- అంతేనా?"

తనేదైతే అడగాలనొచ్చారో అదే ఆయన చెప్పేసరికి అవాక్కయ్యారు. తనో ఉద్దేశంతో అడగబోయారు. దాన్నింకో ఉద్దేశంతో తూస్తున్నారాయన!

"తమకి తెలీందేంవుంది. చాలాకాలం నుంచి ఆలయధర్మకర్తలూ గ్రామనాయకులూ అయిన తమరు ఆలయం మీద శీతకన్నేశారు. ధూపదీపాలూ నిత్యార్చనలూ కూడా సవ్యంగా జరగటంలేదు. ఇకనుంచైనా అన్నీ లోపరహితంగా చేస్తే గ్రామకళ్యాణానికి ఆ దేవదేవుడు ఆశీర్వదిస్తాడు"

"మీరు చెప్పేది బాగానే ఉంది. కాని ఆచార్యులుగారూ- స్వామివారి భూమిమీద వస్తోన్న ఆదాయం మీఖర్చుకి- అంటే పూజారి ఖర్చుకే చాలటంలేదు. ఇక దేవుడి ఖర్చుకెక్కడా అంటే ఎక్కడతేను చెప్పండి. జరిగింది ఊళ్ళో వాళ్ళకి కాస్త ఘనంగా వర్ణించి చెప్పండి. మీకూ, నాకూ, ఆ దేవుడికీ కూడా లాభం ఉంటుంది"

"తమరింటికొస్తోంటే దారిలో మాస్టారు కన్పించారండి! ఆయన చెవిని కూడా వేశాను. ఊరిబాగు నిమిత్తం తన పాతశిష్యుల్ని పిలుస్తున్నార్ట. ఆ కార్యాల్ని దేవుడు దీవిస్తున్నట్టుగా భావిస్తున్నానన్నారాయన. అంతేగాని పూజాదికాల గురించి మాట్లాడలేదండి. ఇక జనం ప్రవర్తన ఎలావుంటుందో!"

"ఏవిటన్నారూ- మాస్టారు తన పాతశిష్యుల్ని పిలుస్తున్నారా? ఈ పల్లెకా? ఎందుకుట?"

"గ్రామకళ్యాణానికట"

"ఓహో... గొప్పవాణ్నైపోవాలనుకుంటున్నాడు కాబోలు ముసలాయన. పల్లెలకి తరలివెళ్ళండ్రాఅని మహాత్ముడు ఉద్బోధిస్తే ఎవరూ విన్లేదు. ఇక ఈయన రమ్మంటే కదిలివచ్చేస్తారా పిచ్చిగానీ! మొత్తానికి భలేమాస్టారేనే! శిష్యులంతా ఏకలవ్యులనుకుంటున్నారు కాబోలు పిచ్చిమాస్టారు- హ్హ హ్హ హ్హ..."

కంపరంగా విన్పించింది ఆచార్యులుగారికి. తను ఒక పెద్దమనిషిగా గ్రామప్రముఖుడిగా భావించి గౌరవించే రాయుడింత నీచుడాఅని విస్తుబోయారోక్షణం.

ఏమీ అన్లేక నిస్సహాయంగా చూస్తుండిపో యారు.

ఇంతలో రాయుడు పట్టమహిషి గబగబా వచ్చింది. గాలికన్నా వేగంగా వార్త ఆమెని చేరిందిమరి.

"నేవిన్నది నిజమేనా ఆచార్లుగారూ?" అంది వస్తూనే.

"అవునమ్మగారూ"

"మరింకా అలా నిమ్మకినీరెత్తినట్టు కూర్చు న్నారేం... లేవండి లేవండి! పదండి ఆచార్లు గారూ! పూజాసామగ్రితో వస్తాం. ఇవాళ సహస్ర నామార్చన చెయ్యాలి. క్షీరాభిషేకం చెయ్యాలి. మహిమగలదేవుణ్ని ఊళ్ళోపెట్టుకుని కూడా ఇన్నాళ్ళూ కళ్ళు మూసుకొని చీకట్లో దేవుళ్ళా డుతున్నాం. ఇహపరసాధనకి ఇంతకు మించి దగ్గరిదారిలేదు- మాట్లాడరేమండీ?"

రాయుడు మాట్లాడలేదు. ఈ సంఘటనని ఎలా క్యాష్ చేసుకోవచ్చాఅని ఆలోచిస్తున్నారా యన!

క్షణాల్లో వార్త ఊరూవాడా పాకిపోయింది. చుట్టుపక్కల గ్రామాల్నుంచి కూడా జనం తండోపతండాలుగా రాసాగారు. రకరకాల కథ లు ప్రచారంలోకి వచ్చేశాయి.

★ ★ ★

జనవరి ఇరవైఅయిదో తారీఖు.

సీతారామపురంలో ఒక రకమైన సందడి, సంరంభం చోటుచేసుకున్నాయి.

ఆ మర్నాడు మాస్టారు ఏర్పాటుచేసిన సమావేశానికి ఎందరెందరో వస్తున్నారు. కొంద రొచ్చేశారుకూడా. ఎన్నోరకాల ఉద్యోగస్తులూ, వ్యాపారవేత్తలూ, నాయకులూ ఉన్నారు వారిలో.

వారిలో కొందరాఊరివాళ్ళు. కొందరు పొరు గూరివాళ్ళు. కొందరావూరి బంధువులింట్లో ఉండి చదువుకున్నవాళ్ళు. మరికొందరా ప్రాంతానికి తండ్రుల ఉద్యోగరీత్యా వచ్చి చదువుకున్నవాళ్ళు. ఇంకొందరు ఒకప్పుడా ఊరివారే అయినా తర్వాత పట్నాలకి వలసవె ళ్ళిపోయినవారి పిల్లలు.

ఎక్కడెక్కడో ఉన్నవాళ్ళంతా ఎన్నోరకాలుగా స్థిరపడినవాళ్ళంతా మాస్టారిమీద అభిమా నంతో వస్తున్నారు.

ఏ మూలచూసినా ఇదే విషయం గురించి మాట్లాడుకుంటున్నారంతా. ఏం జరుగు తుందోనని కుతూహలంగా ఎదురుచూస్తున్నా రంతా. తమ ఊరిబడిలో చదువుకుని గొప్పవా ళ్ళైనవాళ్ళని చూసే అవకాశం కలగబోతోందని సంబరపడుతున్నారు యువకులూ పిల్లలూ.

ఏమైతేనేం ఊరికి చైతన్యం వచ్చింది. ఊరి వారిదృష్టిలో మాస్టారు మహర్షిఅయిపోయారు!

రాయుడికీ, షావుకారికీ అన్ని వార్తలూ తెలు స్తూనే ఉన్నాయి.

కొన్నాళ్ళకిందట అరడజనుమంది కుర్రా ళ్ళు తమ ఊళ్ళో మూడునెలలుంటేనే ఎన్నో గొడవలొచ్చాయి. సవాళ్ళు ఎదురొచ్చాయి. ఇప్పుడేకంగా కొందరొచ్చి స్థిరపడిపోతే?

చూస్తోంటే తమకి చెడుకాలం దాపురించిన ట్టుగా ఫీలవసాగారిద్దరూ.

మాస్టార్ని ఆ ఊర్నించి ట్రాన్స్‌ఫర్ చేయిస్తే బావుంటుందని రాయుడు ఆలోచిస్తోంటే అప్పుగురించాయనమీద ఒత్తిడి తీసుకొస్తే బావుంటుందని ఎత్తు వేస్తున్నాడు షావుకారు.

వాళ్ళ ఆలోచనల గురించేమీ తెలీని మాస్టా రు చాలా ఆనందంగా, హుషారుగా వున్నారు.

తన శిష్యుల్నుంచి ఇంత ఉధృతంగా రెస్పా న్స్ వస్తుందని ఆయన ఊహించలేదు.

వస్తున్నామని కొందరు, తర్వాత కలుస్తామని కొందరు, రాలేకపోతున్నాంగాని మీరేం కోరినా సిద్ధమని కొందరు— రాసిన ఉత్తరాలొ చ్చాయి... వస్తున్నాయి.

"చూశావా శారదా... నా శిష్యులెంత మంచి మనస్కులో. అసలు గురుభక్తి అనేది మన జనం రక్తంలోనేవుంది. గురువు సాక్షాత్ పరబ్ర హ్మ స్వరూపమని భావించి పూజించడం ప్రాచీ నకాలంనుంచీ వస్తున్న ఆచారం. గురుదేవో భవ అంటూ గురువుకి నమస్కరించడం, గు రువు ఆజ్ఞని శిరసావహించటం అనాదిగా వస్తోన్న మన సాంప్రదాయం!"

పరమానందంతో ఊగిపోతూ చెబుతోంటే ఆయన మొఖంలో కదలాడుతోన్న అలౌకికా




నందాన్ని చూస్తూ తనువుమరచిపోయింది శారద.

తమ శిష్యుల గురించీ, వారి ప్రతిభల గురించీ, అలంకరించిన పదవుల గురించీ, అలా ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నారు; మరెన్నో గతస్మృతుల్ని నెమరు వేసుకున్నారు. ఇంతలో...

"మాస్టారూ" అంటూ వచ్చాడు పోస్ట్‌మన్.

"రావోయ్...రా- శారదా- కాసిని మంచినీళ్ళివ్వు ఖాన్‌సాహెబ్‌కి"

"టెలిగ్రాం వచ్చింది సార్"

"ఎక్కణ్ణుంచోయ్. నా శిష్యుడి దగ్గర్నుంచే అయివుంటుంది" ఖాన్‌ముఖంలో కదుల్తోన్న భావాన్ని గమనించకుండా హుషారుగా అన్నారు.



"శిమ్యల్నుంచికాదుసార్... కొంచెం... చెడు వార్తే" బాధగా అన్నాడు.

విస్మయంగా చూశారు.

శారద చేతిలోంచి మంచినీళ్ళ గ్లాసు జారి పోయింది.

"నా బిడ్డ నరితకేం కాలేదు కదా?" మాతృ హృదయం తల్లడిల్లింది.

"కొంచెం బావుండలేదుట. వెంటనే బయ ల్దేరి రమ్మనీ..."

ఏడుస్తూ కూలబడిపోయింది శారద.

టెలిగ్రాం అందుకుని చూశారు.

'నరిత సీరియస్, స్టార్ట్ ఇమీడియట్లీ– నందనరావు'

నా చిట్టితల్లికి ఏమైవుంటుంది? నా చిన్నారి పొన్నారి సంగీతలక్ష్మినేంచేసి వుంటారా దుర్మా ర్గులు?

కన్నీళ్ళు ధారలుగా కారిపోతోంటే శిలలా నిలబడిపోయారు మాస్టారు.

"అన్నీ తెలిసినవారు మీరు కూడా ఇలా డీలాపడిపోతే ఇక అమ్మగారికెవరు ధైర్యం చెబుతారు?"

ఖాన్ మాటలకి కళ్ళు తుడుచుకున్నారు.

"ఊరుకో శారదా... నరిత ఆరోగ్యం బాగోలేద న్నారంతే. మనం ఊరికే భయపడాల్సిన పని లేదు. లే- లే మరీ..."

"లేదండీ... వాళ్ళు అత్తవారు కాదండీ- యమభటులు. నాబిడ్డని పీల్చిపిప్పి చేసింది గాక ముక్కలుగా కోసుకుతినాలని చూస్తున్నా రండీ! నాబిడ్డనేదో చేసేసి వుంటారండీ..."

"ఊరుకో శారదా... ఏమయిందో ఏమిటో తెలుసుకోకుండా ఆందోళనతో సతమతమ వడం మంచిదికాదు. లే... గుండె దిటవుచేసు కో. ఇప్పుడే ప్రయాణమై బయల్దేరదాం"

ఇరుగుపొరుగువచ్చి ఓదారుస్తోంటే దుఃఖం రెట్టింపవుతోంటే బయల్దేరారు మాస్టా రు దంపతులు.

మూడుగంటలు ప్రయాణంచేసి నరిత అత్తవారింటికెళ్ళారు. వాళ్ళని చూసి ముఖా లు ముడుచుకున్నారంతా. లోపలికి రమ్మనలే దు సరికదా ఒకరు ఎదురొచ్చి "నరిత గవర్న మెంటాసుపత్రిలోవుంది" అన్చెప్పేరు.

"ఎలావుంది... ఏమిటనారోగ్యం?"

"ఏంలేదు... స్టౌ అంటుకుందంతే! ప్ర మాదం ఏంలేదు"

గుండెలు గుభేలుమన్నాయి ఇద్దరికీ.

"సీరియస్‌గా వుందా?"

"అహ- అలాటిదేంకాదు. నందనరావు ఊరికే కంగారుపడి టెలిగ్రాం ఇచ్చాడంతే"

అదే రిక్షాలో ఆసుపత్రికెళ్ళారు.

నరిత నల్లని బొమ్మలావుంది! ఒంటిమీద స్పృహలేకుండా పడివుంది!

పిల్లలు గోడుగోడున ఏడుస్తోంటే సముదా యించాలని ప్రయత్నిస్తున్నారెవరో.

చలనరహితంగానూ, వికృతంగానూ ఉన్న కూతుర్నిచూసి మూర్ఛబోయింది శారద.

గుండెలు వ్రక్కలవుతోంటే అతికష్టంమీద నిలదొక్కుకుంటూ దుఃఖాన్ని దిగమింగసాగా రు మాస్టారు.

ఏం జరిగిందని అడిగారు.

ఒక పెద్దాయన మాస్టార్ని పక్కకి తీసుకెళ్ళి అన్నారు- "అయిందేదో అయిపోయింది. ప్రా ణగండం తప్పిందన్నారు డాక్టర్లు- అదే పదివే లు. ఇప్పుడింక కేసులూ, కోర్టులూ ఎందుకు చెప్పండి? ఎంతైనా మనం మనం కావాల్సినవా ళ్ళం. అమ్మాయి పండంటికాపురాన్ని కూల దోసి, పిల్లల్ని అనాథల్ని చేస్తామా చెప్పండి?"

"మీరిదంతా ఏమాశించి చెబుతున్నారో నాకర్థం కావడంలేదు

"ఇందులో మావాళ్లకి ప్రత్యేకంగా కలిసొచ్చే దేం లేదండి! వచ్చని కాపురాన్ని నిలబెట్టాలనే నా తాపత్రయం"

"ఎవరి కాపురం?"

"అదేం మాట... మీ అమ్మాయిదే!"

"ఆ కాపురం కాలిపోయిందిగా!"

వెర్రిగా చూశాడాయన. "అమ్మాయి కాలిపో యిందిగాని కాపురానికేమండి. మీరు కలిసొస్తే నిక్షేపంలా వుంటుంది"

"అంటే నరిత మొగుడు సాక్షాత్తూ దేవుడనీ, ఆమె అత్తగారు అమృత హృదయురాలనీ




పోలీసులతో చెప్పాలంటారు''

"మీరలా వేళాకోళం చెయ్యటం మంచిదికాదు''

"మరేమని చెప్పాలంటారు?''

"జరిగిందానికి నాకూ బాధగానే వుంద అలా అని కాపురం కాలదన్నుకుంటామా చెప్పండి? సంసారమన్నాక ఆటుపోటులుంటాయి మరి. ఏదోలా సర్దుకుపోవాలి. పెద్దవారు. మీకు తెలీంది ఏం వుంది చెప్పండి?''

"సరిత మీ అమ్మాయి అయివుంటే మీరిలాగే మాట్లాడేవారా?''

ఆయన నిరసనగా చూశాడు- "నాకు తోచింది చెప్పేను. ఆ తర్వాత మీ ఇష్టం'' అనేసి విసురుగా వెళ్లిపోయాడు.

నవ్వుకున్నారు మాస్టారు- అంత బాధలోనూ!

విషాగపు పెనుతాకిడి నుంచి మెల్లమెల్లగా కోలుకోసాగింది శారద.

సరితకి స్పృహరావడానికి కృషిచేస్తున్నారు డాక్టర్లు.

ఆమెకి స్పృహ వస్తే స్టేట్‌మెంట్ రికార్డ్‌చేసుకోడానికి కాచుక్కూర్చున్నారు పోలీసులూ, మేజిస్ట్రేటూ.

నందనరావూ, అతడి తల్లీ, వారి బంధువులూ సరిత చుట్టూ కాలుగాలిన పిల్లుల్లా తిరుగుతూ అంతులేని విచారాన్ని అభినయిస్తున్నారు.

"వాళ్లెందుకండీ- అంత కంగారుపడి కలతిరుగుతున్నారూ?'' శారద అడిగింది అమాయకంగా.

"నేరస్తులుకదా- అమ్మాయి చనిపోయి వుంటే వాళ్లు బతికిపోదురు. కాని బతికింది. తమని పట్టిస్తుందేమోనని వారి భయం. అమ్మాయి నిజం చెప్పిన మరుక్షణం వాళ్ల చేతులకి సంకెళ్లుపడతాయి. మెడకి ఉరి పడినా పడొచ్చు''

"అయ్యో...! అలా చెప్పొద్దని చెప్పండి. కోరి కొరివితో తల గోక్కోవడమెందుకు?''

"బతికుండగానే తల కొరివి పెట్టినందుకు!''

"అయితే మాత్రం అతగాడు మొగుడు కాకపోతాడా, ఇది పెళ్లాం కాకపోతుందా? చూస్తూ చూస్తూ సంసారాన్నెలా కూలదోసుకోగలదు చెప్పండి?''

"సరితా, దాని పిల్లలూ అష్టకష్టాలు పడినా ఫర్లేదు శారదా- నేరస్తులు శిక్ష అనుభవించి తీరాల్సిందే! లేకపోతే ఈ జాడ్యం సమాజాన్ని ఏ ఆటవిక దశకి తీసుకుపోతుందో ఊహించటం కష్టం''

మరి మాట్లాడలేకపోయిందావిడ.

సరితకి ఎట్టకేలకు స్పృహవచ్చింది.

తండ్రి కంటబడేసరికి కన్నీళ్లు పొంగిపొరలాయ్.

"నీకేం ఫర్లేదమ్మా... జరిగింది జరిగినట్టు చెప్పు. మనవాళ్లన్న భ్రమతో సానుభూతితో స్వార్థంతో నేరాన్ని కప్పిపుచ్చటం కూడా నేరమే అవుతుంది'' గంభీరంగా అన్నారు.

మేజిస్ట్రేటు వచ్చి అడిగారు.

అత్తగారూ, భర్తా కలిసి ఒంటిమీద కిరసనాయిలు పోసి అంటించారని చెప్పేసింది సరిత.

పోలీసులు వెంటనే వాళ్ళిద్దర్నీ అరెస్ట్‌చేశారు.

మరుక్షణం మంత్రించినట్టు మాయమయ్యారు వాళ్ల మనుషులంతా!

పిల్లలకి సరితా, సరితకి కన్నవాళ్లూ మిగిలారు.

కూతుర్నీ మనవల్నీ కంటిమీద కునుకులేకుండా ఆ రాత్రంతా కంటికి రెప్పలా చూస్తూ కూర్చున్నారు మాస్టారూ- శారదమ్మా.

మర్నాటికి గండం గడిచినా సరిత పరిస్థితింకా సీరియస్‌గానే వుంది.

"మనూరెళ్లొస్తాను శారదా''

"అమ్మాయినీస్థితిలో వదిలా?''

"సమావేశానికి ఎక్కడెక్కణ్నుంచో వస్తారు. వాళ్లని నిరుత్సాహపరచటం భావ్యం కాదు''

"కడుపున పుట్టిన బిడ్డ పనికన్నా వూరి పని ఎక్కువంటారు!''

"తన కోసంగాక పదిమంది కోసం చేసే

ప్రతి పనీ ఎక్కువే... గొప్పదే. సాయంత్రానికల్లా వచ్చేస్తాను- ధైర్యంగా వుండు శారదా!''

★ ★ ★

ముద్దుగా ముచ్చటగా వున్న బడిపిల్లలు దేశమాత ఫొటోకి పూలదండ వేశారు. మాస్టారు జెండా ఎగురవేయగా జెండా వందనం చేశారంతా.

దేశం గురించీ, దేశ నాయకుల గురించీ కొన్ని పాటలు పాడారు.

సమావేశం కోసం వచ్చిన పాత విద్యార్థులంతా ఓ పక్కన నిలబడి చూస్తున్నారు. తమ బాల్యాన్ని గుర్తుచేసుకుంటున్నారు.

గాంధీజీ గురించీ, సత్యా హింసలగురించీ స్వాతంత్ర్యపోరాటం గురించీ, దేశ ప్రగతి గురించీ సరళ భాషలో వివరించారు మాస్టారు.

అనంతరం మిఠాయిలు పంచిపెట్టారు. కేరింతలు కొడుతూ ఇళ్ళకెళ్ళిపోయారంతా.

బడిలో అంతకుముందే ఏర్పాటుచేసిన కుర్చీల్లో ఆసీనులయ్యారు పాత విద్యార్థులంతా. కొంతమందింకా వస్తూనేవుండటంతో స్వపరిచయాలు చేసుకుంటూ పాత విశేషాలు ముచ్చటించుకుంటూండిపోయారు కొంత సేపు.

ప్రభాకర్ టీ ఫలహారాలు ఏర్పాటుచేశాడు.

''మాస్టారూ- సమావేశానికెవరో పెద్దవార్ని అధ్యక్షత వహించమంటే బావుంటుంది. పోనీ మా నాన్నగార్ని ఆహ్వానిద్దామా?''

ప్రభాకర్ మాటలకి ఇబ్బందిగా చూశారాయన. ''గురుశిష్యుల సమావేశానికి పెద్దలూ, అధ్యక్షులూ ఎందుకు ప్రభాకర్''

''మీకన్నా పెద్దలూ యోగ్యులూ ఎవరున్నారు మాస్టారూ?'' డాక్టర్ దీపిక అంది.

మరిద్దరు కూడా అదేమాటనడంతో మొహం గంటుపెట్టుకుని కూర్చుండిపోయాడు ప్రభాకర్.

''ఇక సమావేశం ప్రారంభిద్దామా?''

''ఓకే సార్''

''ప్రియ శిష్యులారా!

సుమారు పాతికముప్పై ఏళ్ళక్రితం మీ జీవితపు తొలిదశలో అఆలు నేర్పిన ఈ బడుగు పంతులి కోరిక మన్నించి వచ్చిన మీకందరికీ నా ఆశీస్సులు. ఊరి మీది అభిమానంతో వచ్చిన మీకందరికీ నా హృదయపూర్వక అభినందనలు.

మీలో డాక్టర్లున్నారు. ఇంజినీర్లున్నారు. లాయర్లున్నారు. వ్యాపారవేత్తలున్నారు. రాజకీయనాయకులున్నారు. ప్రభుత్వాధికారులున్నారు. ఇంకెన్నో రకాల వుద్యోగాల్లో, వృత్తుల్లో వున్నవారున్నారు. నిస్సందేహంగా మీరంతా నాకంటే ఎన్నోరకాల ఉన్నతులు. అయినా నేను చిన్న వుత్తరం రాయగానే వచ్చి వాలిన మీమీది అభిమానంతో, ప్రేమతో నాగుండె నిండిపోయింది.

నిజంగా ఇది అపూర్వ క్షణం! ఉత్తేజకరమైన సంఘటన!

ఏదేశం లోనైనా, ఎలాంటి మార్పుకైనా ఆద్యులు యువకులే. స్వాతంత్ర్యోద్యమంలోనూ ఎమర్జన్సీని ఎదిరించడంలోనూ యువకులు నిర్వహించిన పాత్ర అపూర్వం... అమోఘం!!

మళ్ళీ అదే స్పిరిట్‌తో కొన్నాళ్ళు విద్య నేర్పిన వూరిని ప్రగతి చక్రాలమీద నడిపించడానికి ముందుకొచ్చిన మీకందరికీ ఇదే నాస్వాగతం.

స్వయంగానూ, బంధుమిత్రుల ద్వారానూ గ్రామ పరిస్థితిని ఆకళింపు చేసుకుని వుంటారనుకుంటాను. సర్వదుర్లక్షణాలూ ఆవరించగా అధోగతికి చేరుకుంటున్న కుగ్రామం మనది. దీనిని బాగుచెయ్యాల్సిన బాధ్యత మనమీదుంది. అంతటి గురుతరమైన బాధ్యతని విజయవంతంగా నిర్వహించగలశక్తి కేవలం మీ యువతకే వుంది.

చొరవ ధైర్యం సాహసం నిస్వార్థం ఆవేశం పరోపకారగుణం విజ్ఞతవిజ్ఞానం మీ సొత్తని జగానికంతటికీ తెలును.

అంచేత గ్రామాభివృద్ధికి మనమేం చెయ్యగలమో, మీరెంతవరకూ తోడ్పడగలరో తెలియజేయాల్సిందిగా కోరుతున్నాను. నిస్సందేహంగా, నిర్మొహమాటంగా మీమీ భావాలతో అభిప్రాయాలతో ఆలోచనలతో ముందుకొచ్చి ఈ కార్యానికి చేయూతనివ్వాల్సిందిగా అర్థిస్తున్నాను''




మాస్టారి ప్రసంగం అనంతరం కొన్ని నిమిషాల పాటు అంతా మౌనంగా వుండిపోయారు. ఎవరో ఒకరు ముందుకొస్తే తప్ప ముందుకు రాలేని తత్వం వారిలో చోటుచేసుకునుంది మరి.

తనో పెద్ద లీడర్నని భావించే ప్రభాకర్ ముందుకొచ్చి గొంతు సవరించుకున్నాడు.

"డియర్ ఫ్రెండ్స్! దేశపటం మీద మనవూరు సగర్వంగా గుర్తింపబడాలని కోరుకునేవారిలో ప్రథముణ్ని నేను. అందుకోసం ఏం చేయడానికైనా నేను సిద్ధమే. కానీ సత్యం మీకు తెలియజెప్పాలి. నినాదాలవల్లా, సమావేశాలవల్లా వూరిని బాగుచెయ్యలేం. ఏ ఒక్కరివల్లో ఇద్దరివల్లో అది సాధ్యంకాదు కూడా - అందుకు ప్రభుత్వ సహకారం కావాలి. ప్రభుత్వం నుంచి గ్రాంట్లు సంపాదించాలి. ప్రజాప్రతినిధుల మద్దతు వుంటేనే గ్రాంట్లు లభిస్తాయన్నది జగమెరిగిన సత్యం. అందువల్ల వచ్చే అసెంబ్లీ ఎన్నికల్లో నేను ఎమ్మెల్యేగా పోటీ చేయదలిచాను. మీరంతా మీమీ ప్రోత్సాహసహకారాలని అందిస్తారని ఆశిస్తున్నాను. ఎమ్మెల్యేగా ఎన్నికైన వెంటనే మన గ్రామానికి నవోదయం తెస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను"

కొందరు నవ్వేరు. కొందరు చప్పట్లు కొట్టారు.

డాక్టర్ దీపిక ముందుకొచ్చింది.

"నమస్తే... నన్ను మీలో చాలామంది ఎరుగరనుకుంటాను. నేనీ వూరిదాన్నిగాకపోయినా ఇక్కడే పెరిగాను. బేసిక్ విద్య ఇక్కడే పూర్తిచేశాను. నేను పూజారి గోపాలాచార్యులుగారి మేనకోడల్ని. ఇకపోతే నేనీమధ్యనే హౌస్ సర్జన్సీ పూర్తిచేశాను. సిటీలో క్లినిక్ తెరవడమా, ఉద్యోగానికి ప్రయత్నించడమా అని ఆలోచిస్తోంటే మాస్టారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. ఇక్కడి పరిస్థితి ఒక్కరోజులోనే గ్రహించాను. సిటీలో, టౌన్లలో చాలామంది డాక్టర్లున్నారు. క్లినిక్కులకీ, నర్సింగ్ హోంలకీ కొదవలేదు. ఏ మాత్రం వైద్య సౌకర్యంలేని ఈ వూరులాంటి వూళ్లల్లో డాక్టర్ల అవసరం ఎక్కువుందనిపించింది. నేనింతదాన్ని కావటానిక్కారణం ఒకప్పుడు మాస్టారు వేసిన పునాదే. అలాగే నా వృత్తి అనే భవనానికి మాస్టారి చేతే పునాదిరాయి వేయించుకోవాలన్న నా ఆకాంక్ష ఈరకంగా తీరబోతున్నందుకు చాలా ఆనందంగా వుంది. నేనీ వూళ్ళో ఆసుపత్రి పెట్టాలని నిర్ణయించుకున్నాను. మీ అందరి ఆశీర్వాదం లభిస్తుందని నా ఆశ"

చేతులు జోడించి నమస్కరించింది.

చప్పట్లు మార్మోగాయ్.

మాస్టారు ఆనందభాష్పాలు రాలుస్తూ అన్నారు - "నీ సేవానిరతికి అంజలి ఘటిస్తూ నీ నిర్ణయానికి పూర్ణమనస్సుతో అభినందిస్తున్నానమ్మా"

"థాంక్యూ మాస్టారూ"

"ఊరు బాగుకోసం ఏదో ఒకటి చెయ్యాలని నాకూ వుంది. కాని ఎక్కడో రాయలసీమలో వుద్యోగం చేస్తున్నవాణ్ని. నైతిక సాయం అందివ్వటం తప్ప నేనేం చేయగలను?" అన్నారొకరు.

తనక్కొందరు జిల్లా అధికారులు తెలుసుననీ, వాళ్ల ద్వారా మన గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలు చేబట్టేట్టు కృషి చేస్తానన్నారొకరు.

"ఈ ప్రాంతం వెనుకబడి వుండటానికి ప్రధాన కారణం పరిశ్రమలు లేకపోవడమే అనుకుంటాను. ఊరి పక్కనే గోదావరి నది వుంది. పచ్చని చేలూ తోటలూ వున్నాయి. వాటితోబాటు బీళ్ళూ ఇసుక పర్రలూ నిరుద్యోగమూ కూడా వున్నాయి. మన ప్రాంతపు వనరుల్ని దృష్టిలోపెట్టుకొని ఒక పరిశ్రమ పెడితే బాగుంటుందని వుంది. మా మావగారు పారిశ్రామికవేత్త అనీ, కొన్ని కంపెనీల్లో డైరెక్టరనీ మీలో కొందరికి తెలిసేవుంటుంది. ఈమధ్యనే ఎరువుల ఫ్యాక్టరీ పెట్టాలని నిర్ణయించటం జరిగింది. స్థలం గురించి ఫైనలైజ్ కాలేదింకా. అది మన ప్రాంతంలో ముఖ్యంగా మన ఊళ్లో స్థాపించడానికి అవకాశం వుంటుందేమో పరిశీలించమంటాను. అంతా అనుకూలంగా వుంటుందని నా నమ్మకం. మా మావగారితోనూ, తదితర ప్రమోటర్స్‌తోనూ చెప్పి ఒప్పించడానికి శాయశక్తులా కృషిచేయగలనని మనవి చేస్తున్నాను. నాకీ అవకాశమిచ్చిన మన మాస్టారికి ప్రత్యేక కృతజ్ఞతలర్పిస్తున్నాను" అన్నాడు




గిరిధర్.

మరోసారి చప్పట్లు మిన్నుముట్టాయి.

"నేను టీచర్ ట్రైనింగు పాసయ్యాను. ప్రస్తుతం వుద్యోగాన్వేషణలో వున్నాను. ఎవరైనా మనూళ్ళో స్కూలుగాని, కాన్వెంటుగాని పెడితే తక్కువ జీతానికి పనిచెయ్యడానికి సిద్ధంగా వున్నాను" అంది భారతి.

"మన పంచాయితీ వ్యవస్థ గ్రామాలకి విస్తృతాధికారాలిచ్చింది. మనం చెయ్యాల్సిందల్లా వాటిని సక్రమంగా వినియోగించుకోవడం. సక్రమంగా అమలు పరిచేట్టు చూడటం. తమ ఇంటి బాగుగురించేగాక తమ వూరి బాగుగురించి కూడా కొంతైనా పట్టించుకోవడం ప్రతిపౌరుడి బాధ్యత - కర్తవ్యం. మన వూరు మరీ వెనుకబడి వుండటానిక్కారణం పౌరుల్లో చైతన్యం లోపించడమే. అందువల్ల పౌరుల్ని ఎడ్యుకేట్ చేసి పంచాయితీ యంత్రాంగాన్ని నిద్రలేపితే మనగ్రామం ప్రగతిపథంలో పయనించడానికికెంతో సమయం పట్టదని పంచాయతీరాజ్ శాఖలోని అధికారిగా నొక్కి చెబుతున్నాను" అన్నాడు సుందర్రావు.

"ఒకప్పుడు వూరికి అప్పిచ్చువాడు, వైద్యుడు, నిత్యం పారేఏరూ, ద్విజుడూ ముఖ్యమన్నారు. ఇవాళ పాఠశాల, పోస్టాఫీసూ, ఆసుపత్రి, బ్యాంకు ముఖ్యం. నిజానికి అత్యావసరం. మనూళ్ళో పోస్టాఫీసు వుంది. డాక్టర్ దీపిక క్లినిక్ తెరుస్తున్నారు. పాఠశాల వుంది. కానది ప్రాథమిక పాఠశాల మాత్రమే. దానిని యు.పి. స్కూల్‌గా చేయించాలి. ఒక బ్యాంకు బ్రాంచినిక్కడ తెరిపించాలి. అప్పుడు వూరిజనం వడ్డీ వ్యాపారుల వుక్కుపిడికిళ్ళలో నలగాల్సిన అగత్యం వుండదని నా నమ్మకం. విభిన్నవృత్తుల్లో, వ్యాపారాల్లో వున్న మనమంతా కలసికట్టుగా కృషి చేస్తే ఆ రెండూ సాధించడం కష్టంకాదనుకుంటాను" ప్రద్యుమ్నరావన్నాడు.

అతడి వాదనతో చాలామంది ఏకీభవిస్తూ తలలాడించారు. కొందరు చప్పట్లు కొట్టారు.

మాస్టారు అభినందిస్తూ చూశారతణ్ని.

"ఇలాటి సభల్లో సమావేశాల్లో ఆవేశపడి అది పొడిచేస్తాం ఇది పిండిచేస్తాం అని చెప్పడం తర్వాత తమతమ లంపటాల్లో పడి వాటిని పూర్తిగా మర్చిపోవడం పరిపాటి. అందుకని మనం నింగిలో విహరించకుండా నేలమీద నడవటం మంచిదంటాను. ఎన్నో వందలమైళ్ళ దూరంలో తలతాకట్టుపెట్టి వుద్యోగాలు చేసే మనం వూరికోసం ఏదో చేసెయ్యగలమనుకోవడం వట్టి భ్రమ మాత్రమే. చప్పట్లనాశించి కబుర్లు చెప్పడం మానేసి మనమేం చెయ్యలేమన్న పచ్చినిజాన్ని ఒప్పుకోవడం వుత్తమం"

ముకుందం మాటలు ములుకుల్లా గుచ్చుకొన్నాయి చాలామందికి.

"షేమ్‌షేమ్" అన్నారు కొందరు.

"నీ సంగతి చెప్పాలి" అని అరిచారొకరు.

"నేను చెప్పేదీ అదే. పొట్టకోసం వూరిడిచిపోయినవాణ్ని. నేనున్నదే నా వూరనుకుంటున్నవాణ్ని. ఇకపోతే నలుగుర్నీ కలుద్దాం, బంధువుల్ని చూద్దాం అనొచ్చానప్ప ఇక్కడ ఏదో చారిత్రిక నిర్ణయాలు తీసుకుంటారనీ వాటివల్ల వూరి రూపురేఖలు మారిపోతాయనీ నేను భ్రమించడంలేదు. మీరు అలాటిభ్రమలకి లోనవ్వొద్దు. ఇవాళ నా మాటలు చేదుగా అన్పించొచ్చు. కాని రేపు ఒప్పుకుని తీరతారని నాకు తెలుసు."

"ఇది వూరిసమస్య. వూరి బాగువల్ల లాభపడేదీ వూరివాళ్ళే. అందువల్ల వాళ్ళే ఆ సమస్యకి పరిష్కారం కనుక్కోవడం మంచిది. వాళ్ళంతా కలసికట్టుగా వుండి వూరికి మేలు చేసే వాళ్ళకే ఓట్లేస్తామంటే చచ్చినట్టు పనులు చేస్తారు" అని అభిప్రాయపడ్డాడు యేసుదాసు.

"గ్రామాభివృద్ధికోసం అధికార్లని కలవాలి. నాయకుల్ని పిలవాలి. అందుకు డబ్బు అవసరం. అందుకో ఫండ్‌ని ఏర్పాటు చేస్తే బావుంటుంది. అందుకు నావంతుగా వెయ్యి రూపాయలు విరాళం ప్రకటిస్తున్నాను" అన్నారొకరు.

"ఈవూరు చాలా అధ్వాన్నస్థితిలో వున్నమాట నిజమే. దీన్ని బాగుచేస్తూ విలువైన కాలాన్ని వృధా చెయ్యడం అవివేకం. కాలంతో బాటు మనమూ మారకతప్పదు. అభివృద్ధి

చెందిన దేశాల ప్రగతితో మనం పోటీ పడా లంటే దేశంలోని అభివృద్ధి చెందిన ప్రాంతా లని మరింతగా అభివృద్ధి పర్చడమే ఏకైక మార్గం. అంచేత మాస్టార్ని ఈ వూరొదిలి మా వైజాగ్ రమ్మని ఆహ్వానిస్తున్నాను. రిటైర్ అయిన తర్వాత ఆయనకెలాటి లోటూ రాకుండా చూడగలననీ వైజాగ్‌లో తన వూహా లకి రూపం ఇవ్వొచ్చనీ విజ్ఞప్తి చేస్తున్నాను'' అన్నాడు రంగస్వామి.

''చాలా థాంక్సు బాబూ. కానీ, నా గురించీ రిటైర్మెంట్ తర్వాతి నా జీవితం గురించీ నేనాలోచించటంలేదు. నాకోసం ఈ వూరొదిలి పోవాలనీ అనుకోవడంలేదు. మన ఈ గ్రామా న్ని గొప్పదిగా చెయ్యటం కష్టమే. ఒప్పుకుంటా ను. అయినా ఉడతాభక్తిగా ఎంతోకొంత మేలు చెయ్యాలన్నదే నా తాపత్రయం. రంగస్వామికి నా మీద గల అభిమానానికి మరోసారి కృతజ్ఞత లర్పిస్తున్నాను'' సజలనేత్రాలతో అన్నారు మాస్టారు.

చివరిగా శివం మాట్లాడాడు.

''ఇక్కడున్న చాలామందికన్నా నేను జూని యర్ని. అంచేత చాలామంది నన్నెరగరను కుంటాను. నా పేరు శివం. బీయస్సీ ఫైనల్ ఇయర్ స్టూడెంటుని. ఇంకొద్దిరోజుల్లో నా చదువు పూర్తవుతుంది. అప్పుడీ వూళ్ళో స్థిరప డి నా 'విజ్ఞానాన్ని రైతుల శ్రేయస్సుకుపయోగ పడేట్లు మరల్చుకోవాలన్నది నా ఆశయం. రైతులేయే రకాల విత్తనాలూ, ఎరువులూ వాడాలో, అధికపంట పండించడం ఎలాగో, వృవవృత్తుల అవసరమేమిటో చెప్పగలను. కాని వారి పెట్టుబడికీ, ఇతర అవసరాలకీ వడ్డీ వ్యాపారుల కౌగిట్లో ఇరుక్కోకుండా చూడటం నాకు సాధ్యంకాదు. ఒకప్పుడు మనూళ్ళో వెలి సిన కో ఆపరేటివ్ సొసైటీ రాయుడిగారి పుణ్యమా అని దివాళా తీసేసిన సంగతి మీలో కొందరికైనా తెలుసనుకుంటాను. ఇక మన వూరి దరిదాపుల్లో ఒక్కవాణిజ్య బ్యాంకు కూడా లేదు. అందుచేత మనమంతా కలిసి మనూ ళ్ళో బ్యాంకు బ్రాంచిని ప్రారంభింపజేయిస్తే రైతు కూలీల అవసరాలకు ఆదుకునే మహాశక్తి లభించినట్టవుతుంది. ఇంతచేసినా వూరు బాగుపడుతుందంటే నమ్మకంలేదు. ఎంచే తంటే క్షుద్రరాజకీయాలిక్కడ ప్రాణాలతో చెల గాటమాట్టానికి సంసిద్ధమైవున్నాయి. వారికె లాటి కష్టంగాని నష్టంగాని కలుగుతుందను కుంటే పులిపంజావిసరడానికి సిద్ధంగా వున్నా రు. వాటి ఆటకట్టిస్తే తప్ప గ్రామాల్లో శాంతి చేకూరదు. అందుకు జనాన్ని సంఘటితప ర్చాలి. అది జరగనినాడు మనమేం చేసినా బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది మన ప్రయత్నమంతా. స్వార్థత్యాగంతో మన గ్రామో న్నతికి చేయి అందించడానికి ముందుకొచ్చిన మీకందరికీ మనగ్రామ జనం తరఫున కృతజ్ఞ తాభివందనాలు తెలియజేస్తున్నాను''

అతడి ప్రసంగం మధ్యలో ప్రభాకర్ విసు రుగా లేచి నిరసనగా నిష్క్రమించటం చాలా మంది గమనించారు. వూళ్ళోపాలిటిక్స్, గొడవ లు వున్నాయి కాబోలనుకుని జంకేరు కొందరు.

మాస్టారు లేచి నిలబడ్డారు.

''ఎందరో మహానుభావులు. అందరికీ వందనాలు అన్నాడు త్యాగయ్య. పరోపకారబు ద్ధితో ముందుకొచ్చిన మీరందరూ మహానుభా వులే. చిన్నవాళ్ళైనా మీకందరికీ నా వందనా లు. ఇవాళ్టి ఈ చిన్ని సమావేశం మనవూరి గురించి మీ అందర్లో చిన్నపాటి ఆలోచన రేకెత్తించిందని, చిన్నకదలిక పుట్టించిందని, చిన్న చైతన్య బీజం నాటిందని మనస్ఫూర్తిగా భావిస్తున్నాను. ఆ ఆలోచన, ఆ కదలిక, ఆ బీజం వృధాపోవని నా దృఢనమ్మకం. రేపటిగ్గా కపోయినా ఎల్లుండికైనా అది కార్యరూపం ధరిస్తుందని నిజంగానే మనగ్రామం హసిస్తుందని ఆశిస్తూ కీర్తిమంతులుకావాలని మిమ్మల్ని మనసారా ఆశీర్వదిస్తున్నాను...'' అంటూ ఆనందభాష్పాలు రాల్చారు మాస్టారు.

ఇంతలో ''మాస్టారూ – మీ అమ్మాయికేమ య్యింది? ఎలా వుంది?'' అంటూ వచ్చి ఆదు ర్దాగా అడిగారు కొందరు గ్రామస్తులు.

పాతవిద్యార్థులు తుళ్ళిపడి చూశారాయన వంక.

క్షణాల్లో ఆ వార్త అందరికీ తెలిసిపోయింది.

''చావుబతుకుల్లో వున్న అమెనొదిలి ఈ సమావేశం కోసం వచ్చారా మాస్టారూ?'' అడి గింది దీపిక ఆర్తిగా.

''ఇక్కడ నావూరూ అదే పరిస్థితిలో వుంద




మ్మా" ఆ క్షణంలో విద్యార్థుల దృష్టిలో మాస్టారు త్రివిక్రములా ఎదిగిపోయారు! సజలనేత్రాలతో చేతులు జోడించారు కొందరు.

★ ★ ★

ఉన్నట్టుండి రత్నమాల కెవ్వుమంది. జుట్టు విరబోసుకుని గుడ్లురిమి చూస్తూ పళ్ళు నూర సాగింది.

"ఏమయ్యిందే రత్నా" అంటూ వచ్చినవాళ్ళని తోసిపారేసింది.

సన్నగా బక్కగా వున్న ఆమెకంత బలం అకస్మాత్తుగా ఎక్కణ్ణుంచొచ్చిందో అర్థంగాక విస్తుపోయారు.

మగరాయుడిలా వీరవిహారంచేస్తూ అర్థంకాని భాషలో వడవడవాగేస్తొంటే ఇరుగు పొరుగుచేరి భయంగా చూడసాగారు.



ఆమె వాలకం, చేష్టలూ చూసి దెయ్యం పట్టిందని భావించారు.

కొందరామె రెక్కలు గట్టిగా పట్టుకుని - "నువ్వెవరో చెప్పు నీకేం కావాలో చెప్పు తీరుస్తాం" అనడిగారు.

"కడియబడితం తెరియాద మణక్కం ములంకల్రం..."

"ఏమంటోంది?"

"ఏదో భాషలో మాట్లాడుతోంది!"

"తెలుగే సరిగ్గా రాదే రత్నకి?"

"రత్న మాట్లాడుతోందేంటి. దాన్ని పట్టిన దెయ్యం మాట్లాడుతోంది"

ఇంతలో పదిమందీ గుమికూడారు. రకరకాల మాటలూ, వ్యాఖ్యానాలూ, ఆ వూళ్లో ఎప్పుడెప్పుడు, ఎవరెవరికి దెయ్యం పట్టిందో, అదేం కోరిందో దాన్నెలా వదిలించారో వివరిస్తున్నారొకరు.

ఓసారి తిరుపతి వెళ్ళినప్పుడు పన్లోపనిగా మద్రాసు చూసొచ్చిన ఒకతను "అది అరవం... నాకు బాగా తెలుసు" అని చెప్పేడు.

దాంతో ఆమెకి అరవదెయ్యం పట్టిందని తీర్మానించారంతా.

దెయ్యాల వీరయ్యని పిలవమన్నారు కొందరు.

రత్న మొగుడొచ్చాడు పొలాన్నుంచి. సంగతివిని - "దెయ్యమూకాదు గియ్యమూకాదు" అంటూ రెండు చెంపదెబ్బలేసి లోపలికి లాక్కెళ్ళబోయాడు. ఆమె ఎదురుతిరిగింది. రాక్షసబలంతో అతడిని పట్టుకుని వంచి వీపుమీద బాదుతోంటే నలుగురూ వచ్చి పట్టుకున్నారు. తర్వాత తీసుకెళ్ళి గదిలో బంధించారు.

దారేపోతున్న మాస్టారు జనంగుంపుని చూసి ఏం జరిగిందంటూ వచ్చారు.

"రత్నమాలని అరవదెయ్యం పట్టింది మాస్టారూ"

"దెయ్యాలే లేవంటున్నారు శాస్త్రవేత్తలు. మళ్ళీ అందులో అరవదెయ్యాలూ, తెలుగు దెయ్యాలూనా!" నవ్వేరాయన.

"నిజం మాస్టారూ... గడగడా అరవం మాట్లాడేస్తోంది. తలుపు దగ్గరికెళ్లి వినండి మీకే తెలుస్తుంది"

విన్నారు.

"అరవం నేనెప్పుడూ విన్లేదు మరి. చూస్తోంటే నోటికొచ్చిన అర్థం పర్థంలేని పదాలని వుచ్చరిస్తున్నట్టుంది. ఏదైనా మానసికవైకల్యంవల్ల సంభవించిన స్థితి ఇది. ఆమె మనస్సుకేదో బలమైన దెబ్బ తగిలి వుంటుంది"

"ఏంపన్లేకపోతే సరి... తిండి కరువా బట్ట కరువా. తిని తీరిగ్గా వుండలేక ఎగిరిపడ్తోంది" వుక్రోషంగా అన్నాడామె భర్త.

"మనకి తెలీని కారణాలుండొచ్చు. అవి మెల్లగా తెలుసుకోవచ్చు. ముందు పట్నం తీసుకెళ్లి డాక్టరుకి చూపిస్తే మంచిది"

"ఒంట్లో బాగోకపోతే డాక్టర్లు బాగుచెయ్యగలరుగాని దెయ్యంపడితే వాళ్ళేం చెయ్యగలరండీ!"

"డాక్టర్లు మనస్సు బాగోకపోయినా బాగుచెయ్యగలరు. ఇది మానసికజబ్బుతప్ప జనం విశ్వసిస్తున్నట్టు దెయ్యమూకాదు గాలీ కాదు - డాక్టరుకి చూపిద్దాం"

"మీకిలాంటి విషయాలు తెలీవు మాస్టారూ. భూతవైద్యులే వీటిని బాగుజెయ్యగలరు" ఒకాయనన్నాడు.

"అర్థం పర్థంలేని నమ్మకాలతో, పనికిరాని కర్మకాండకి విలువిచ్చి ఆమె ఆరోగ్యాన్ని పాడుజేయొద్దు. నామాట వినండి. డాక్టరుకి చూపిద్దాం. త్వరగా మామూలు మనిషవుతుందామె"

ఆయన్ని కాదన్లేక - "సరే మాస్టారూ... డబ్బు సర్దుకున్నాక రేపో ఎల్లుండో తీసుకెళ్తాం" అన్నారు.

మాస్టారు బయటికి నడిచేక, "ఆయనంతా చాదస్తంగాని దెయ్యాల వీరయ్యని పిలవండ్రా దెయ్యాన్ని వదిలించేస్తాడు" అన్నాడొకాయన.

తలాడించాడు రత్నమాల భర్త.

★ ★ ★

కాస్త కోలుకోగానే సరితని తనింటికి తీసుకొచ్చేశారు మాస్టారు.

ఆమె భర్తమీదా, అత్తగారిమీదా కేసు రిజిస్టర్ చేశారు గనుక ఇక ఆమెకా ఇంట్లో స్థానంలే

దని తెల్లమయింది. తిరిగి ఆమె నా ఇంటికి పంపితే ఈసారి ఆమె శవంకూడా దక్కదనిభావించి ఆ ప్రయత్నం తలపెట్టలేదు మాస్టారు.

మొదట శారద సరిత కాపురం గురించి కొంచెం గొణిగినా తర్వాత సర్దుకుంది. బిడ్డ క్షేమంగా వుంటేచాలు అన్న అభిప్రాయానికొచ్చేసింది.

కాని, సరిత మనస్సు పూర్తిగా విరిగిపోయింది.

భర్తన్నా, అత్తన్నా అత్తగారి ఇల్లన్నా ఏమాత్రం అభిమానం మిగల్లేదు. ఆమె ఆ ఇంట అడుగుపెట్టింది మొదలు నిన్న మొన్నటివరకూ కూడా ఒక్కనాడూ ప్రేమాభిమానాల్నీ మమతానురాగాల్నీ చవిచూడలేదు.

పుట్టిల్లు ఒక ఆదర్శలోకమైతే మెట్టినిల్లు రాక్షసప్రపంచం.

ఇక్కడ మనస్సుని సున్నితంగా తట్టి మైమరపింపజేసే రసభరితరాగాల అపూర్వసమ్మేళనం.

అక్కడ మెదడుని తినేసే వికృతహాసాల, విలయతాండవపు భైరవనాదాల విషఘోష!

వాళ్ళక్కావల్సింది భార్యకాదు, కోడలుకాదు. కేవలం డబ్బు!

తనతో ప్రేమగా మాట్లాడినా, తిట్టినా కొట్టినా, విదిలించినా, దెప్పినా అంతా డబ్బుకోసమే.

దాహాన్ని నీళ్ళు చల్లార్చగలవుగాని నెయ్యికాదు.

నెయ్యి తాగేకొద్దీ దాహం అధికమవుతుంది తప్ప తగ్గదు.

వాళ్ళ విషయంలోనూ అదే జరిగింది. సరితని హింసిస్తోంటే పుట్టింటినుంచి డబ్బు తెస్తోంది. అందుకే మళ్ళీమళ్ళీ అదే ఆయుధాన్ని వుపయోగించసాగారు. కడకామె మొండికెత్తింది. తండ్రి అసహాయపరిస్థితి ఆమెని రాయిగా మార్చింది. వాళ్ళెంత యాతనపెట్టినా పుట్టింటికి వెళ్ళనుగాక వెళ్ళనని మొరాయించింది. వాళ్ళు రెచ్చిపోయారు. ఆమె చనిపోతే పెద్దకట్నంతో పిల్లనివ్వడానికి ఆడపిల్లల తండ్రులు క్యూలో నిలబడతారన్న ఆశతో రాక్షసులైపోయారు.!

నిజానికి రాక్షసులన్నది చాలాచిన్నమాట. ఏ పురాణంలోనూ ఏ రాక్షసుడూ కూడా పెళ్ళి ద్వారా వచ్చే ధనానికాశపడి భార్యని ఘాతుకంగా చంపిన దాఖలాల్లేవు.

మళ్ళీ ఆ ఇంటి గడప తొక్కడానికీ, ఆ మనుషుల మొఖాలు చూట్టానికీ అసహ్యంగా వుందామెకి. తనొక్కసారా ఇంట్లోకి తొంగిచూసినా తనపిల్లలు అనాథలవడం ఖాయమనుకుంది. వాళ్ళకి తండ్రి వున్నా లేనట్టే. తల్లి కూడా లేకుండా పోకూడదని వాళ్ళకి తల్లీతండ్రీ తానే అవ్వాలని నిశ్చయించుకుంది.

అందుకే తల్లిదండ్రులవెంట బిడ్డలతోసహా పుట్టింటికొచ్చేసింది.

ఊళ్ళోవాళ్ళంతా వచ్చి చూశారు. ఓదార్చారు. కన్నీరు కార్చారు. ఆమె అత్తవారిని తలచి మెటికలు విరిచారు. కలికాలమహిమంటూ ఈసడించారు.

గడపదాటాక ఈవిడ లోపం ఏమీలేకుండానే వాళ్ళంత అఘాయిత్యానికి పూనుకుని వుంటారా అని నొసటితో వెక్కిరించారు కొందరు!

ఇలాటివెన్నో ఇంకెన్నో భరించాలని గ్రహించిందామె. బిడ్డలకోసం గుండె దిటవుచేసుకుంది. తండ్రిసాయంతో, చేయూతతో ఆశావహమైన భవిష్యత్తులోకి ఆత్మస్థైర్యంతో అడుగువెయ్యాలని నిశ్చయించుకుంది సరిత.




"చూడు దివ్యా... ఆదర్శం, ఆచరణా సమాంతరరేఖల్లాంటివి. సుదూరంలో అవి కలుస్తున్నట్టు కన్పిస్తాయితప్ప కలవ్వు. ఆ రెండిటినీ కలపాలనుకోవడం కేవలం భ్రమమాత్రమే. పల్లెలకు వెళ్ళి ప్రాక్టీసుపెట్టడం నువ్వ

నుకున్నంత సులభంకాదు. అక్కడి ఆచారాల కీ పద్ధతులకీ పాలిటిక్స్‌కీ తట్టుకోవడం నీత రంకాదు. నేనెందుకు చెబుతున్నానో విను. నీ చిన్నప్పుడు నేను కలకత్తాలో వుద్యోగం చేసేవా ణ్ని గనుక మావయ్యగారింట్లో వదిలాను. అప్పు ట్లో నాలుగైదేళ్ళు అక్కడి బడిలో చదివావు. అంతమాత్రాన అదే నీ వూరైపోయినట్టు ఆ వూరిని ఉద్ధరించాలని బయల్దేరటం అర్థర హితం. ఇక్కడే ప్రాక్టీసు పెడుదువుగాని లేదా వుద్యోగంలో జేరుదువుగాని'' అన్నాడు రామా చారి.

చెల్లెలి మాటలు విన్నప్పట్నుంచీ అతడికి చాలా అసహనంగాను, చిరాగ్గానూ వుంది. సిటీలో పాతుకుపోవాలనీ ఫారెన్ ఎగిరిపోవా లనీ కలలు గనటంపోయి పల్లెటూరి బగ్గిరా యిలా తయారవుతాననెందు కంటుందో, ఎలా అనగలుగుతుందో ఎంతాలోచించినా అర్థంకావటంలేదతడికి.

''మీ అన్నయ్య చెప్పింది నిజమే దీపూ! పట్నంలో పెరిగినదానివి. పల్లెలో నీకు వూపిరా డదు. అందునా పెళ్ళికాని ఆడపిల్లవి. ఏవేళ బడితే ఆవేళ వెళ్ళాల్సిన వృత్తి. నువ్వక్కడికె ళ్లటం ఏమాత్రం మంచిదికాదు. మొండిపట్టు పట్టకుండా మీ అన్నయ్య చెప్పినట్లు విను'' అంది వదిన.

''సారీ అన్నయ్యా... రోగులు డాక్టరు దగ్గరికి రావటంకాదు డాక్టరే రోగుల్ని వెదుక్కుంటూ వెళ్లాల్సిన అవసరం ఈనాడెక్కువగా వుంది. ఇక్కడో చిన్న బోర్డు కట్టి కాలిమీద కాలేసుకు కూర్చుని ఫీజులక్రింద వేలూ లక్షలూ సంపా దించొచ్చు. డిగ్రీ తీసుకున్నప్పుడు చేసినప్రతిజ్ఞ మరిచి కేవలం విజ్ఞానపు పెట్టుబడితో వ్యా పారం చెయ్యడం నాకిష్టంలేదు. నా చదువు నలుగురికి మేలుచెయ్యాలి. నాలుగు గుండె ల్ని తేలికపర్చాలి. నాలుగు కళ్లల్లోని కన్నీళ్ళు తుడవాలి. అప్పుడే నా చదువుకి సార్థకతా, నాకు తృప్తినూ. అంచేతే సీతారామపురంలో ప్రాక్టీసు పెట్టాలని నిర్ణయించుకున్నాను. దయచేసి నన్నర్థం చేసుకో అన్నయ్యా''

దీపిక మాటలకి రామాచారి ముఖం ఎర్రబ డింది.

''ఆల్‌రైట్... నీ ఇష్టప్రకారమే కానియ్! వినేవాళ్లకి చెప్పొచ్చుగాని వినకూడదనుకున్న వాళ్లకి చెప్పడం బ్రహ్మతరం కూడా కాదు. నాన్న ఏన్ను నాకప్పజెప్పిపోయారు. నీకేలోటూ రాకుండా పెంచి పెద్దచేశాను. బరువనుకో కుండ ఎంతో ఖర్చుపెట్టి డాక్టర్ని చేశాను. నువ్వు వుద్యోగమో సద్యోగమో చేసి నాలుగు రాళ్ళు సంపాదిస్తే నీపెళ్ళికుపయోగిస్తుందను కున్నాను. నా బరువు బాధ్యతలు నాకూ వున్నాయి గనుక ఆ విషయంలో నీఏర్పాట్లు నువ్వు చేసుకుంటే సంతోషం. రేపు నన్ను ఆడిపోసుకోవద్దు. చెల్లిపెళ్ళి చెయ్యలేదన్న అపప్రథా నాకు రానివ్వొద్దు''

''అలాగే అన్నయ్యా... కట్నంపోసి వరుణ్ని కొనుక్కోవడం నాకసహ్యం, పెళ్ళికాకపోయినా ఫర్లేదుగాని అలాటి హేయమైన పనిచేయను''

''ఓకే... విష్యూ గుడ్‌లక్. మరొక్కమాట- నిప్పుల్నికూడా కడిగే మన వంశ సాంప్రదా యాల సంగతి కలలో కూడా మర్చిపోకు''

రామాచారి అక్కణ్నుంచి లేచి వెళ్ళిపోయా డు.

''నీ పద్ధతేం బాగోలేదు దీపూ... మంచి సరుకు కావాలనుకున్నప్పుడు డబ్బు పోసి కొనుక్కోవాల్సి ఉంటుంది. మేమంతా అలా చెయ్యలేదూ? మేం సుఖంగా లేమూ? అదేదో కాని పనైనట్టు ముఖం చిట్లిస్తే నష్టపోయేది నువ్వే'' అంది వదిన మందలింపుగా.

''సరుకైతే కొనుక్కోవచ్చు... కాని మనుమ ల్ని?''

''మనుమలూ సరుకులైపోయారీ కా లంలో!''

''ఆ సరుకులు నాకక్కర్లేదు''

''ఓహో-వూరికే వచ్చే సరుకులే కావాలన్న మాట. అవి ఉచిత వస్తువుల్లానే వుంటాయి. వాళ్ళైనా నీ సంపాదన చూసి చేసుకుంటారుత ప్ప నిన్ను చూసికాదు. లేనిపోని గొప్పలకి పోకుండా మేం చెప్పినట్టు విను- సుఖపడ తావు''

''ప్లీజ్... వదినా నామానాన నన్ను వది లేయ్! నేను చిన్నపిల్లనికాదు కదా''

''అవున్లే... ఇవాళ పెద్దదానివయ్యావు మరి.




e town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా....Talk of the town

# విపుల

ఈరోజు కాలేజి
డిబేట్ లో
ఇతర ప్రాంతాల్లోని
జీవన విధానంగురించి
అంత బాగా ఎలా
మాట్లాడగలిగావ్?

నేను 'విపుల'
పాఠకురాలిని:
ప్రతినెలా దాదాపు
పదిహేను భాషల కథల్నీ,
ఆయా జీవన విధానాల్నీ
తేటతెలుగులో చదివే
అవకాశాన్నిస్తుంది 'విపుల'



మేమూ, మామాటా నీకో లెక్కా పత్రమా? నీ ఇష్టమొచ్చినట్టే వూరేగమ్మా. ఎవరి కర్మకెవరు బాధ్యులు?''

ఇంట్లో వాళ్ళేకాదు దీపిక ఫ్రెండ్స్ కూడా ఆమెని నిరుత్సాహపరిచారు.

''ఎంతో తెలివైన దానివి. తిన్నగా వెళ్ళి పల్లెటూరి మట్టిలో కూరుకుపోతానంటావే మిటి? ఏ యమ్డీనో, యమ్మెస్‌నో కట్టుకుని అమెరికా ఎగిరిపోతావనుకున్నాం మేమంతా'' అన్నారు.

''నాకంత అత్యాశలేదోయ్''

''పల్లెటూరి వాళ్ళ దృష్టిలో దేవుడైపోవాలనుకుంటోందోయ్ మన దీపూ'' అని ఒకరంటే, ''దేవుడైతే ఫర్లేదు దేవతైతేనే పోటీలూ చిక్కులూనూ'' అని నవ్వేరింకొకరు.

తన ఆశయాన్ని ఒక్కరూ సవ్యంగా అర్థంచేసుకోనందుకూ, ప్రోత్సహించనందుకూ ఎంతో నొచ్చుకుంది దీపిక. ఎన్ని ఇబ్బందులెదురైనా సరే లక్ష్యాన్ని సాధించాలన్న పట్టుదల రెట్టింపయింది.

తన సామాన్లు తీసుకుని అవసరమైన పరికరాలూ ముఖ్యమైన మెడిసిన్లూ కొనుక్కుని సీతారామపురం వచ్చేసింది దీపిక.

''అవాళేదో ఆవేశంలో అన్నావుగానీ మళ్ళీ ఇలా వస్తావనుకోలేదమ్మా'' అన్నారు గోపాలరావుగారు.

''మనవాళ్లమ్మాయి ఇక్కడెందరికో ఆరోగ్య దానం, ప్రాణదానం చెయ్యబోతున్నందుకెంతో ఆనందంగా వుందమ్మా'' అందాయన భార్య అలివేలు.

''హాస్పిటల్ పెట్టడానికి సెంటర్లో మంచి ఇల్లు చూడాలి మావయ్యా''

''అలాగేనమ్మా... రేపట్లోగా కుదిర్చేస్తాను గానీ మరి ప్రారంభోత్సవం ఎవరిచేత చేయిద్దామని? ఊరిపెద్ద, మనకి అన్నదాత అయిన రాయుడిగార్ని పిలుద్దామా?'' ఉత్సాహంగా అడిగారు.

ఈ మధ్య సీతారాముల కోవెలకి వచ్చిపోయే భక్తులసంఖ్య అధికంగా వుండటంతో చాలా హుషారుగా వుంటున్నారాయన.

''ఆయనెందుకులే మామయ్యా- మాస్టారి చేత చేయిద్దామనుకుంటున్నాను''

''బాగానే వుంటుందనుకో. నీచేత అక్షరాభ్యాసం చేయించింది కూడా ఆయనే అనుకో. కాని రాయుడుగారేమైనా అనుకుంటారేమో? అసలే ఆయన అదో రకం మనిషి. అలాటి వారి అండదండలు మనబోటివారికి అవసరం కూడానూ.''

''అందరితోబాటు ఆయన్నీ పిలుద్దాంలే మావయ్యా! ఆయనకెక్కువగా విలువివ్వడం నాకిష్టంలేదు''

''పెద్దవారితో తలపడటం, తగవుపెట్టుకోవడం శ్రేయస్కరం కాదు దీపూ'' అలివేలు సలహా ఇచ్చింది.

''ఇందులో తగవేముందత్తా... మనింట్లోని పనిక్కూడా ఒకరి పర్మిషన్ కావాలా?''

''ఆహ... అలా అనికాదు- ప్రారంభోత్సవమంటూ హడావిడి చేస్తున్నావు కదాని...''

''హడావిడేం వుండదు. సింపుల్‌గా రిబ్బన్ కత్తిరిస్తారంతే''

''అలాగే దీపూ... నువ్వు మనూళ్ళో ప్రాక్టీసు పెట్టడమే ఓ వరం. అంతకంటే ఏంకావాలి చెప్పు?''

''ఇది వరం కాదు మావయ్యా- నా ధర్మం'' వాళ్ల దగ్గర్నుంచి లభించిన ప్రోత్సాహానికి మురిసిపోతూ అంది.

ఈవార్త రాయుడి చెవినపడగానే ఆయన కనుబొమలు పైకిలేచాయి. ఉత్తరక్షణాన గోపాలాచార్యులు పిలవబడ్డారు.

''ఆచార్యులుగారూ- రండి రండి... చాలా గొప్పవారైపోయినట్టున్నారు''

''ఎంతమాట... తమరి చల్లని చూపువల్ల బతుకుతున్నవాళ్ళం''

''హ్హాహ్హా... చిలకపలుకులు! ఎంతైనా బతకనేర్చినవాళ్ళు!''

''తమరేమంటున్నారో...''

''అర్థం కావట్లేదంటారు. అన్నంపెట్టిన చెయ్యికన్నా అక్షరం ముక్కలు దిద్దించిన చెయ్యి ఎక్కువంటారు''

ఆయన అనువర్తి ప్రారంభోత్సవాన్ని దృ

ష్టిలో వుంచుకుని మాట్లాడుతున్నారని గ్రహించారు. నన్నుగా కంపిస్తూ అన్నారు- ''అయ్యా ఈ కాలం పిల్లల సంగతి తమకి తెలియందేం వుంది. తాము పట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదిస్తారు. అక్కడికీ చెప్పి చూశానండి... తమర్ని సభాధ్యక్షులుగా పిలుస్తానని...''

రాయుడి నుదురు ముడిపడటంతో ఆపై మాటలు మింగేశారు.

''మధ్యలో నేనెందుకు దిష్టిపిడతలా? మాస్టారి పిలుపునందుకుని ముందుకొచ్చిన వీరవనిత. ఆవిడిష్టప్రకారమే కానివ్వండి. ముందున్న మునళ్ల పండగ గురించి ముందు ముందు తెలుసుకుంటుందిలే- ఇప్పుడేం తొందర్లేదు''

ఏమనాలో తెలీక అవాక్కై ప్రాధేయపడ్తూ చూస్తూండిపోయారు.

విసురుగా లోపలికెళ్ళిపోయారు రాయుడు.

ఆయన గుండెలు రైలింజన్లోని రాక్షసబొగ్గులా మండుతున్నాయి.

రిపబ్లిక్‌డేనాటి సమావేశం గురించి ప్రభాకర్ చెప్పేడు. అంతా విని అలవాటుగా నవ్వేసి- ''ఎరవెయ్యకుండా చేపలెక్కవు'' అన్నారు.

కానిలా ఇంత త్వరగా ఎదురుదెబ్బ తగుల్తుందనుకోలేదు.

తనది యాదవ కులంలాంటిదికాకపోయినా యాదవకులంలో ముసలం పుడుతున్నట్టుగా అన్పించసాగింది.

అప్పుడెప్పుడో దారేపోయే కుర్రాళ్ళో అరడజనుమంది వస్తేనే వూళ్ళో చిరుకెరటాలు లేచాయి. ఇక నిజంగా నలుగురు యువకులొచ్చి తిష్టవేస్తే తన రాజ్యం- ప్రభాకర్‌కి పట్టాభిషేకం చెయ్య కుండానే పేకమేడలా కూలిపోదూ?

పిచ్చిపంతులనుకున్న మాస్టారి ప్రభావమే ఎంతో ఎక్కువగా వుందంటే ఇక పల్లెనుద్ధరించడానికి నడుంకట్టి వచ్చే యువకుల గురించి చెప్పాలా?

లాభంలేదు. ఇన్నాళ్లూ దేన్నయినా ముఖాముఖీ ఎదుర్కొన్నాడు.

ఇకనుంచి ఎత్తులువేసి ఎదుటివార్ని చిత్తుచెయ్యాలి.

అందుకో చక్కని పావు కావాలి,

పానకాలు గుర్తొచ్చాడు.

చిర్నవ్వు అలవోకగా కదిలిందాయన పెదాలమీద!

★ ★ ★

రాజమోహన్‌రావుగారు సోఫాలో కూర్చుని పైపుకాలుస్తూ చిన్నల్లుడు గిరిధర్ చెబుతున్నది శ్రద్ధగా వింటున్నారు.

ఆయన ప్రముఖ వ్యాపారవేత్త. పారిశ్రామికవేత్త. ఒక కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్. మూడు కంపెనీల్లో డైరెక్టరు.

ఆయనకి ముగ్గురాడపిల్లలు. మెరికల్లాంటి కుర్రాళ్లని అల్లుళ్లుగా చేసుకుని వ్యాపార బాధ్యతల్ని మెల్లమెల్లగా అప్పచెబుతున్నారు. తమ సంపదని అల్లుళ్లు మరిన్ని రెట్లు పెంచగలరన్న నమ్మకం వుందాయనకి.

''మన ఎరువుల ఫ్యాక్టరీని సీతారామపురంలో పెడితే బావుంటుంది అంకుల్. అది మా వూరన్న అభిమానంతోనే కాదు వ్యాపారరీత్యా అన్నివిధాలా అనుకూలంగా వుంటుంది''

''అంటే ఏమేం ఫెసిలిటీస్ వున్నాయంటావు?''

''బీడూభూమి ఎక్కువగానే వుంది. అంటే నీరెక్కని మెరక భూమి. ఫ్యాక్టరీ కట్టడానికి స్థలం చౌకగా లభిస్తుంది. కొంత ప్రభుత్వ బంజరుభూమి కూడా వుంది. అయిదారు కిలోమీటర్లవరకూ రోడ్డు సౌకర్యంలేని మాట నిజమే కాని మనం ఫ్యాక్టరీ కట్టాలని నిర్ణయించుకుంటే అవన్నీ తేల్గ్గా వచ్చేస్తాయి. లేబర్ చౌకగా దొరుకుతుంది. గోదావరి నీరు వుండనే వుంది. ఇకపోతే గోదావరి బేసిన్లో అంటే నర్సాపురం ప్రాంతంలోని నేచురల్ గాస్‌ని ఎరువుల ఫ్యాక్టరీకుపయోగించుకోవచ్చని ఒ.ఎన్.జి.సి. వారంటున్నారు. అతిసమీపంలో గాస్ లభిస్తుంది గనుక ఫ్యాక్టరీకదో ఎస్సెట్ అవుతుంది. మన సరుక్కి గోదావరి, కృష్ణ ప్రాంతంలో మంచి మార్కెట్ వుంటుంది.''

అభినందిస్తూ చూశారాయన.

"గుడ్... మన ప్లాంట్ మేనేజర్నీ ఇంజినీర్స్‌ని తీసుకెళ్లి సర్వే చేసిరండి. ముఖ్యంగా ఒ.ఎన్.జి.సి వారితో గాస్ సప్లై గురించి మాట్లాడిరండి. అది న్యూటెక్నిక్ అవుతుంది గనుక మన ప్రతిపాదనకి మిగతా డైరెక్టర్లు తేలిగ్గా ఒప్పుకుంటారు. పబ్లిక్ ఇష్యూ ప్రకటించినప్పుడు రెస్పాన్స్ కూడా బావుంటుంది. ఈ ఎరువుల ఫ్యాక్టరీకి నా బదులు నిన్నే డైరెక్టర్ని చేస్తాను. ఎలా చేస్తావో చూస్తాను"

"థాంక్యూ అంకుల్" పొంగిపోయాడు గిరిధర్.

నరానరి లోపలికెళ్లాడు మహోత్సాహంతో.

"అబ్బాయిగారివాళ ఏనుగెక్కినట్టున్నారే ఏటి కథ?" అనడిగింది భార్య ప్రియంవద.

"అవున్నిజంగా గజారోహణ చేశాను. ఇక చూసుకో చూపిస్తా నా తడాకా"

"డాడీ ఏదో బాధ్యత అప్పగించి వుంటారు... అవునా?"

"అరె- ఎంత తేలిగ్గా వూహించేశావూ!"

"తీరిగ్గా పొగుడుదురుగాని ముందు వివరాలేమిటో చెప్పండి"

"అంకుల్ ఆధ్వర్యంలో ఇటీవల ఏర్పడిన రాజా ఫెర్టిలైజర్స్ కంపెనీకి నన్ను డైరెక్టర్ని చేస్తానన్నారు"

"నిజంగా? మీ యంబీఏనిప్పుడు గుర్తించారన్నమాట. అవకాశాన్ని బాగా వినియోగించుకోవాలి"

"తప్పకుండా డియర్! ఫెర్టిలైజర్ ఫ్యాక్టరీని మా వూళ్లో పెట్టించాలని నా ప్రయత్నం"

"మీ వూరేగాని నా వూరుకాదా?" నవ్విందామె.

"అహ అలా అని కాదు ప్రియా..." తడబడ్డాడు.

"మీభావం నాకు తెలుసులెండి. ముందు మీవూరు. తర్వాతే నావూరుకదా. ఇకపోతే మీ వూరూ మావూరూఅనిగాక ఫ్యాక్టరీకి అనుకూలమైన వూరుని సెలక్ట్ చేసుకుంటే సగం సక్సెస్ అయినట్టే"

"అంకుల్దేకాదు మీ ఇంట్లోని ప్రతివారిదీ బిజినెస్ బుర్రేనోయ్"

"కాని మాకు మీలా యంబీఏలు లేవుగా"

"అవి లేకుండానే కేవలం పరిశీలనతోనే ఇంతిలా మాట్లాడుతున్నారు. ఇక అవికూడా తోడైతే మా పని శ్రీమతే రామానుజాయన్న మహా!"

"మీకు పోటీరాముగాని భయపడకండి"

"నువ్వు నా వెంట వున్నప్పుడు భయమెందుకోయ్. ప్రతి మగాడి విజయం వెనుకా ఓ స్త్రీమూర్తి వుండివుంటుందన్నది అక్షర సత్యం"

"ఒకర్నొకరు పొగుడుకోవడం మానేసి పాయింటుకొచ్చేద్దాం. మీకు సీతారామపురంలో ఫ్యాక్టరీ కడితే బాగుంటుందనెందుకనిపించింది?"

"మాస్టారి ఉత్తరం గురించి నీకు తెలుసు కదా. సరదాగా అందర్నీ కలుద్దామనెళ్లాను. ఊరి గురించీ, గోదావరి బేసిన్లో గ్యాస్ గురించీ విన్నాక ఆలోచనలో పడ్డాను. మాస్టారి మాటలు విన్నాక ఉభయత్రా బాగుండే ఈ ప్రయత్నం ఎందుకు చేపట్టగూడదన్పించింది. ఈ ప్రాజెక్టుకి అంకులూ, ఆయన మిత్రులూ ఏమంటారోనన్న భయం పీకుతున్నా ఆ ప్రాంతాన్ని మనకోణంనుంచి సర్వేచేసి మరీ వచ్చాను. అన్నివిధాలా అనుకూలంగా వుంటుందన్న నమ్మకం కలిగింది. అంకుల్తో చెప్పాను. న్యూటెక్నాలజీ ఐడియా అంకుల్‌కి నచ్చింది. గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు"

"అందుకే డాడీ మిమ్మల్ని డైరెక్టర్ని చేస్తానన్నారు. చెప్పింది చెయ్యటం సబార్డినేట్ లక్షణం. కొత్త టెక్నిక్స్‌ని కనుక్కుని, అర్థంచేసుకుని అందరినీ తన దారికి రప్పించి ఒప్పించడం ఎగ్జిక్యూటివ్ లక్షణం. ఆ లక్షణం ఇప్పటికి మీనుంచి బయటపడింది- ఇక మీకు తిరుగుండదు"

"దీనికి ప్రేరణ మాస్టారనే చెప్పాలి ప్రియా. ఆయనేదో అ ఆ లూ, గుణింతాలూ చెప్పిన మాస్టారిగా మేమెప్పుడు పరిగణించలేదు. నీతికథలతో, సత్యజీవనంతో చక్కని మార్గం చూపే మార్గదర్శి- గురుమూర్తి. ఆయన్నీ ఆయన బోధననీ మేమెన్నడూ మర్చిపోలేం"

"అలాంటి గురువు లభించడం మీ అదృ




ష్టం. నేనూ నావాళ్లూ అని ప్రతివాళ్లూ కుంచించుకుపోతున్న ఈరోజుల్లో వూరివాళ్ల కోసం నిస్వార్థంగా కృషిచేయబూనిన ఆయన నిజంగా గొప్పవాడే. నాకూ మా మీస్టార్ని చూడాలనుంది. ఆయన మాటలు వినాలనుంది"

"ఈసారి తప్పక వద్దువుగాని"

"మరి నా ప్రెజంటేషన్ ఏది?"

"దేనికోయ్"

"మీరు డైరెక్టర్ కాబోతున్నారుగా"

ఆమెని కౌగిల్లోకి తీసుకుని గాఢంగా చుంబించాడు.

★ ★ ★

డాక్టర్ దీపిక ఆనువత్రికి మాస్టారు ప్రారంభోత్సవం చేశారు.



హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

ఆమె ఇంటింటికీ వెళ్లి అందర్నీ ఆహ్వానించింది. మాస్టారు కూడా ఆమె సేవాధృక్పథం గురించందరికీ చెప్పారు. ఆడామగా, పిల్లాపాపా చాలామంది వచ్చారుగాని రాయుడు రాలేదు. వస్తారని అనిపించనందున దీపిక ఏమీ అనుకోలేదుగాని వూళ్లోవాళ్లు గుసగుసలు పోయారు.

"ఇవాళ సుదినం. మన గ్రామచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన ఘట్టం. నేనే క్షణం కోసం ఇన్నేళ్లూ తపిస్తూ వచ్చానో అదీరోజున మనమ్మాయి ద్వారా నెరవేరినందుకు నాకెంతో ఆనందంగా వుంది. మహదానందంగా వుంది. మా అబ్బాయి కూడా డాక్టరే. ఆ సంగతి మీకూ తెలుసు. మనవూరివాళ్లు వైద్యంకోసం పడుతున్న పాట్లు చూసి మా వాణ్ని నా శక్తినిమించి చదివించాను. డాక్టర్ని చేశాను. ఇక్కడ ప్రాక్టీసు పెడతాడని పొంగిపోయాను. కాని వాడి కళ్లు కలల్లో విహరిస్తున్నాయి. ఇక్కడి జనం చీమల్లా దోమల్లా కూడా కన్పించడం మానేశారు. అందుకే రెక్కలు కట్టుకుని ఎగిరిపోయాడు. అందుకు నేను బాధపడటంలేదు. అలాటివాళ్లిక్కడ ప్రాక్టీసు పెట్టడంకన్నా పెట్టకపోవడమే మంచిది. మనక్కావాల్సింది డబ్బు డాక్టర్లు కాదు. సేవాభిలాషిగల డాక్టర్లు. రోగాల్ని ఫీజుతో అంచనా వేసేవాళ్లు కాదు. సానుభూతితో అర్థంచేసుకునే డాక్టర్లు కావాలి. అలాంటి దేవత ఇవాళ మనూరొచ్చింది. ఏమాత్రం సౌకర్యాలు లేని మనూరికి కేవలం సేవాధృక్పథంతో, ఈ గడ్డమీది అభిమానంతో వచ్చింది. మనమింక పట్నపు ఆసుపత్రికి పరుగు పెట్టాల్సిన అవసరం లేకుండా దేవుడిచ్చిన వరంలా వచ్చింది. ఆమె సేవల్ని వినియోగించుకుని ఆమెకేలోటూ రానివ్వకుండా చూడటం మనందరి కర్తవ్యం... బాధ్యత" అని దీపికని ఆశీర్వదించారు మాస్టారు.

అంతా అల్పాహారం తీసుకొంటోంటే ఒక కుర్రాడు పరుగునొచ్చాడు, "మాస్టారూ మాస్టారూ - రత్నక్క కళ్ళు తిరిగి పడిపోయిందండి. ఎంత పిలిచినా పలకటంలేదు"

మాస్టారు మెడికల్‌కిట్ అందుకున్నారు. దీపిక ముందు నడిచింది.

రెండు నిమిషాల్లో రత్నమాల ఇంటికెళ్ళారు.

ఇంట్లో అడుగుపెడుతూనే మంచువాలోని పసుపుకుంకుమల ముగ్గుల్నీ వేపరెబ్బల్నీ ధూపపు సామాగ్రినీ చూసి మొఖామొఖాలు చూసుకున్నారు.

"అరె– దెయ్యాల వీరయ్యని పిలిచినట్టున్నారే!" ఆదుర్దాగా అన్నారు మాస్టారు.

రెండ్రోజులక్రితం రత్నమాలని ఆసుపత్రికి తీసుకెళ్దామన్నారాయన. ఆమె మామూలు మనిషయిందని నమ్మబలికారంతా. ఇవాళ మళ్ళీ దెయ్యాలవీరయ్యని పిలిచారంటే జనం క్షుద్రశక్తుల్ని ఎంత మూఢంగా విశ్వసిస్తున్నారో అని ఇదయ్యేరు.

రత్నమాలకి అరవదెయ్యం పట్టిందని నమ్మి దెయ్యాల వీరయ్యకి చూపించారు.

అతడేదో మంత్రించిన తాయెత్తుకట్టాడు. వీభూది జిమ్మాడు. బొట్టుపెట్టాడు. దెయ్యం వదిలేస్తుందన్నాడు. ఆ తంతు అయ్యాక ఆమె బాగానేవుంది. దారిలో పడిందనే అనుకున్నారంతా. కాని మర్నాటి సాయంకాలం మళ్ళీ చిత్రంగానే ప్రవర్తించసాగింది.

మళ్ళీ వచ్చాడు వీరయ్య. మళ్ళీ చిన్నతతంగం చేసి దెయ్యాన్ని పొమ్మని హెచ్చరించి బహుమానం తీసుకువెళ్ళిపోయాడు.

అప్పటికి మామూలు మనిషిఅయిందామె.

కాని మళ్ళీ మూడోనాటి సాయంకాలం మళ్ళీ అలాగే ప్రవర్తించసాగింది. దెయ్యాల వీరయ్య తన శక్తికే సవాలు ఎదురైనట్టు ఫీలయ్యాడు.

దెయ్యాన్ని బలవంతాన సీసాలో బంధించక తప్పదన్నాడు.

అదేదో త్వరగా చెయ్యమన్నారు.

ముగ్గుల మధ్య ఆమెని కూర్చోబెట్టాడు. ధూపం వేశాడు. వేపరొట్టతో బాదేడు. దెయ్యాన్ని పొమ్మంటూ అరిచాడు. బూతులు తిట్టాడు. ఆమె జుట్టు బెత్తానికి చుట్టి మెలితిప్పాడు. బాధతో అరిచింది. కేకలుపెట్టింది. అయినా వదల్లేదు. పోతాను బాబోయ్ అని అరిచేవరకూ వదల్లేదు!




''దెబ్బకి దెయ్యం వదిలింది'' అన్నాడు గొప్పగా.

ఆమె తలవెంట్రుకలు కొన్ని కత్తిరించి సీసాలో బంధించి ''మీకింకేం ఫర్లేదు... దెయ్యాన్ని సీసాలో బంధించేశాను. భూస్థాపితం చేసేస్తాను'' అన్నాడు.

'అహో... ఎంత శక్తిమంతుడూ' – అనుకున్నారంతా.

ఘనంగా బహుమానమిచ్చి పంపించారు.

అతడలా గుమ్మం దాటాడో లేదో కెవ్వుమని అరిచి స్పృహతప్పి పడిపోయింది రత్నమాల.

భయపడిపోయి డాక్టరు కోసం తరిమారో కుర్రాణ్ని.

రత్నని చూస్తూనే పరిస్థితి గ్రహించేసింది దీపిక. స్పృహరావడానికి ఇంజెక్షన్ చేసి గ్లూకోజ్ ఎక్కించడానికి ఏర్పాటుచెయ్యసాగింది.

ఒంట్లో ఏ మాత్రం వూపిరిలేనట్టు నీరసంగా, దైన్యంగా వున్న రత్నని కళ్ళనీళ్ళు పెట్టుకుని గుడ్లప్పగించి చూడసాగారంతా.

ఆమెని రక్షించమని దేవుళ్ళకి మొక్కుకోసాగాడామె భర్త!




''వచ్చేశాను మాస్టారూ''

ఏదో రాసుకుంటున్నవారల్లా తలెత్తిచూశారు.

శివం!

ఉప్పెనగా సంతోషం పొంగి వచ్చిందాయన ముఖంలోకి. ''రావోయ్ - రా... నువ్వంటే నాకెంతో నిశ్చింత - పరీక్షలైపోయాయా?''

''అయిపోయాయి మాస్టారూ - డిగ్రీ చేతికొచ్చేసినట్టే! అంతా మీ దయ మాస్టారూ! మీరు నాటిన విజ్ఞానపు మొక్కని నేను. నావల్ల ఏ మాత్రం ఫలంవున్నా ఆ క్రెడిట్ మీకే దక్కుతుంది''

''నువ్వో కబుర్లు నేర్చావుగానీ ఇప్పుడేంచేద్దామనీ?''

''ఎవరిదైనా పొలంగానీ, తోటగాని కౌలుకి తీసుకుని కాయగూరలు పండిద్దామని వుంది. బ్యాంకు లోన్ లభిస్తే నాలుగైదు పాడిగేదెల్ని కొని పాలవ్యాపారం కూడా పెట్టబడదామని వుంది. ఓప్రక్కనిది చేస్తూనే రైతులకి విత్తనాలు, ఎరువులు, క్రిమినంహారాల గురించి సలహాలిస్తూ పొలాల్లోని మట్టిని పరీక్షజేయించి ఏరకం విత్తనాలూ ఎరువులూ సరిపోతాయో శాస్త్రీయంగా వివరిద్దామని వుంది. రైతుకూలీల్ని సంఘటితపర్చాలన్న ఆలోచన కూడా వుంది. అంతా కలిసివుంటే ఏమైనా చెయ్యొచ్చు; ఎంతైనా సాధించొచ్చు''

''బాగానే వుంది శివం! ముఖ్యంగా కాయగూర్లను పండించడమూ, పాలవ్యాపారం చెయ్యడమూ చాలా బాగుంది. అది నీకు చక్కని ఆదాయాన్నివ్వడమేగాక ఊరివాళ్ళకి తమ ఆదాయాన్ని పెంచుకునే మార్గం దానంతటదే చెబుతుంది. భూమి, పెట్టుబడి సమయమూ వున్నా రైతులు ఉపవృత్తుల్ని అబాయమార్గాలుగా చేపట్టడంలేదు - కేవలం పంటల మీదే ఆధారపడటంతో. అయితే అతివృష్టి లేకపోతే అనావృష్టిగా వుంటోంది వాళ్ళ పని. తీరిక ఎక్కువై దుర్వ్యసనాలవైపు ఆకర్షింపబడుతున్నారు''

''బాగా చెప్పారు. తమ ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చుకునే అవకాశమూ వనరులూ వుండీ కూడా ఉపయోగించుకోపడంలేదని జనం గ్రహించేట్టు చెయ్యటం ముఖ్యం మాస్టారూ''

''నువ్వు దారి తీయి. అంతా అనుసరించి తీరతారు''

''మంచిది మాస్టారు... మరి సరిత...''

''ఇక్కడే వుందయ్యా''

''తీసుకొచ్చేశారా? మంచి పనిచేశారు మాస్టారూ'' అంటూలేచి ''సరితా'' అని పిలుస్తూ లోపలికెళ్లాడు.

ఆమె ఇంకా వీధిలోకి రావట్లేదు. కాలిన పుండ్లు తగ్గాయిగాని మచ్చలింకా అలాగే రాక్షసత్వానికి సాక్షుల్లా అసహ్యంగా నిలిచివున్నాయి.

"ఏమమ్మా లోపలే వుండిపోయావూ..."

నన్నాగా ఏడ్చేసిందామె.

"ఊరుకో సరితా... జరిగిందంతా పీడకలని మర్చిపో. లోపల ఒంటరిగా కూర్చునుంటే దుఃఖం పెరుగుతుంది తప్ప తరగదు. బయటికిరా.. అందర్లోనూ కలవటానికి ప్రయత్నించు"

"నీకుతెలీదు శివం! ఈ వికృతరూపంతో...!" ఆపైన కన్నీళ్ళు అడ్డొచ్చాయ్.

"అందుకు సిగ్గుతో చావాల్సింది ఆ వికృత మనస్కులు తప్ప నువ్వు కాదమ్మా! నువ్వు ఇదివరకట్లా నవ్వుతూ తిరుగుతూండాలి. అప్పుడే అమ్మగారికీ, 'మాస్టారుకీ, ఓదార్పుగా వుంటుంది"

"నన్ను తలచి వాళ్ళు బాధపడకూడదనే నా తాపత్రయమూనూ- కానేం చెయ్యను చెప్పు... ఏం చేయటానికీ తోచటంలేదు"

"త్వరలోనే నీకేదో బాధ్యత అప్పగిస్తాంలే. అంతవరకూ ఆసుపత్రిలో దీపికగారికి హెల్ప్ చెయ్యకూడదూ?"

"చెయ్యొచ్చు... కాని వచ్చినవాళ్ళంతా నామీద సానుభూతి కురిపిస్తే నేను భరించలేను!"

"ఆల్‌రైట్... ఏదో మార్గం చూద్దాంలే. పిల్లలేరి సరితా?"

బిక్కుబిక్కుమంటూ ఓ మూలన కూర్చున్న పిల్లల్ని చూపించింది.

ఒకరికి మూడూ, ఒకరికి అయిదూ ఏళ్ళుంటాయి. మరీ చిన్నవయస్సులోనే తల్లి కన్నీరు గురించీ, తమ దురదృష్టం గురించీ ఏమర్థంచేసుకున్నారో ఏమో నిశ్శబ్దంగా వున్నారు. విషాదంగా చూస్తున్నారు.

వారి దీనమైన చూపులకతడి గుండెలు తరుక్కుపోయాయి.

"ఇలా రండి బాబూ"





అపనమ్మకంగా చూశారు.

మళ్ళీ పిలిచాడు.

మెల్లగా వచ్చారు. సరిత గొడవలోపడి ఎవరూ పిల్లల్నంతగా పట్టించుకోవడంలేదని వాళ్ళ ముఖాలు చూడగానే తెలిసిపోయింది. చేతులు చాపి దగ్గరకి తీసుకున్నాడు.

"మీ పేర్లేమిటి బాబూ?"

"నా పేరేమో సూర్య, తమ్ముడి పేరేమో చంద్ర"

"ఆహా- బావుంది. ప్రపంచానికి పగలు సూర్యుడు కాపలాకాస్తాడు! రాత్రి చంద్రుడు కాపలా కాస్తాడు. సూర్యచంద్రుల్లేకపోతే ప్రపంచం వుండదన్నమాట. అంటే మీ ఇద్దరివల్లే లోకం ఇలా వుందన్నమాట. మీరెంత గొప్పోళ్ళో తెలిసిందా?"

ఆశ్చర్యంతో వాళ్ళ కళ్ళు పెద్దవయ్యాయి.

"అమితాబ్‌బచన్ అంత గొప్పోణ్ణా?" సూర్యుడడిగాడు.

"అబ్బో... నీకు యాక్టర్స్ కూడా తెలుసన్నమాట"

"ఆంటీవాళ్ళ టీవీలో బోల్డుసార్లు చూశాను. సినిమాలు కూడా చూశాం"

"అలాగా - నేనెప్పుడూ టీవీ చూళ్ళేదమ్మా"

"ఒక్కసారి కూడా చూళ్ళేదా?"

"ఊహూ"

"మీ ఇంటిదగ్గర ఆంటీల్లేరా?"

"ఉన్నారు"

"వాళ్లకి టీవీ లేదా?"

"ఊహూ"

"అయ్యో పాపం... ఈ సారి మా ఇంటికిరా. ఆంటీ వాళ్ళింట్లో చూపిస్తాను. టీవీ చూస్తే ఆంటీ ఏవన్దు"

"మీరు గుడ్ బోయస్‌కదా – అందుకని ఆంటీ ఏవన్దు"

"నేనూ గుడ్ బోయ్‌నే" చిన్నవాడన్నాడు.

"మీరిద్దరూ గుడ్‌బోయ్‌లే. ఇకనుంచి మన ముగ్గురం ఫ్రండ్సన్నమాట. మనం రోజూ ఆడుకుందాం– సరేనా?"

"ఓ..." సంతోషంగా తలలూపారు.

మళ్ళీ ఏమనిపించిందో ఏమో– "కా

Talk of the town...ఏ నోట విన్నా....Talk of the town...ఏ నోట విన్నా...Talk o

# చతుర

"మా ఇంట్లో లైబ్రరీకోసం
నవలలు కొనాలంటేనే
భయమేస్తోందోయ్
వాటి ధరలు
చూస్తుంటే!"

"దానికొక్కటే
పరిష్కారం - చతుర!
నెల నెలా ఓ ఉత్తమ
నవలతో మీ లైబ్రరీని
అలంకరిస్తుంది
చతుర!!"



న్వెంటుకెళ్ళొద్దూ?'' అనడిగాడు సూర్య.

"ఈ వూళ్లో కాన్వెంటులేదు బాబూ.... ఇంచక్కని బడి వుంది. తాతయ్యే మాస్టారు. ఎన్నో కథలూ, పాటలూ చెబుతారు. ఎంత బావుంటాయో! రోజూ తాతయ్యా కూడా బడికెళ్తారుకదూ?''

"వెళ్తాం అంకుల్"

"గుడ్.... షికారుకెళ్దాం పదండి"

తనే వాళ్ల తలలు దువ్వి ఇంత పౌడర్రాసి బయటికి తీసుకొచ్చాడు శివం.

"అలా ఆసుపత్రిదాకా వెళ్ళొస్తాం మాస్టారూ! దీపికగార్ని ఇంతవరకూ కలవనేలేదు"

"మంచిది బాబూ.... ఏమైనా సాయంకావాలేమో కనుక్కో"

పిల్లల్తో హుషారుగా కబుర్లు చెబుతూ తీసుకెళ్తోన్న శివాన్ని చూస్తూ కళ్ళు తుడుచుకున్నారు మాస్టారు.

'ఏజన్మబంధమో ఇది శివం. కొడుకు చెయ్యాల్సిన పని నువ్వు చేస్తున్నావు. రేపు నేను కన్నుమూస్తే తలకొరివి పెట్టడానికి నాకొడుక్కి ఖాళీవుంటుందనుకోను. అప్పుడాపని కూడా నువ్వే – నువ్వే చెయ్యాలి శివం. అప్పుడే నా ఆత్మకి శాంతి కలుగుతుంది' అనుకున్నారాయన.

సరిగ్గా అదే సమయంలో పానకాలు ఆసుపత్రిలోకి ప్రవేశించాడు.

సన్నగా పొడుగ్గా వుండి గ్లాస్కో పంచె, లాల్చీ ధరించి పంచె కొనని జేబులో దోపుకొని సిగరెట్టు స్టైలుగా కాలుస్తూ వచ్చిన అతడి వంక కించిత్తు ఆశ్చర్యంగా చూసి ఆహ్వానించింది డా. దీపిక.

"నమస్కారం"

"నమస్తే.... రండి కూర్చోండి– చెప్పండి"

"నేను పేషంటుని కాదు" నవ్వేడు.

"మరెవరు?''

"నేనెవరంటే ఏంచెప్పను? చాలా చిక్కు ప్రశ్న. అయినా జవాబు చెప్పప్రయత్నిస్తాను. నువ్వు పానకాలువిరా అన్నారు మా అమ్మా నాన్నా. కాదు– వూరందరికీ కావాల్సిన వాడిన న్నారు వూరివాళ్ళు. తేలుకొండి అని వెక్కిరించారు కొందరు. అంచేత....''

"ఇంకచాలు.... వచ్చిన పని చెబితే....''

"అదో పెద్ద కథ....''

"మీరు హరికథకులా?''

"అయితే బాగానే వుండును.... మీ కథని వూరూరా గానంచేసేవాణ్ని''

"నేనంత గొప్పదాన్ని కాదుగాని....''

"అమ్మమ్మ... అంత మాటనకండి. తనొక్కడికే మీసాలున్నాయని పొంగిపోయే రాయుడి మీసాల్ని రొయ్యమీసాల్లా తీసిపారేశారు. అంతకంటే గొప్ప ఏముంటుంది చెప్పండి. పైగా సినిమా స్టార్లని తలదన్నే మీరు....''

"మీకేమైనా పనుందా లేక కబుర్లేనా.... పొగడ్తలూ పొచికోలు కబుర్లూ నాకిష్టముండవు"

ఆమె ముఖం చిట్లించేసరికి ఖంగుతిన్నాడతడు. అతడి సర్వీసులో తన అందాన్ని పొగిడిన మగాణ్ని ఇలా ఈసుపుల్లలా తీసిపారేయలేదు ఏ ఆడదీ!

"మీకు కోపం తెప్పించినట్టున్నాను... వస్తాను. కానొక్కసంగతి– మీరు చేస్తున్న పనిని హర్షిస్తున్నవారిలో ప్రథముణ్ని నేను. మీకెలాటి సాయంకావాలన్నా చెయ్యడానికి సిద్ధంగా వున్నాను. ఆ ముక్క గుర్తుపెట్టుకుంటే చాలు"

అతడు బయటికెళ్తోంటే శివం ఎదురయ్యాడు పిల్లల్తో.

"హలో హీరో... ఎప్పుడొచ్చావు?''

"ఇవాళేలెండి"

"ఊరిని వుద్ధరించబోతున్నావన్న మాట"

"నేనలా చెప్పలేదే మీకు?''

"నువ్వు నాకు చెబుతావా?! చాలామంది చెప్పేర్లే. సరేగానీ– ఈ పిల్లకాయలెవరు?''

"మాస్టారి మనవలు"

"అంటే మొగుడి మీద కేసుపెట్టి మొగసాలకెక్కిన సరిత పిల్లలా? ఓహోహో – అర్థమయింది. అయితే ఆ రూట్లో వస్తున్నావన్న మాట. బావుందోయ్ నీ ఉద్ధరింపు" అంటూ వంకరగా నవ్వుతూ వెళ్ళిపోయాడు పానకాలు.

"బ్లడీ రాస్కెల్....''

"ఏవిటి తిట్టుకుంటూ వస్తున్నారు" దీపిక అంది నవ్వుతూ..




''ఆ రోగ్ పానకాలు లేడూ– వాడి నాలికే కాదు బుర్రకూడా వంకరే''

''వాడి గొడవకేంగాని నువ్వెప్పుడొచ్చావ్?''

''ఇవాళే... మీ ఆదర్శాన్ని వెంటనే ఆచరణలో పెట్టినందుకు కంగ్రాచ్యులేషన్సు. ఏవూరికైనా డాక్టర్ అవసరం చాలా ఎక్కువ వుంది. అది గ్రహించి పట్నవాసం వదలి ఈ కుగ్రామానికొచ్చారు. మీకు మా కృతజ్ఞతలెలా చెప్పాలో తెలీటంలేదు. మిమ్మల్ని తలచి మాస్టారెంతగా పొంగిపోతున్నారో మాటల్లో చెప్పలేను''

''నా వృత్తి ధర్మాన్ని నిర్వహిస్తున్నాను. అదేదో పెద్ద ఘనకార్యమైనట్టు మీరంతా పొగడటం బాగుండలేదు. అన్నట్టు వీళ్ళు సరిత పిల్లలు కదూ? ఏం బాబూ– నేను గుర్తున్నానా?''

''ఓ'' తలలూపారిద్దరూ.

''మరి ఆంటీకి నమస్తే చెప్పరేం? చెప్పండి''

''నమస్తే ఆంటీ'' కోరస్‌గా అన్నారు.

''గుడ్ బాయిస్'' మెచ్చుకుందామె.

''ఆంటీ... మీ ఇంట్లో టీవీ వుందా?''

''లేదు బాబూ... నీకు టీవీ ఇష్టమా?''

''ఊఁ – మరేమో మా ఇంటిదగ్గరఆంటీవాళ్ళింట్లో టీవీ వుంది''

''ఈ ఆంటీ కూడా టీవీ కొంటార్లే. అప్పుడు మనమెళ్ళి బోల్డు సినిమాలూ, ప్రోగ్రామ్సూ చూసేద్దాం– సరేనా?''

తలలాడించారు వాళ్ళు.

చాక్లెట్లిచ్చింది వాళ్ళకి.

''మీకిక్కడెలా వుంది?''

''వెరీ నైస్''

''మీకేం ఇబ్బంది లేదుకదా?''

''ఊహూ''

''మీరు నాకన్నా రెండేళ్ళు సీనియర్ అనుకుంటా. అప్పట్లో ఎలుకతోక లాంటి జడతో ఎప్పుడూ రివ్వురివ్వుమని ఎగుర్తూండేవారు. పువ్వులంటే మీకు చాలా ఇష్టంకదూ''

''బాగానే గుర్తుందే. నీచీముడు ముక్కునీ నేను మర్చిపోలేదు''

''ఏమైనా ఆరోజులే వేరు''

''ఏరోజుల్లోనైనా బాల్యం ఓ మధుర కావ్యమే''

''బాగా చెప్పేరు– వస్తానింక''

''కూర్చో శివం... టీ పెడతాను''

''మీరుండటం కూడా ఇక్కడేనా?''

''ఆఁ – ఏరాత్రివేళ ఎవరికే ప్రమాదం ముంచుకొచ్చినా తేలిగ్గా అందుబాటులో వున్నట్టుంటుందని ఇక్కడే వుంటున్నాను''

''అయితే మీ చేతి టీ తాగే వెళ్తాం. మందుల వాసనెయ్యదనే మా నమ్మకం''

''భలేవాడివే'' నవ్వుతూ లోపలికి వెళ్ళింది దీపిక.

★ ★ ★

''అయ్యా – కొంప మునిగింది!'' వంతులు లోపలికొస్తూ గుమ్మంలోనుంచే అరిచాడు.

''ఏ కొంప?''

''మన కొంపే''

''తండ్రి పేరు?''

''అయ్యా – మన కొంప మునిగిందంటున్నాను''

అదిరిపడి కూర్చున్నారు షావుకారు.

''మన కొంపా......?''

''అవును... అక్షరాలా మనకొంపే''

''ఇప్పుడేవయ్యిందయ్యా...'' ఇంటికప్పు వంక చూస్తూ అన్నారు.

''కప్పు బాగానే వుంది. మీరు బాగానే వున్నారు- నేనూ బాగానే వున్నాను. కాని తమరి వ్యాపారానికే ముప్పొచ్చిపడింది''

''ఏవయ్యిందో తిన్నగా చెప్పరాదూ''

''చెప్పటానికి నోర్రావటంలేదండి. మనవూళ్ళో బ్యాంకుపెట్టపోతున్నారు''

''ఎవరు?''

''ఎవరేమిటి- ఓ ప్రభుత్వ బ్యాంకువారు తమ శాఖని మనూళ్ళో ప్రారంభిస్తున్నారట''

''ఎవరు చెప్పేరు?''

''ఊరంతా కోడైకూస్తోంది''

''నిజంగానే పెడుతున్నారంటావా-ఇక్కడే ముందయ్యా మట్టీ మశానం తప్ప!''

''అందుకే పెడుతున్నారటండీ! ఇంక

బ్యాంకొస్తే అడిగినవాళ్లకీ అడగని వాళ్లకీ అప్పులిచ్చేస్తారు. ఊరోళ్ల సొమ్మేకదా వూరికే పంచిపెట్టేస్తారనుకోండి. నెత్తిమీద రూపాయిపెట్టి వేలంవేస్తే పావలాకెవడూ కొనని వెధవలక్కూడా ధారాళంగా అప్పులిచ్చేస్తారు. ఇక మన గడపెవడు తొక్కుతాడూ, మన మొఖమెవడుచూస్తాడూ!''

''ఇంతత్వరగా ఎలా కదిలిందయ్యా బండీ? అక్కడికీ రాయుడికి చెప్పేనుగదా?''

''మీరేం చెప్పేరో ఆయనేం చేసాడో ఏమో! ఆ శివంగాడూ, మాస్టారూ అంతా కలిసి ఊళ్ళో బ్యాంకు పెట్టించమని కలెక్టరుకి మహజరు సమర్పించారండీ! సెక్రటేరియట్లో పనిచేస్తున్న మాస్టారి శిష్యులు కూడా గట్టిగా ప్రయత్నిస్తున్నారండీ, అని చెవునిల్లు కట్టుకుని పోరేను. ఇల్లలగ్గానే పండుగవుతుందా, అన్నారు. చూడండి... ఇప్పుడేమయిందో''

''ఇదంతా మాస్టారి పనేనంటావ్?''

''నిస్సందేహంగా'' ముక్కుపొడుం దట్టిస్తూ అన్నాడు.

''పిలిపించు– మన తడాకా చూపిద్దాం''

''చేతులు కాలేక ఆకులు పట్టుకుంటానంటారు''

''ఊహూ ఆయనిన్నీ కాల్చేస్తాను''

''మతివుండే మాట్లాడుతున్నారా?''

''ముందా పని చూసి తగలడు'' అరిచారాయన.

నిజంగానే మతిపోయింది నరసింహానికి.

తాతముత్తాతల నుంచి వస్తున్న వడ్డీ వ్యాపారం. తమ ఐశ్వర్యాన్నెంతగానో పెంచిన వ్యాపారం. అలాటి వ్యాపారానికి చావుదెబ్బ తీయాలని సంకల్పించిన వాణ్ని తేలిగ్గా వదిల్తే తన నాశనం చూడడూ?''

మాస్టారొచ్చారు.

ఆకలిగొన్న పులిలా పచార్లు చేస్తోన్న షావుకారుని చూసి తనమీద పిడుగులు కురవటం ఖాయమనుకున్నారాయన.

''మాస్టారూ! నువ్వింత నమ్మకద్రోహివీ, విశ్వాసఘాతకుడివీ అనుకోలేదు. అన్నం పెట్టిన చేతిని కరిచే దుర్మార్గుడివి...''

''మీరేమంటున్నారో, కానివని నేనేం చేశానో తెలీడంలేదు''

''నీకేం తెలుస్తుంది. నోట్లో వేలుపెడితే కొరకలేని అమాయకుడివి పాపం. చెయ్యాల్సిదంతా చేసేసి, పెట్టాల్సిన ముగ్గులన్నీ పెట్టేసి నంగనాచిలా నేనే పాపం ఎరగనంటున్నావా? నీ నక్క వినయాలు నాదగ్గర కాదుగాని నా అప్పు సొంతం ఇవాళకక్కెయ్యి. ఇంకొకరోజు కూడా గడువివ్వను. ఊс... కక్కెయ్''

''నా పరిస్థితి మీకు తెలీందికాదు. నన్ను అమ్మినా ఇప్పటికిప్పుడంత డబ్బురాదు. నాక్కొంచెం గడువివ్వండి. అణాపైసల్తో మీ అప్పు తీర్చేస్తాను''

''ఇవ్వనుగాక ఇవ్వను... ఇవాళే ఇప్పుడే అప్పు తీర్చి గడపదాటు. అంతవరకూ ఇక్కణ్నుంచి కదల్నివ్వను''

''అయ్యా-అసలే వూరి పరిస్థితి బాగోలేదు. లేనిపోని గొడవెందుగ్గాని ఒకటి రెండ్రోజుల్లో తీర్చేస్తాడేమో కనుక్కోండి. తీర్చేస్తాననొచ్చుగాని తీర్చలేడన్నది తిరుగులేని సత్యం. అప్పుడు దొంగలసంఘంలో పెట్టి కొంపలాక్కుని వూళ్ళోంచి వెళ్ళగొట్టించేద్దాం'' పంతులు చెప్పేడు కాస్త స్వరం తగ్గించి.

''సరే... రేపటిదాకా గడువిస్తున్నాను. అప్పు తీర్చేస్తే సరేసరి– లేకపోతే నేను మనిషిని కాదు, గుర్తుంచుకో''

అవమానభారంతో వెనుదిరిగారు మాస్టారు. ఒకనాడిలాటి స్థితిలోనే ఎదురైన సుబ్బరామయ్య రూపం కళ్లముందు కదలసాగింది. అప్పుడు షావుకారుకొట్టిన దెబ్బకికుదేలయ్యాడు సుబ్బరామయ్య. కొడుకు పరారవ్వడంతో కృంగిపోయాడు. ఆ దెబ్బల నుండింతవరకూ కోలుకునేలేదాయన!

తను కూడా...

తనేమైనా ఫర్లేదుగాని– తను చేపట్టిన కార్యాలన్నీ మధ్యలోనే వుండిపోయాయి!

సరిత భవిష్యత్తు ఎటూకాకుండా వుండిపోయింది!

కాస్త వ్యవధి-వూపిరి పీల్చుకునేంత వ్యవధి లభిస్తే బావుణ్ను. కాని అలనాటి షైలాక్‌ని మించిన షావుకారు-తనని నమలకుండానే




మింగేద్దామని చూస్తున్న నరసింహం-తనకి నమయమిస్తాడా? అసంభవం!

బడిలోకెళ్లారు–

గొడవచేస్తోన్న పిల్లలు మాస్టారి మొఖం చూసి నిశ్శబ్దమైపోయారు. మాస్టారికేమయ్యిందోనని ఆదుర్దాపడసాగారంతా.

"నేనేదో పనిమీదవెళ్తే బాధ్యతా రాహిత్యమంటూ పెద్ద పెద్ద మాటలు మాట్లాడేస్తారు. ఇలాటివాళ్లని చూసే అన్నారు– తమదాకా వస్తేగాని తెలీదని" అసిస్టెంట్ టీచర్ పరంధామయ్య అన్నారు మాస్టారివంక వక్క చూపు చూస్తూ.

"అత్యవసరమై... అక్కడికీ బడి వదిలేవరకూరాననే అన్నాను. షావుకారిమనిషి వూరుకోక



పోయేసరికి తప్పలేదు'' నొచ్చుకున్నారు.

''అహ- మీరు వెళ్ళేరని అనటంలేదు లోకం పోకడచెబుతున్నానంతే! అయినా మి మ్మల్నెవరు అడగ్గలరు చెప్పండి. బయటివాళ్ల కేమో దేముడు, లోపలివాళ్లకేమో హెడ్మాస్టారు. తలకాయున్నా లేకపోయినా తలకాయ మాస్టా రికి తలొంచక తప్పదుకదా. అదేం ఖర్మో ఇన్నేళ్ల నుంచి ఇక్కడే పాతుకుపోయి నాకు ప్రమోషన్ యోగం లేకుండా చేశారు. ఎప్పుడు రిటైర్ అవుతారో ఏమో!''

ఆయన నిష్ఠూరంగా మాట్లాడుతూంటే బాధగా చూస్తూండిపోయారు.

''అలా దేభ్యంమొహాలేసుకుని చూస్తూన్నా రేంరా- చదవండి. తిన్నదరక్క బడి కొస్తున్నా రుగానీ మీకు చదువులెందుకురా- హాయిగా పశువుల్ని మేపుకోక. ఆఖరికి బడిపంతులుద్యో గమంటే పశువుల కాపరి పనైపోయింది. ఛాఛా...'' అంటూ ముక్కుపొడుం డబ్బా తెరి చారో లేదో ఆయనకేదో ఐడియా వచ్చింది. రెండంగల్లో మాస్టారి దగ్గరికెళ్ళారు.

''అవునుగాని మాస్టారూ... షావుకారు అర్జంటుగా పిలిచాడన్నారు-- ఏవిటి విశేషం? ఏమైనా లెక్కా డొక్కా రాయడానికా లేక...'' అర్థోక్తితో ఆగారు.

''అప్పు తీర్చమని పీకలమీద కూర్చున్నా రు...''

''కూర్చుంటారు-- మరి కూర్చోరూ. ఒకరి దగ్గర అప్పుచెయ్యడమంటే వాళ్లకి మన తల అప్పగించినట్టే. ఏవన్నారేంటి?''

''రేపట్లోగా అంతా తీర్చేయమని...''

''బెదిరించారంటారు. నాకేవిటి షావుకారెలా టివాడో వూరందరికీ తెలుసు. ఆయనకి నోట్లో వున్నది నాలికకాదు-- కత్తి. దానికి మనుమల్నీ జీవితాల్నీ ముక్కలుగా కోసెయ్యడమే తెలుసు. ప్చ్-చాలా ఇబ్బందిలో ఇరుక్కుపోయారే పాపం. మీరేమో గంగిగోవులాంటివారాయె. రేపు దొంగల సంఘంలో కేడ్చికట్టుబట్టల్తో వది లిపెట్టినా ఆశ్చర్యం లేదు. అప్పుడు వూరివాళ్లొ చ్చి ఆదుకోరుకదా?''

''వాళ్ళెందుకు రావాలి మాస్టారూ! అప్పు చేసింది నేను, దానికి ప్రతిఫలం అనుభవించా ల్సింది నేను...''

''ఎంత మీరు సత్యహరిశ్చంద్రులయినా ఇంత ఇది కూడదు. ఇంతకీ రేపట్లోగా అప్పు ఎలా తీర్చాలనుకుంటున్నారో కాస్త నా చెవిన వేస్తే సంతోషిస్తాను''

''ఏమీ తోచటం లేదు మాస్టారూ''

''మీ అబ్బాయేమైనా...''

''నిన్నగాక మొన్న ఉద్యోగంలో చేరినవాడు. వాడివల్లేమవుతుందిగాని ఇల్లు అమ్మేస్తే బావుంటుందేమోనని వుంది. అది తప్ప మరే ఆస్తి లేదు!''

వరంధామయ్య- కళ్ళు మెరిశాయి.

''ఆలోచన బాగానే వుందిగాని ఈరోజుల్లో పల్లెల్లో ఇళ్ళెవరు కొంటారండీ! చాలా కష్టం-- పైగా మట్టిల్లు కూడానూ. అప్పు ఏమాత్రం వుంటుందేమిటి?''

''పదహారు వేలదాకా వుండొచ్చు''

''అబ్బో... అంతెక్కణ్నుంచొస్తుందా ఇంటి మీద. కానీ ఒక సాయం చెయ్యగలను మాస్టా రూ. మా అల్లుడు ఇల్లు కొనాలనివుంది అన్నాడామధ్య. మీరు పదివేలకిచ్చేటట్టయితే మీ ఇల్లు కొనడానికి అతికష్టంమీద ఒప్పించగ లను. ఆపైన మీ ఇష్టం మరి''

''మీ అల్లుణ్ని కలుసుకుని మాట్లాడండి మాస్టారూ- నేనింట్లో కనుక్కుని ఏ మాటా చెబుతాను''

''అలాగే... ఈ రాత్రికే వెళ్లి కనుక్కొస్తాను. నాకు చెప్పకుండా ఎవరికీ మాటివ్వకండి సుమా''

''అలాగే''

బడిగంట కొట్టేక కాళ్లీడ్చుకుంటూ ఇంటి ముఖం పట్టారు.

కాళ్లు కడుక్కోడానికి నీళ్లందిస్తూ- ''అలా వున్నారేం?'' అని అడిగింది శారద.

''బాగానే వున్నానే''

''ఎలా వున్నదీ మీ మొఖమే చెబుతోంది గాని నా దగ్గర దాస్తారెందుకు... ఏం జరిగిందో చెప్పండి''

జరిగిందంతా వివరించారు.

''ఆయనకేం పోయేకాలమొచ్చిందండీ.




ఇప్పటికిప్పుడు కక్కమంటే ఎలా చెప్పండి?''

''అవన్నీ ఆయనకెందుకే''

''ఎంత అప్పిస్తే మాత్రం ఇంత జులుమా?''

''ఇదంతా నావల్లే వచ్చింది. నేను పుట్టకపోయివున్నా బావుండేది'' సరిత అంది విచారంగా.

''అవేం మాటలమ్మా... అప్పు నీవల్ల అయ్యిందా అన్నయ్య చదువువల్ల అయ్యిందా అన్నది కాదు ప్రశ్న. ఇప్పుడు అప్పు తీర్చడమెలాగన్నదే సమస్య''

''ఇంత అర్థాంతరంగా అంత డబ్బెక్కణ్నుంచొస్తుందండీ''

''ఇల్లు అమ్మటం తప్ప గత్యంతరం కనిపించటంలేదు''

''ఏమిటీ ఇల్లు అమ్మేస్తారా... మీకు మతిపోతోందా ఏమిటీ. ఇవాళోరేపో రిటైర్ అవడానికి సిద్ధంగా వుండి వుండటానికింత కొంప కూడా మిగల్చకుండా ఏంచేద్దామని? ఏ చెట్టుకింద తలదాచుకుందామని? ఏదిఏమైనాసరే నా కంఠంలో ప్రాణం వుండగా ఈ ఇల్లు అమ్మనివ్వను'' మొండిగా అందామె కన్నీటితో తల ముక్కలవుతూ.

ఇల్లు అమ్మెయ్యడమన్న వూహే భరించలేకుండా వుందామె.

ఇంతవరకూ నన్నెప్పుడూ ఏ విషయంలోనూ ఎదిరించలేదు. నేనేం చేసినా తోడుగా నా పక్కన వున్నావు. ఇవాళ- నా జీవితపు చరమాంకంలో ఎదిరిస్తున్నావన్నమాట...!''

''అది కాదండీ... ఉండటానికింత నీడ కూడా లేకపోతే ఏమైపోతాం? నా గురించి కాదండీ నా బాధ. ఒకర్ని అర్థించి ఎరుగని ఒకరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఎరుగని మీ గురించే నా బాధంతా. అబ్బాయి దగ్గర వుండలేం. అద్దెకుండటానికి ఆదాయం చాలదు- ఇంకెలా చెప్పండి?''

''నువ్వు చెప్పిందంతా నిజమే శారదా. కానది పరువుకన్నా ఎక్కువ కాదు''

''పరువు... ఎందుకొచ్చిన పరువండీ- మనకంటూ ఏమీ మిగల్చనప్పుడు. మీ సుఖం మరిచి వూరోళ్లువూరోళ్లంటూ- కాలికి బలపం కట్టుకుని తిరిగారు. ఇప్పుడేమయ్యిందో చూడండి. మీమంచే మీమీద కత్తిగట్టింది. మీ పనులకే పాపుకారుకి కోపంవచ్చింది. పెద్దవాళ్లకి కోపం వస్తే మన్లాటి పక్షిపిల్లలు మాడి మసైపోతాయండి. నా మాటవిని వూరికీ, వూరు గొడవలకీ ఓ నమస్కారం పెట్టండి. అన్నీ అవే సర్దుకుపోతాయి. మీరడగలేకపోతే నేను వెళ్లి గడువిమ్మని బతిమాల్తాను...''

''పిచ్చిదానా గీతలో కృష్ణుడేమన్నాడు? చేసేదీ, చేయించేదీ అన్నీ నేనే. నువ్వు కేవలం నిమిత్త మాత్రుడివి- అన్నాడు. ఏ విషయంలోనైనా అంతే. మనం నిమిత్తమాత్రులం. ఫలితం గురించి పట్టించుకోకుండా మనకి నిర్దేశించిన పనిచెయ్యడమే మన కర్తవ్యం. ఇందులో ఒకర్ని తప్పుపట్టాల్సినపనిగాని, నిందించాల్సిన అవసరంగాని లేదు. అంతా కర్మానుసారం నడవాల్సినవారమే- కర్మబద్ధులమే!''

మాస్టారివంక గుడ్లప్పగించి చూస్తుండిపోయారు శారదా, సరిత.

★ ★ ★

ప్రాయోపవేశానికి సిద్ధపడిన దుర్యోధనుడి మనఃస్థితిలా వుంది రాయుడి స్థితి.

మాస్టారికింతమంది శిష్యులున్నారనిగాని, వాళ్లు వివిధరంగాలలో వున్నతస్థానాలలో వున్నారనిగాని, మాస్టారి పిలుపుకి వాళ్లంతా ప్రతిస్పందిస్తారనిగాని వూహించలేదాయన. ప్చ్ ప్చ్- అని నవ్వినరోజు లేకపోలేదు.

కాని చూస్తుండగానే వూరి పరిస్థితి గబగబా మారిపోతోంది.

మార్పు తనకీ ఇష్టమే. కాని తన ప్రమేయం నామమాత్రం కూడా లేకుండా అన్నీ జరిగిపోతుండటమే నచ్చటంలేదు. నిజానికి మింగుడుపడటంలేదు.

ఊళ్లో ఆసుపత్రి వెలిసింది. డాక్టరమ్మనీ, మాస్టార్నీ పొగడనివాళ్లు లేరు వూళ్లో.

కొన్నిరోజుల్లో బ్యాంక్ రాబోతోంది. నరసింహం గుండెలప్పుడే జారిపోయాయి.

బీట్లో ఎరువుల ఫ్యాక్టరీ నిర్మాణానికి చకచకా పనులు జరిగిపోతున్నాయి. ఉద్యోగాలు దొరుకుతాయనంతా ఎగిరెగిరి పడుతున్నారు.

ఊళ్లోని చిన్నా పెద్ద రైతులు శివం చుట్టూ తిరుగుతున్నారు. అతడు చెప్పే ప్రతిమాటా చేసే ప్రతిపనీ వాళ్లకి శిరోధార్యంగా వుంది.

ఊళ్లో రోడ్లు వెయ్యడానికి సర్వే చేస్తున్నారు.

ఇవన్నీ ఇదే స్పీడులో జరిగితే ఒక్క ఏడాదిలో వూరు రూపం గుర్తుపట్టలేనంతగా మారిపోతుంది. అందుకు సంతోషమే. కాని కొత్త నాయకులు ముందుకొస్తారు. వూరు తన చేతుల్లోంచి జారిపోతుంది.

అదే తన బాధ, భయం.

అటు సూర్యుడిటు పొడిచినా సరే కొడుకు ప్రభాకర్ని తన రాజకీయ వారసుణ్ని చెయ్యాలి. తనలా గ్రామానికే కుదించుకుపోకుండా ఆ ప్రాంతం మొత్తానికి నాయకుణ్ని చెయ్యాలి. తర్వాత మంత్రి అవడం అతితేలికైన విషయం.

కొందరికిది అత్యాశగానో, అర్థంలేని పనిగానో కన్పించవచ్చు. కానిందులో ఎలాంటి తప్పూలేదు. ఇది దేశానికి కొత్తకాదు.

రాజు అనంతరం రాజు కొడుక్కి పట్టాభిషేకం చెయ్యడం రామాయణకాలంనుంచీ వస్తున్న సత్యమే. అంతా ఒప్పుకున్న సూత్రమే.

ఇక ఈనాటి రాజకీయాల సంగతి సరేసరి.

అసలు మనదేశ రాజకీయాలు కొడుకులతోనూ, కొడుకుల చేష్టలతోనూ ముడిపడి వున్నాయన్నది చరిత్ర చెబుతున్న పాఠం!

ఇక పిపీలకంలాంటి తనెంత? తన కోరికెంత?!

కొడుక్కి తను నాలుగైదు తరాలవాళ్లు కూర్చుని తిన్నా తరగనంత ఆస్తి ఇస్తాడు. దాంతోపాటు అధికారం కూడా ఇవ్వగలిగితే బంగారానికి తావి అబ్బినట్టే.

ఇప్పుడేమిటి చెయ్యటం?

అక్కడికీ పానకాల్ని శిఖండిలా వుపయోగించుకోవాలని చూశాడు. వార్తలూ, పుకార్లూ పుట్టించాడు. ఒకరిమీదొకరికి దురభిప్రాయాలు కలిగేలా ప్రవర్తించాడు. మహాజర్లకి వ్యతిరేకంగా దొంగసంతకాలతో అర్జీలు సమర్పించాడు.

ఎన్ని చేసినా, ఎంత చేసినా ప్రయోజనమేమి కన్పించటంలేదు.

మాస్టారి రథం యొక్క జైత్రయాత్ర ఆగటంలేదు.

పోనీ మాస్టార్ని దెబ్బతీస్తే?

సేనాధిపతి లేని సైనికులైపోతారు శిష్యులు. అప్పుడు వాళ్లని విడగొట్టడం, బెదరగొట్టడం చాలా తేలిక.

నరసింహం అప్పు, దొంగల సంఘం తీర్పూ రెండు ఆయుధాలుగా చేసుకుంటే మాస్టార్ని నిలువునా కూల్చెయ్యవచ్చు.

హ్హ హ్హా... నవ్వుకున్నాడు రాయుడు.

★ ★ ★

రెండు యాపిల్ పళ్ళు తెచ్చి డా. దీపిక టేబుల్మీద పెట్టింది రత్నమాల.

''ఇవెందుకిప్పుడు?''

కళ్లు దించేసుకుంది.

''ఏవిటి విశేషం?''

సిగ్గుగా నవ్వింది.

''తెల్సిందిలే కూర్చో... ఇప్పుడెన్నోనెల?''

''నాలుగు''

''ఊఁ- మీ ఆయనేమంటున్నాడు. మళ్ళీ రాత్రుళ్ళు గడపదాటటంలేదు కదా''

తల అడ్డంగా వూపుతూ నవ్వింది.

రత్నమాలకి అరవ దెయ్యం పట్టిందని గోలచేసి దెయ్యాల వీరయ్య చేత పూజలు చేయించినప్పటి సంగతులిద్దరూ మర్చిపోలేదు.

శారీరకంగా మానసికంగా బలహీనంగా వున్న రత్నని చూడగానే అది మానసిక రోగమనీ, ఒక రకమైన హిస్టీరియా అని గ్రహించింది దీపిక. ఓదార్చి ధైర్యం చెప్పింది. లాలించి అడిగి విషయం రాబట్టింది.

రత్నకి పిల్లలంటే ఎంతో ఇష్టం. పిల్లల కోసం పెళ్లైన మర్నాటినుంచీ తపిస్తోందంటే అతిశయోక్తికాదు. కాని ఆమె భర్త ఆమెతో సఖ్యంగా వుండేవాడుకాదు. అతడికి పెళ్లికి ముందు నుంచీ కూడా చిలక అనే ఆమెతో సంబంధం వుంది. పెళ్లయ్యేక కూడా దాన్ని కొనసాగిస్తూనే వుండటంతో ఆమె అసంతృప్తితో, ఆవేదనతో అలమటించసాగింది. తను




# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

డబ్బుకోసమేనా మీ చింత !
మార్గదర్శి ఉన్నది మీ చెంత !!

మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

భర్తనుండి ఏమేమి ఆశిస్తోందో అవన్నీ చిలకకి దక్కుతూండటంతో మరింత వేదనకి లోనయింది. ఆఖరికి తనెన్నాళ్ళ నుంచో ఆశిస్తూ అర్థిస్తోన్న ముత్యాల నెక్లెస్‌ని భర్త తనకని చేయించి చిలక్కి ఇచ్చెయ్యడంతో మరీ భరించలేకపోయింది. అతడిమీద కోపంతో, అసహనంతో రెచ్చిపోయింది. నోటికొచ్చిన పదాలతో తిట్టేసింది.

అంతా దెయ్యం పట్టిందన్నారు తప్ప ఆమె మనస్సులోని బాధేమిటో, దిగులేమిటో గ్రహించడానికి ప్రయత్నించలేదెవరూ. పైగా దెయ్యాల వీరయ్యని పిలిపించి పొగల్తో వేపరొట్ట దెబ్బల్తో బెత్తపు ఝుళిపింపుల్తో హింసించారు.

విషయం తెలిశాక ఒక్కక్షణం వృథాచెయ్యలేదు దీపిక.

రత్నతోనూ, ఆమె భర్తతోనూ కూడా విడివిడిగా మాట్లాడింది. ఓదార్చింది. నచ్చజెప్పింది.

అతడు తన నడవడి మార్చుకోకపోతే రత్న ఆరోగ్యం దిగజారుతుందనీ, ఏ అఘాయిత్యానికైనా తలపడొచ్చనీ, అప్పుడు పోలీసులు దానికతణ్ణి బాధ్యుణ్ని చేస్తారనీ చెప్పింది. పరువు నష్టంతోబాటు శిక్ష అనుభవించాల్సొస్తుందని హెచ్చరించింది. ఇంట్లో భార్యనుంచుకుని పరాయిఆడవాళ్ళ చుట్టూతిరగటం సిగ్గుమాలిన పని అని చెప్పింది. అంతా అతడి గురించి అనేక రకాలుగా అనుకుంటున్నారంది. నిజమైన సుఖసంతోషాలు భార్యాభర్తల అన్యోన్య దాంపత్యం నుంచి, చక్కని సంసారం నుంచి మాత్రమే లభిస్తుందని నూరిపోసింది.

ఏమైతేనేం ఆమె ప్రయత్నం ఫలించింది. అతడు మారాడు. రత్న వేగంగా కోలుకుంది. వాళ్ళిప్పుడెంతో అన్యోన్యంగా వుంటున్నారు!

నిట్టూర్చింది రత్న- "సమయానికి మీరీవూరు రాకపోతే నేనేమైపోయేదాన్నో తలచుకొంటే ఒళ్ళు గగుర్పొడుస్తోంది. బహుశా దెయ్యాల వీరయ్య దెబ్బలకి చచ్చిపోయేదాన్నేమో!" అంది కళ్ళనీళ్ళతో.

"పిచ్చిదానా... లేనిపోని ఆలోచనల్తో మనస్సు పాడుజేసుకోకు. అదో పీడకలని మర్చిపో"

"అలాగే డాక్టర్" గబుక్కున వంగి ఆమె కాళ్ళకి నమస్కరించి వెళ్ళిపోయింది రత్న.

తర్వాత పేషంట్లందర్నీ చూసేసింది. ఆమె హస్తవాసి మంచిదని పేర్రావడంతో పొరుగూళ్ళ నుంచి కూడా వస్తున్నారు.

ఆసుపత్రికి రాలేని రోగుల ఇళ్ళకెళ్ళడానికి సరంజామా సర్దుకొంటుంటే "టీ పెట్టనా అమ్మగారూ" అనడిగాడు కాసు.

"పెట్టు పోనీ" చేతులు వాష్ చేసుకుంటూ అంది.

టీ తాగబోతోంటే వచ్చాడు శివం. అతడొద్దంటున్నా వినకుండా సగమిచ్చింది.

మొదట్నుంచీ కూడా ఇద్దరూ ఎంతో స్నేహంగా వుంటున్నారు. తర్వాత ప్రతిదాని గురించీ చర్చిస్తూ కార్యక్రమాలు చేపడుతూ మరింత సన్నిహితులయ్యారు.

నిజానికి వచ్చిన మొదట్లోనే ఓ చిన్న సంఘటన వాళ్ళని మరింత దగ్గర జేర్చింది.

దీపికకీ, ఆమె వల్ల మాస్టారికీ దక్కుతున్న కీర్తిని సహించలేక ఆమె నెలాగైనా పల్లెనుంచి తరిమేయాలనుకున్నాడు రాయుడు.

తమవారికి ప్రమాదంగా వుందని ఒక రాత్రివేళవచ్చిదీపికని తీసుకెళ్ళాడు వీరేశం.

దారిలో నిర్జన ప్రదేశంలో మరో ఇద్దరు తోడవ్వగా ఆమెని బెదిరించారు. ఊరువిడిచి పోకపోతే ఆసుపత్రికి నిప్పుపెడతామన్నారు. ఆమెని సజీవదహనం చేస్తామన్నారు.

అయినా ఆమె బెదర్లేదు. మీరేం చేసినా వెన్నిచ్చి పారిపోయేదిలేదని ఖరాఖండీగా చెప్పేసింది. వాళ్ళు బలప్రదర్శన చేసి కాలో చెయ్యో విరిచెయ్యాలని చూశారు.

కాని ఇంతలోనే ఏదో పనిమీద పొరుగూరెళ్ళిన శివం అనుకోకుండా అప్పుడటుగా తిరిగొస్తూ ఇదిచూశాడు. వాళ్ళతో తలపడ్డాడు. ఆమె కూడా ధైర్యం తెచ్చుకుని చేతికి దొరికిన కర్ర నందుకుంది. రాళ్ళు విసిరింది.

చివరికి పలాయనం చిత్తగించారు వాళ్ళు.

దీపికని ఒంటరిగా మసలనివ్వటం ప్రమాదమని కాసు అనే చురుకైన కుర్రాణ్ని ఏర్పాటు చేశాడు శివం. ఇరవై నాలుగ్గంటలూ ఆమెని కంటికి రెప్పలా కాపాడుతూ ఆమె పనుల్లో సాయపడటమే వాడి డ్యూటీ.

ఆ సంఘటనతో శివంయెడ ఆమె మనస్సు

 

కృతజ్ఞతతో నిండిపోయింది.

"మహిళా మండలి సంగతెంతవరకూ వచ్చింది?" దీపిక అడిగింది.

"ముఖ్యసేవికా గ్రామసేవికా రేపు వస్తామన్నారు. రేపు మహిళల్ని సమావేశపరుద్దాం"

"సరితకా కార్యక్రమం అప్పగిస్తే బావుంటుంది"

"అదే అనుకుంటున్నాను. మొదట్లో మీదగ్గర నర్సుగా చేర్పిద్దామనుకున్నాను. కాని ఆమె నలుగుర్తో తిరగడానికి సిద్ధపడనందున ఆ ప్రయత్నం విరమించాను. మహిళా సంఘ కార్యక్రమాల గురించి తనకీ ఆసక్తిగా వుంది. చురుకుదనం, తెలివితేటలూ వున్నాయి. తను ఆ విషయంలో సక్సెస్అయి తీరుతుంది. తనా గొడవా మర్చిపోగలుగుతుందని నమ్మకంగా వుంది"

"నిజమే- అది రెండువిధాలా మంచిది. మరి మాస్టారేమంటున్నారు?"

"అప్పుసంగతేనా? కొన్ని విషయాల్లో ఎంత ప్రగతిశీలంగానూ, చొరవగానూ ఆలోచిస్తారో కొన్నింట్లో అంత వ్యతిరేకంగానూ ప్రవర్తిస్తారు. అప్పు ఇప్పటికిప్పుడు కట్టలేమంటే తలకొట్టిమొలేస్తారా అంటే వినరు. మనం అడిగినప్పుడు అప్పు ఇచ్చారు. ఆయన అడిగినప్పుడు తీర్చటం మన బాధ్యత అంటున్నారు! నలుగురూ నాలుగు చేతులేద్దామని వాళ్ళోళ్ళువాళ్ళన్నారు. అభిమానంగా ఫీలై వద్దనేశారు. పోనీ ఇల్లు ఎవరైనా కొంటారేమోనని చూస్తే ఎవరూ రావటంలేదు. ఆఖరికి నిన్న కొంటానన్న వరంధామయ్య కూడా నీళ్ళు నమిలేస్తున్నాడు. రాయుడతణ్ని పిలిచి ఏదో చెప్పేడు అంటున్నారు. ఈ రాత్రికి దొంగల సంఘంలో చర్చకు పెడతానంటున్నాడు షావుకారు. అక్కడ జరిగే తంతేమిటో, చెప్పే న్యాయమేమిటో ఎవరికి తెలీదు? అయినా, ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది- నా గురించి ఆవేశ కావేషాలొద్దంటున్నారు మాస్టారు. అబద్ధం ఆడనన్న హరిశ్చంద్రుడెన్ని కష్టాలు పడాల్సొచ్చిందో అందరికీ తెలిసిందే. గాంధీగారు చెప్పేరు కదాని ఒక చెంపమీద కొట్టిన వారికి రెండో చెంపచూపిస్తే దానిమీదా దాంతోబాటు నెత్తిమీదా కూడా కొట్టి కాలితో తన్నేస్తున్నారు. అందుకే దీన్ని కలికాలమన్నారు. కాలాన్నిబట్టి నీతీ న్యాయాల అర్థాలు మారిపోతాయి. దానిని బట్టే మనమూ నడుచుకోవాలి. లేకపోతే పాతాళానికి తొక్కేస్తారు" ఆవేశపడ్డాడు శివం.

చిన్నగా నవ్వింది దీపిక- "నిజమే శివం... నువ్వన్నది నిజమని నేనూ ఒప్పుకుంటున్నాను. మన యువతరమంతా కూడా ఒప్పుకుంటుంది. కాని మాస్టారొప్పుకోరు. ఆయన తరం వేరు. ఆయన నమ్మకాలు వేరు. ఆయన విలువలువేరు. ఆయన సిద్ధాంతాలు వేరు. పదిమంది కోసం వాటితో రాజీపడగలరేమో గాని స్వవిషయంలో రాజీపడరు. రాజీపడటమంటే వాటికి తిలోదకాలిచ్చినట్టేననీ, ఓడిపోయినట్టేననీ భావిస్తారు. అందువల్ల ఆయన్ని తప్పుపట్టి ప్రయోజనంలేదు"

"అలా అనిదొంగలసంఘంముందు బలిపశువులా తలవంచి నిలబడతానంటూంటే ఎలా చూస్తూ వూరుకోవడం?"

"ఊరుకోవద్దు... అట్నించి నరుక్కొద్దాం"

ఆలోచనలోపడ్డాడు శివం.

"చూశావా – ఆవేశం అణిగేసరికి ఆలోచన రాజుకుంది" నవ్విందామె.




"నమస్కారం మాస్టారూ" నవ్వుతూ వచ్చిన పానకాలు వంక భావరహితంగా చూస్తూండిపోయారు మాస్టారు.

"ఏవిటలా వున్నారు- అస్త్రసన్యాసం చేసిన అర్జునుళ్ళా" భళ్ళున నవ్వేశాడు పానకాలు తన జోక్కి.

మాస్టారి ముఖం ఎర్రగా కందింది.

"నేలకిపోయేది నెత్తికి రాసుకోవడమన్న



సామెత విన్నారా మాస్టారూ! ఏదో పొట్టచేత బట్టుకుని గొర్రెతోకలాంటి వుద్యోగంచేస్తు న్నందుకు అణగిమణిగి వుంటేకాలం హాయిగా దొర్లిపోతుంది. లేనిపోని రాజకీయాలూ, సంఘ సంస్కరణలూ మనకెందుకు చెప్పండి. వాటి కోసం ప్రత్యేకంగా కొందరు మహాపురుషులు పుడుతూంటారు. ఆ పన్లువాళ్ళకి వదిలేసి మనం నిశ్చింతగా వుండటం మంచిదంటా ను. ఏవంటారు?''

''నువ్వొచ్చిన పనేమిటో డొంక తిరుగుళ్ళు లేకుండా చెప్పమంటాను''

''చల్లకొచ్చి ముంతదాస్తానా? ఏం లేదు మాస్టారూ... ప్రస్తుతం మీ పని చాలా దయనీ యంగా వుంది. ఇన్నాళ్ళూ ఎంతో పరువుగా మర్యాదగా ఓ వెలుగు వెలిగినవారాయె. రాత్రి కి దొంగల సంఘం సమావేశం కానున్నది కదా. వాళ్ళేమని తీర్పు ఇస్తారో ఏమో. అంచేత నా మాట వింటానంటే అమృతంలాంటి మాట చెబుతాను''

''చెప్పాలని వచ్చినవాడివేకదా- చెప్పు''

''మొత్తానికి మాస్టారన్పించారు. ఏం లేదు మాస్టారూ... మీరు వూరు విషయాలు పట్టించు కోనని మీ పిల్లల మీద ప్రమాణం చేసి చెబితే అప్పుముప్పు తప్పించే మార్గం చెబుతాను. ఎంతో వ్యవధిలేదు. ఎంత త్వరగా చెబితే అంతమంచిది''

''దానివల్ల ఎవరికేం జరుగుతుంది?''

''అది ఎవళ్ళకి వాళ్ళు చూసుకుంటార్లెండి- మధ్యన మనకెందుకా పితలాటకం చె ప్పండి?''

''వాళ్ళంత పిచ్చివాళ్ళో తెలుసుకుందా మని. నేను వూరుబాగోగులు పట్టించుకున్నా పట్టించుకోకపోయినా బయల్దేరిన జగన్నాథ రథం ఆగదు. బ్యాంకు, ఫ్యాక్టరీ, సంఘాలు, రోడ్లు ఏవీ ఆగవు. ఆగుతాయనెవరైనా ఆశిస్తే అది భ్రమ మాత్రమే. ఎంచేతంటే ఈ ఉద్యమం నానుంచి వూపిరిపోసుకునుండొచ్చు కాని ఇప్పుడెందరి చేతుల్లోనో వుంది. దాన్నెవ రూ ఆపలేరు... అణచలేరు!''

''చింతచచ్చినా పులుపు చావలేదంటే ఏవిటో తెలుస్తోంది మీ ధోరణి చూస్తోంటే. కొంపాగోడూ పరువూ ప్రతిష్ఠా పోయాక వూరికేం ఒరిగితే మనకేం, ఒరక్కపోతే మనకేం? వూరకే వుద్రేకపడితే పనులవ్వవు మాస్టారూ! నేనెందుకు చెప్పేనో కొస్త వినండి. ఇకపోతే మీరన్న ఉద్యమం వుంది చూశారూ- దాన్ని మొదలుపెట్టడం కష్టంగాని ఆపెయ్యడం చిటికెలో పని. బ్యాంకుకి బిల్డింగు దొరకని వ్వం. బ్యాంకు అక్కర్లేదని అర్జీలుపెడతాం. ఫ్యాక్టరీ వస్తే భోపాల్‌లోలా మా వూరు దుడుచు కుపోద్దని వదంతి పుట్టించి వూరేగింపులు తీయిస్తాం. మహిళా సంఘాలు వ్యభిచార కేంద్రాలంటాం. రోడ్లేస్తే పోలీసులు చీటికీమాటి కీ వచ్చి వేధిస్తారంటాం. అంతాగాకపోయినా కొందరైనా నమ్ముతారు. ఆ మాత్రం చాలు మా గొంతు పెద్దదని ఋజువు చెయ్యడానికి'' కాల్తో న్న సిగరెట్టుని కసిగా వేళ్ళతో నలిపేస్తూ అన్నాడు పానకాలు.

''చాలా పెద్ద ప్లానులో వున్నారన్నమాట''

''మీరు తింటున్నప్పుడు మేం తక్కువ తింటే బావుంటుందా?''

''ప్రజలు గొర్రెలు కాదు పానకాలూ''

''రామరామ- వాళ్ళని గొఱ్ఱెలనెందుకంటా నండీ... వాళ్ళు ఓటర్లు. పదిరూపాయల నోటు కీ సారాసీసాకీ గాలివాటుకీ మాయానినాదాలకీ ముద్రలు గుద్దేసే ఓటర్లు'' వ్యంగ్యంగా అన్నా డు.

''వాళ్ళే చాలామందికి గోరీకట్టి ఇంకెందరికో పట్టంకట్టారు. మరి రేపేం జేస్తారో ఎవరికి తెలుసు?''

''మీరు మాస్టారుకదూ... మీకు వాదించడం వచ్చు నాకు పనులు జరిపించుకోవడం వచ్చు. ఇంతకీ ఏమిటంటారు... ఇల్లూ పరువూ వదు లుకుని అభాగ్యపక్షుల్లా వూళ్ళట్టుకుని పోతారా? ఊరిగొడవలకో నమస్కారం పెడ తారా?''

''నీకు నమస్కారం పెడతాంగాని దయచె య్యి. ఇల్లుపోయినా పరువు పోయినా ఆఖరికి ప్రాణం పోయినా సరే చేబట్టింది వదలం. నమ్మినదాన్ని నట్టేటముంచం. వెళ్ళిక్క ణ్ణుంచి... ఇంకొక్క క్షణముంటే ఏంచేస్తానో నాకేతెలీదు''

ఉద్రేకంతో వూగిపోతున్న శారదని చూసి




అవాక్కైపోయాడు పానకాలు.

గుండెల్లో భీతి జనించగా తలెగరేసి వెళ్ళిపోయాడు విసురుగా.

"శారదా!" కళ్ళని కన్నీళ్ళు ముంచెత్తగా ఆర్తిగా ప్రేమగా అన్నారు మాస్టారు.

"అవునండీ... నేనూ పిల్లలూ ఏమైనా సరే మీరు నమ్మింది వదలొద్దు. మీ మార్గం నుంచి తొలగొద్దు. మీరేం దిగులుపడకండి- పుట్టింది మొదలు ఈ క్షణం వరకూ ఒకరికి ఉపకారమే చేశాంగాని అపకారం చెయ్యలేదు. మనకే దేవుడూ అపకారం తలపెట్టలేడండీ. భగవంతుడి మీద భారం వేసి నమ్మిన మార్గాన నడవండి గెలుపు మీదేనండీ... మీదే"

"శారదా" అక్కున చేర్చుకున్నారామెని.



కళ్ళు తుడుచుకుంటూ లోపలికెళ్ళిపోయింది సరిత.

★ ★ ★

రాయుడింటి ముంగిట దొంగల సంఘం సమావేశమయింది.

మునుపెన్నడూ లేనంతగా – ఊరంతా కదలి వచ్చినట్టుగా వచ్చారు జనం.

వారిని చూసి ముక్కుమీద వేలుంచుకున్నారు కొందరు. ఈ జన సముద్రం పొంగి తనని ముంచెత్తేస్తుందేమోనని ఒక్కక్షణం బెదిరాడు రాయుడు. సపోర్టుకోసమన్నట్టు పానకాలు వంక చూశారు. అంతా మనవాళ్ళే అన్నట్టు నవ్వేడతడు.

యధాప్రకారం పంతులు మాస్టారు అప్పుతీసుకోవడం నుంచి అప్పుతీర్చక పోవడం వరకూ అంతా చెప్పేడు. పావుకారుకి డబ్బు అవసరంగా వున్నందున వెంటనే అప్పు వసూలు చేసిపెట్టమని ఆయన తరపున సంఘాన్ని కోరాడు.

''మాస్టారూ... మీరేమంటారు?'' రాయుడిగా రడిగాడు.

''పంతులు చెప్పిందంతా నిజమే. మీరేం చెయ్యమంటే అది చెయ్యడానికి సిద్ధంగా వున్నాను''

''భేష్... సత్యసంధులని ఋజువుచేసుకున్నారు. మీలాంటివారు వూరికొక్కరుంటే దేశం గాంధీరాజ్యమయ్యేదంటే నమ్మండి. మీరీ సంఘపు తీర్పుకి కట్టుబడి వుంటారనీ ఆడి తప్పని అపరధర్మరాజనిపించుకుంటారనీ ఆశిస్తూ తీర్పు చెబుతున్నాం'' ఓ క్షణమాగి జనాన్ని పరికించి చూసి మెల్లగా అన్నాడు-

''మాస్టారి అప్పు దాదాపు పదిహేడువేలుంది. ఆయన ఇల్లు ఎనిమిది వేలు ఖరీదు చేస్తుందని అభిప్రాయపడుతున్నాం. అంచేత ఆ ఇల్లు పావుకారుకి రాసిచ్చేసి మిగతా సొమ్ముకి కొత్తగా ప్రోనోటు రాసివ్వాలి. ఆ సొమ్ము తీర్చేవరకూ వూరొదిలిపెట్టి వెళ్ళిపోవాలి. ఆయనకోరిన వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించే బాధ్యత నేను తీసుకుంటున్నాను...''

నడినెత్తిమీద పిడుగుపడ్డట్టు అనుభూతిచెందారు మాస్టారు. కన్నీళ్ళు చిప్పిల్లగా బాధగా, వేదనగా, అపనమ్మకంగా చూశారు.

వూరి బాగే తన బాగనుకున్నారు. అలా అనుకున్నందుకు బాగుకోసం తపిస్తున్నందుకు శిక్ష ఏమిటంటే గ్రామ బహిష్కరణ!

ఎంత బాగా ఇచ్చారు తీర్పు! కడుపులోని కుట్రనంతా బయటపెట్టుకుంటూ ఎంత చక్కగా పెద్దల సంఘాన్ని వుపయోగించుకుంటున్నారు!

విరాగిలా నవ్వేరు.

కానాయన గుండె సంచలనానికి గురయ్యింది. బడబాగ్నులు బద్దలవుతోంటే... మాస్టారు ''అమ్మా... అంటూ గుండెపట్టుకుని కూలబడిపోయారు.

''మేం ఒప్పుకోం... ఇదన్యాయపు తీర్పు, ఇది దారుణమైన, నీచమైన తీర్పు, తీర్పుపేరున చేసిన కుట్ర''

''ఇది నిజంగా దొంగల సంఘమే. వూళ్ళు పంచుకునే ఈ దొంగల సంఘాన్ని మేం గుర్తించం. ఈ అన్యాయాన్ని సహించం''

శివం, దీపికేకాదు ఎందరో యువకులు గొంతెత్తి అరిచారు. మరెందరో గొంతులు కలిపారు.

రాయుడి తీర్పువింటూనే ఆగ్రహోదగ్రులై గర్జించారెందరో.

కూలబడిన మాస్టార్ని చూసి దీపిక ముందుకొచ్చి ఫస్ట్‌ఎయిడ్ చేసింది. మరి కొందరాయన్ని చేతులమీద మోసుకుంటూ ఆసుపత్రికి తీసుకుపోయారామె మాట మేరకు.

క్షణాల్లో ఖాళీ అయిపోయిందా ప్రదేశమంతా.

బిక్కచచ్చిపోయారు రాయుడు. అటూఇటూ చూసి జారుకున్నాడు మాజీ మునసబు. నెత్తిబాదుకున్నాడు పావుకారు.

అప్పు గురించే మాట్లాడక వూరొదిలి పోవాలని రాయుడెందుకు లంకెపెట్టాడో అర్థంకాలేదు పావుకారుకు. దానివల్ల వూరందరికీ వ్యతిరేకమైపోయామే రేపట్నుంచి జనం దగ్గర అప్పులు వసూలు చేసుకోవడం ఎలాగా అని వాపోసాగాడాయన!

రంకెలేస్తూ విసవిసా వెళ్ళిపోయాడు రాయుడు. తోకాడించుకుంటూ అనుసరించా




డు పానకాలు.

హ్హూ హ్హూ - అని నవ్వబోయాడుగాని నవ్వు రాలేదు. దాంతో 'హ్హూ' అని హుంకరించాడు.

తలొంచేసుకున్నాడు పానకాలు.

''ఇలా జరిగిందేం... మనవాళ్లంతా ఎక్కడ చచ్చేరు?''

''ఇక్కడికొచ్చేదాకా నేను చెప్పినట్టు వింటానని తలలాడించారు. ఇక్కడి కొచ్చేక శివంగాడి మాటలకి గంగిరెద్దుల్లా తలలాడించేశారు. అయినప్పటికీ పబ్లిగ్గా ఎదురు తిరక్కపోదురు. కానీలోగా కొంపలంటుకుపోయినట్టు మాస్టారికి గుండెనొప్పి రావటం కూలిపోవటంతో సానుభూతి వచ్చేసింది''

''ఇప్పుడెలాగ? అనవసరంగా ఇరుక్కుపోయాం. వూరందరి దృష్టిలో చులకనైంపోయాం. ఇక రేపట్నుంచి వాళ్లకి పట్టపగ్గాలుంటాయా?''

''ఇలాటి ఢక్కామొక్కీలు ఎన్నో తిన్న మీరే ఇలా మాట్లాడ్డం...''

''ఏమైనా ఇక మనమూ, మన పాతపద్ధతులూ లాభంలేదు. కొత్త టెక్నిక్కులు కావాలి. కొత్త నాయకత్వం కావాలి. ప్రభాకర్ని పిలుస్తాను''

''బ్రహ్మాండం... మన ప్రభాకర్ కూడా మాస్టారి శిష్యుడేగనుక ఎడాపెడా నరుక్కొచ్చేస్తాడు''

''చూద్దాం'' అన్నారుగాని అంతా అపనమ్మకంగా వుంది రాయుడికి.

ప్రభాకర్ కూడా మాస్టారి శిష్యుడే అయినా ఏ విషయంలోనూ ఎవరూ అతణ్ని ఆశ్రయించలేదింత వరకూ. బహుశా వూరిని బాగు చెయ్యమని మాస్టారు మొదటొచ్చి అడిగినా పట్టించుకోలేదని కోపం కాబోలు. ఏమైనా తాము అక్కడే తప్పటడుగు వేశారు. ఆయన మాట విని ఏవో చిన్నవో చిటికెవో పనులు చేయించివుంటే ఇవాళింతటి ప్రళయం వచ్చేదికాదు.

పరిపరివిధాల మధనపడసాగాడు!

★ ★ ★

ముఖ్యసేవికా గ్రామసేవికా తిన్నగా దీపిక దగ్గరికొచ్చారు. కానుని పంపి శివంని పిలిపించిదామె.

నమస్కారాలూ- కాఫీలూ అయ్యాక- ''బడిలో మహిళల్ని సమావేశ పరుస్తాను. ఇంకో అరగంటలో బడి వదిలేస్తార్లేండి. ఈలోగా అందరికీ కబురందిస్తాను'' అంది.

''మేమోసారి సర్పంచిగార్ని కలిసొస్తాం'' యమ్మెస్ అంది.

''అలాగే కానీ మీరక్కణ్నుంచే తిరిగెళ్ళిపోవాల్సొస్తుంది. ఆయనకి సంఘాలూ, కార్యక్రమాలూ పడవు''

''మేం సమితి వుద్యోగులంకదండీ! ఆయనక్కోపం వచ్చి మండలాధ్యక్షుడికి చెబితే...''

''మీకేమీకాదు– పంచాయతీరాజ్ శాఖలోని ఉన్నతాధికారి సుందర్రావుగారు మా వూరివారే. ఆయన బీడీఓగారికి లెటర్రాసినందునే మిమ్మల్ని వీడీఓని అందర్నీ మా వూరిని పట్టించుకోమని చెప్పేరు. ఇప్పుడు కూడా మీరు పట్టించుకోకపోతే... మీ ఇష్టం మరి''

కాస్సేపు గునిసివూరుకున్నారు.

శివం మాస్టారి దగ్గరికెళ్ళి చెప్పేడు.

నీరసంగా పడుకుని వున్నవారల్లా లేచి ''శారదా.... చొక్కా అందుకో'' అన్నారు.

''మీరు చాలా వీక్గా వున్నారు. మీర్రావద్దు మాస్టారూ - మీరే మాత్రం ఆవేశపడినా ప్రమాదమే...'' వారించాడతడు.

''ఫరవాలేదోయ్... పక్కనే డాక్టరమ్మ వుంది కదా''

''శివం వున్నాడు. దీపిక వుంది. మిగతావాళ్ళున్నారు. ఇలాటి పరిస్థితిలో మీరెళ్ళకపోతే ఏం?'' శారద అంది.

''వెళ్ళాలి. ఇంకెన్నాళ్ళుంటానో ఏమో. ఉన్నన్నాళ్ళూ ఏదో ఇలాగ... బండి నడిచినా నడవకపోయినా చక్రాలు తిరిగితే – అదో తృప్తి!'' నవ్వేరు.

''మీరలా మాట్లాడొద్దు మాస్టారూ! మీరు నూరేళ్ళు నిండుగా బతకాలి.

కన్నీళ్ళు పొంగిరాగా అక్కడినుంచి వెళ్ళిపోయింది శారదమ్మ!

''నూరేళ్ళ సంగతేమోగాని అనుకున్నవన్నీ ఓ కొసకొచ్చేదాకా బతుకుతాను'' చొక్కా తొడుక్కుంటూ అన్నారు.

రాత్రి ఘటన తాలూకు ప్రభావం ఆయన మెదడు మీద ఉధృతంగా పడిందని గ్రహించి మౌనం వహించాడు శివం. దీనంతటికీ కారకుడైన రాయుణ్ని కత్తికో కండచొప్పున నరకాలనుంది - అప్పుడు గాంధీ ఆత్మ కూడా శాంతిస్తుందనిపించింది!

"అలా వున్నావేం శివం?"

"గాంధీ గుర్తొచ్చాడు మాస్టారూ"

"చాలా హుషారైన కుర్రాడు. అర్థాంతరంగా ఆయుష్షుమూడకపోయి వుంటే నీకు చేదోడుగా వుండును"

"గాంధీ ఆయుష్షు మూడించినవారి ఆయుష్షు మూడించాలి!"

చిత్రంగా చూశారతడి వంక. "అలా ఎప్పుడూ ఆలోచించకు శివం! పగ, ద్వేషం మనిషిని ఎదగనివ్వవు ఏదైనా మంచితో, మమతతో సాధించాలి తప్ప వాటితోకాదు"

"రాయుడిలాంటి రాక్షసుల్లో పరివర్తన సాధ్యమేనంటారా?"

"అసంభవం మాత్రం కాదు"

"సరే - పదండి టైమవుతోంది"

వీళ్ళు వెళ్ళేసరికి చాలామంది మహిళలొచ్చివున్నారు. దాదాపు నలభై మంది వుండొచ్చు. వారిలో అన్నిరకాల వయస్సులవాళ్ళూ వున్నారు. కొద్దోగొప్పో చదువుకున్నవాళ్ళూ, అసలేమీ చదువుకోనివాళ్ళూ కూడా వున్నారు.

పెళ్లికో పేరంటానికో తప్ప ఎన్నడూ ఇలా మహిళలంతా సమావేశమవడం ఎరగరేమో- అందరికీ కొత్తగానూ వింతగానూ కలవరంగానూ వుంది. ఇది అందరి బాగుకోసమని అంతా - ముఖ్యంగా డాక్టరమ్మ చెప్పింది గనుక మరేమీ ఆలోచించకుండా వచ్చేశారు. రత్నమాల సంగతిసరేసరి. తనొక్కతే పదిమందికి నచ్చజెప్పి తీసుకొచ్చింది.

వాళ్ళందర్నీ చూసేసరికి మాస్టారికి చాలా ఉత్సాహం వచ్చింది. దీపిక వారించినా వినకుండా ప్రసంగించారు.

"మీరంతా ఇలా ముందుకొచ్చి సంఘటితం కాబోతున్నందుకు చాలా ఆనందంగా వుంది. మీలో ఈ చైతన్యం తీసుకురావడానికెక్కారకులైన ప్రతి ఒక్కరికీ చెయ్యెత్తి నమస్కరిస్తున్నాను. ఈ సంఘం అన్నది ఎక్కణ్నుంచో వూడిపడలేదు. మీ అందరి కలయికే సంఘం. అంచేత మీ మంచిచెడ్డలూ బాగోగులూ మీ కృషి మీదా, దీక్ష మీదా ఆధారపడి వున్నాయి. సంఘాన్ని సవ్యమైనరీతిలో ఉపయోగించుకుని ఉన్నత స్థితికెదుగుతారని ఆశిస్తున్నాను. వీటితోబాటు వయోజన విద్య కూడా చేబట్టాలని వుంది మీలోని చదువులేనివారందరికీ ఎంతో కొంత చదువు నేర్పాలని వుంది. మగవాడు చదువుకుంటే అతడి విజ్ఞానం అతడికే పరిమితమవుతుంది. స్త్రీ చదువుకుంటే ఆమె విజ్ఞానం కుటుంబమంతటికీ చెందుతుంది. ఈ సంగతి గుర్తు పెట్టుకోవాల్సిందిగా నా మనవి"

శివం ముక్తసరిగానే అయినా ఉద్రేకంగా మాట్లాడాడు– "ఇన్నాళ్ళూ మన వూరివంక కన్నెత్తిచూడని అధికార్లూ అభివృద్ధి కార్యక్రమాలూ ఇవాళ మన మీద అభిమానం కురిపిస్తున్నాయంటే అందుక్కారణం మనమూ మన కృషీ మన పట్టుదలా. వీటన్నిటినీమించి మన ఐకమత్యం. మనమంతా కలిసి కృషిచేస్తే ఏమైనా సాధించుకోవచ్చు. మహిళా సంఘం మహిళాభ్యున్నతికి ఎన్నిరకాలుగా ఉపయోగపడగలదో డాక్టర్ దీపిక వివరిస్తారు"

"సభకి వందనం. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అన్నారు పూర్వం. అంటే స్త్రీ స్వాతంత్ర్యానికి అనర్హురాలు. కేవలం బానిసలాపడి వుండాలన్నారు. ఇంకొందరు స్త్రీ పురుషుడి ఆస్తి అన్నారు. తర్వాతి కాలంలో స్త్రీకి చదువు నిషేధమన్నారు. ఆ మధ్య చనిపోయిన భర్తతోబాటు సహగమనం చెయ్యాలన్నారు. నిన్నగాక మొన్న వితంతువులు వీధి మొఖం చూడరాదనీ, మళ్ళీ పెళ్లి తలపెట్టరాదనీ కట్టడిచేశారు. ఇవాళ కట్నం కోసం సజీవదహనం చేస్తున్నారు.

ఇదంతా ఎందుకు జరుగుతోంది? అప్పుడూ ఇప్పుడూ కూడా స్త్రీనే ఎందుకు అణగదొక్కాలని చూస్తున్నారు? మగవాడికక్కర్లేని నీతులూ నియమాలూ సాంప్రదాయాలూ స్త్రీకే కావాలనెందుకు ఘోషిస్తున్నారు?

మనది పితృస్వామిక సమాజం కావటంవ




# హితవు ముత్యాలు

★ ఒక వస్తువుకైనా, ఒక వ్యక్తికైనా మనమిచ్చే విలువ ఆ వస్తువు స్వతఃసిద్ధ గుణంపైగాని, ఆ వ్యక్తి స్వతఃసిద్ధమైన స్వభావం పైకాని ఆధారపడి ఉండదు. మనకూ దానికి లేదా మనకు- అతనికి మధ్యఉన్న అనుబంధంపై ఆధారపడి ఉంటుంది.

— నార్ల

★ దేశంకోసం ప్రాణాలర్పించమనే నీతిబోధలే లోక సంగ్రామాల్ని కలిగిస్తాయి. అందుకే దేశభక్తి కాదు, మానవత్వం కావాలి.

— చలం

★ అధికారంలోని కష్టం అధికారంలో ఉన్న వారినడుగు. అధికారంలో ఉన్న సుఖం, దాని కోసం అర్రులు సాచేవారినడుగు.

— చార్లెస్ కాలెబ్‌కోల్టన్

★ ఒకడు నిన్ను ఒకసారి మోసగిస్తే అది వాడి తప్పు. రెండుసార్లు మోసగిస్తే అది నీతప్పు.

— రుమేనియా సామెత

★ కష్టగట్టి, వగసాధించాలని పట్టుబట్టడంకన్నా ఉపేక్షించి ఊరుకున్నప్పుడు, తనకు అపకారం జరిగినా క్షమించి ఊరుకున్నప్పుడు, మానవాత్మ మహోన్నత్యం ప్రస్ఫుటమవుతుంది.

— ఛాపిన్

★ తమ లోపాన్ని నిజాయితీగా ఒప్పుకొనేవారిని వదిలివేయాలి. గేలిచేయడం పశు స్వభావం.

— ఎర్ల్‌ఆఫ్ ఛెస్టర్‌ఫీల్డ్

★ మృత్యుముఖంలో ఉన్నప్పుడు, డబ్బు చేయలేని పని ఒకటున్నదని ధనవంతుడు మొదటిసారి గ్రహిస్తాడు.

— కోల్టన్

★ ఏ విషయంలోనైనా విజయం సాధించే వరకు ఉత్సాహంగా ఉంటుంది. ఆ తరువాత పక్షివదిలిన గూడులా మనస్సు చిన్నబోతుంది. సాధించిన విజయం నిన్నటి జ్ఞాపకమవుతుంది.

— బీచర్

★ నిజమైన స్నేహం ఏర్పడేందుకు చాలాకాలం పడుతుంది. తాటాకు మంటలా క్షణంలో ఏర్పడే స్నేహాలు క్షణంలో చల్లబడిపోతాయి.

— ఎర్ల్ ఆఫ్ చెస్టర్ ఫీల్డ్

★ ఎవరూ చూడనప్పుడు ఎలా ప్రవర్తిస్తావో అదే నీ నిజమైన స్వభావం.

— మూపీ

★ మనసు నిర్మలంగా ఉంటే అన్ని దుఃఖాలు పోతాయి. సంతోషంతో ఉన్నవాడి బుద్ధి స్థిరంగా ఉంటుంది.

— గీత

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

ల్ల! మనం ఆర్థికంగా అస్వతంత్రులం గనుక! ఛాందసమత భావాలూ మూఢవిశ్వాసాలూ మన మెదళ్ళకి సంకెళ్ళు వేశాయి గనుక!

నిజానికి మగాడికన్నా స్త్రీ ఏరకంగానూ వెనుకబడిలేదు. కళ్ళుతెరచి చూస్తే ఈ నిజం అందరికీ కన్పించితీరుతుంది. అదీ ఇదీ అని కాదు అన్నిరంగాల్లోనూ మహిళలు ఈనాడు ముందంజవేస్తున్నారు. ఎందరెందరో వనిత లు దేశ విదేశాల గౌరవాభినందనలు అందు కుంటున్నారు. వాళ్ళ స్ఫూర్తితో మనం ముంద డుగువెయ్యాల్సిన అవసరం ఎంతోవుంది. అప్పుడే స్త్రీ శక్తిస్వరూపిణి అని రుజువుచెయ్య గలం.

'ఇప్పుడు మనమంతా కలిసి మహిళా సంఘం స్థాపించబోతున్నాం. దీనిని రిజి స్ట్రేషన్ కూడా చేయించబోతున్నాం. ఈ సంఘంద్వారా మనం మిషను, కుట్లు, అల్లిక లూ, లేసూ వగైరాలెన్నో మన ఆసక్తినిబట్టి నేర్చుకోవచ్చు. స్వతంత్రంగా మిషన్లూ వగైరా లు కొనుక్కోడానికి బ్యాంకుద్వారా అప్పు ఏర్పా టుచేయబోతున్నాం. ప్రభుత్వంనుంచి కొంత సబ్సిడీ సంపాదించబోతున్నాం. ప్రతి ముడిస రుకూ సంఘంతరపున కొని సంఘంతరపున అమ్మాలన్నది మా ఆశయం. ఆరకంగా మీ రంతా ఎంతోకొంత సంపాదించుకోడానికి సంఘం తోడ్పడుతుంది. ఇది మధ్యతరగతి మహిళలకి వేణ్ణీళ్లకి చన్నీళ్ళలా తోడ్పడు తుందని ఘంటాపథంగా చెప్పగలను.

పిల్లల పెంపకంగురించీ, కుటుంబ సంక్షే మంగురించీ, గర్భిణీస్త్రీలు తీసుకోవాల్సిన జా గ్రత్తలగురించీ, స్త్రీల వ్యాధులగురించీ మీ రంతా తెలుసుకోవాలి''.

...తర్వాత ముఖ్యసేవిక ఏయే గ్రామాల్లో ఇలాటి సంఘాలున్నాయో, అవెలాటి కార్యకలా పాలు సాగిస్తున్నాయో వివరించింది. ఆ గ్రా మంలో కుట్లూ వగైరాలు నేర్పించడానికి ఏమేం ఏర్పాట్లుచేస్తున్నదీ చెప్పి మీరంతా కలిసివస్తే, దీక్షగా కృషిచేస్తే సమితినుంచి మరిన్ని గ్రాంట్లు సంపాదించుకోగలమనీ, ఎంతో సాధించుకోవచ్చని చెప్పింది.




అనంతరం సరిత అధ్యక్షురాలుగా, రత్న మాల సెక్రటరీగా, దీపిక సలహాదారుగా మహిళాసంఘం ఏర్పడింది.

ఇంటిముందు కారు ఆగటంతో బయటికొ చ్చారు మాస్టారు.

గిరిధర్!

''నువ్వటోయ్- రారా''

''నమస్తే, మాస్టారూ''

''శారదా... గిరి వచ్చాడు- మంచినీళ్ళు పట్రా''

చల్లని నీళ్ళు తెచ్చిస్తూ ''బాగున్నావా గిరీ... అమ్మాయిఏంచేస్తోంది'' అనడిగింది.

''బాగానే వుందండి. నాతోబాటొచ్చి మిమ్మ ల్ని కలుద్దామనుకుందిగాని కుదర్లేదు''

''ఈసారి తప్పకుండా తీసుకురా''

''అలాగేనమ్మా! క్రితంసారొచ్చినప్పుడు కలుసుకోలేకపోయాను. మీరప్పుడు సరిత గొడ వలో వున్నారు. అన్నట్టు సరితకెలావుంది మాస్టారూ?''

''బాగానేవుందయ్యా... ప్రస్తుతం ఇక్కడే వుంది''

సరితవచ్చి పలకరించింది.

''కేసు అయినట్టుంది'' కుశలప్రశ్నల య్యాక అడిగాడు.

''కోర్టులో నడుస్తోంది గిరీ. సరిత స్టేట్ మెంట్మీద అత్తగార్నీ, అల్లుణ్నీ అరెస్ట్చేసి తర్వాత బెయిలు మీద వదిలారు'' మంచిపని చేశారు. అలాటివాళ్ళని క్షమించటంకూడా పాపమే''

''ఆ గొడవలకేంగాని మావగారిచేత మనూ ళ్ళో ఫ్యాక్టరీ పెట్టిస్తున్నావట కదా- నాన్నగారు చెప్పేరు. నువ్వింతవాడివైనందుకు చాలా సంతోషంగావుంది'' సరిత అంది.

''దానిగురించి మాస్టారితో మాట్లాడదామనే వచ్చానమ్మా! మనూళ్ళో ఫ్యాక్టరీ నిర్మాణానికి ప్రభుత్వ అనుమతి లభించింది మాస్టారూ! ఓ.యన్.జీ.సీతో కూడా అగ్రిమెంటు రాసుకోబో తున్నాం. ఇక ఫ్యాక్టరీకి బీట్లో స్థలం కేటాయిస్తా మని కలెక్టర్ వాగ్దానంచేశారు. అది ఈవారంలో ఫైనలైజ్ అవుతుంది. కాని కొంత రాయుడి గారి భూమికూడా కేటాయించబడుతుంది. అందుకని ఆయన్నుండేమైనా ప్రతిఘటనొ

స్తుందేమోనని అనుమానంగావుంది. పైలెవెల్లో మేనేజ్‌చేసుకుంటామనుకోండి. కాని వూళ్లో నే...''

''ఇది ఆలోచించాల్సిన విషయమే. బీట్లోని భూమి వేస్ట్‌గాపడివుంది గనుక సాధారణంగా అభ్యంతరపెట్టకూడదు మరి. ప్రభుత్వం కేటాయించినప్పుడు ఏమనగలరుచెప్పు? ప్రభుత్వంరేటు చెల్లిస్తారుకదా''

''కోర్టుకెక్కి గొడవచెయ్యకుండా వుంటే ఫ్యాక్టరీ పని వేగంగా పూర్తిచెయ్యాలని మా ప్లాన్. ఇతర ఏర్పాట్లన్నీ చకచకా పూర్తవుతున్నాయి''

''శివంతోకూడా మాట్లాడదాం. వస్తే రాయుడి దగ్గర్నుంచేమైనా వ్యతిరేకత రావాలిగాని ఇంకెవరి దగ్గర్నుంచీ రాదు. అంతవరకూ హామీ ఇవ్వగలను''

''మీ ఆశీర్వాదంవుంటే చాలు మాస్టారూ- అన్నీ సవ్యంగా జరిగిపోతాయి''

''నాదేముందయ్యా అంతా మీకృషి. పట్టుదల. ఆపైన దైవబలం. ఫ్యాక్టరీలో నాన్‌టెక్నికల్ ఉద్యోగాలకి స్థానికులకి ప్రాముఖ్యతిమ్మని మీ మావగారికి చెప్పు గిరీ''

''తప్పకుండా మాస్టారూ... వర్కర్స్‌కాలనీ కోసం వూరికి మరో పక్కన స్థలంతీసుకుందామనుకుంటున్నాం. దాంతో వూరికి కొత్తరూపం రావటం ఖాయం''

''మీలాంటి యువతే ఊరినీ, దేశాన్నీ కూడా పచ్చనిభూమిగా చెయ్యగలరయ్యా''

ఆయన మాటల్లో ధ్వనించిన విశ్వాసానికి కదిలిపోయాడు గిరిధర్.

★ ★ ★

షావుకారు నరసింహం కొడుకు సుదర్శనంతో వూళ్ళో మారుతోన్న పరిస్థితుల గురించి రాత్రి పొద్దుపోయేవరకూ చర్చిస్తూండిపోయాడు.

''రాయుడి పని అయిపోయినట్టే నాన్నా! ఆయన్తో లంకెపెట్టుకోకుండా మాస్టార్ని మంచి చేసుకోవడమే లాభం. ఎరువుల ఫ్యాక్టరీకి సంబంధించిన చిన్న చిన్న కాంట్రాక్టులు తీసుకుందామని వుంది. ఆయన సిఫారసుచేస్తే మనకి తేలిగ్గా వస్తాయి''

''అతగాణ్ని దొంగల సంఘంలోకి లాగి నానా యాగీచేశాక మళ్ళీ ఏమొఖంపెట్టుకుని పక్కన కూర్చోమని పిలవగలంరా!''

''ఏదో దారిచూడాలి. ఇవాళోరేపో బ్యాంకు వచ్చేస్తుందిగనుక ఇక వడ్డీ వ్యాపారానికి నూకలుచెల్లినట్టే''

''నీవన్నీ అనవసర భయాల్రా! ఎంత బ్యాంకైతే మాత్రం ఎంతమందికని అప్పిస్తార్రా? నెత్తిమీద జుట్టులేనివాడికల్లా అప్పిచ్చేసి ఏడాదిలోపల దివాళాతీయకపోతే నన్నడుగు''

''ప్రభుత్వ బ్యాంకుకదా!''

''అందుకనేరా- ఎవరికీ బాధ్యత వుండదు. అత్తసొమ్ము అల్లుడు ధారబోసినట్టు చేసేస్తారు చూడు. ఏ ప్రభుత్వరంగ సంస్థ తిన్నగా ఏడ్చింది చెప్పు?''

''అలా తీసిపారెయ్యకు మరి. జాతీయం చేశాక బ్యాంకుల పద్ధతుల్లో చాలా మార్పొచ్చింది...'' అంటూ ఏదో చెబుతోంటే వీధి తలుపు చప్పుడయింది.

''అర్ధరాత్రివేళ ఎవరైవుంటారబ్బా?''

మళ్ళీ తట్టారు.

షావుకారు ''కిటికీలోంచి చూడ్రా'' అన్నాడు.

వెళ్ళి కిటికీ తెరచి చూశాడు సుదర్శనం.

ఎవరో ఒకతనువున్నాడు చీకట్లో.

''షావుకారుగారున్నారా!?''

''లేరు... ఏంపని?

''ఆయన్తో పనుందండి''

''నేను వారబ్బాయినే. పనేమిటో చెప్పు''

''దొంగబంగారముందండి''

''ష్... నెమ్మది. నిన్నెవరూ చూళ్ళేదుకదా?''

''లేదుకానండి- షావుకారుగారొచ్చేక వస్తానండి''

''ఉన్నార్లేగాని తలుపు తీస్తానుండు''

దొంగబంగారం చవగ్గా కొనే సుదర్శనం తలుపుతీశాడు. ఆగంతకుడు లోపలికొస్తూనే పిస్తోలు తీసి అతడికి గురిపెట్టాడు. అంతవరకూ చాటున నక్కిన నలుగురు ముసుగు వ్యక్తులు గబగబా లోపలికొచ్చి తలుపులేసేశారు.

ఊహించని ఘటనకి అదిరిపడ్డాడు. అవా

క్కై పిచ్చిగా చూస్తూండిపోయాడు సుదర్శనం.

"లోపలికి నడు"

"వచ్చిందెవరా" అంటూ వచ్చిన షావుకారు ఆగంతకుల్నిచూసి ఒక్క అరుపు అరిచి లోపలి తలుపేసేసుకోబోయారు గాని ఆయన ఆటలు సాగలేదు.

తండ్రీకొడుకుల నోళ్ళూ చేతులూ బంధించేసి ఇనప్పెట్టె గదిలోకి తీసుకెళ్ళారు. నరసింహం చేతికట్టువిప్పి ఆయనచేతే ఇనప్పెట్టె తెరిపించారు.

"ఊరోళ్ళు రాసిచ్చిన ప్రోనోట్లూ దస్తావేజులూ అన్నీ బయటికితియ్యి" ఉరిమాడో యువకుడు.

తీయక తప్పలేదు.

ప్రోనోట్లని గుట్టుగా పోసి కిరసనాయిలు దీవంలోంచి కిరసనాయిలు పోశారు. అగ్గిపెట్టె ఇచ్చి "వెలిగించు" అన్నాడు.

బావురుమన్నారు తప్ప అగ్గిపెట్టె అందుకోలేదు.

తుపాకి మడమతో ఒక్కటేశారు. తలబొప్పికట్టింది. అయినానరే "నా ఆస్తి— నా డబ్బు... హూ ఊ... నేను అంటించను... అంటించలేను...!" అని ఏడ్చారు.

"అయితే కొడుకు చితికి నిప్పెడుదువుగాన్లే" అని సుదర్శనానికి తుపాకి గురిపెట్టారు.

"వద్దొద్దు... ఒక్కగానొక్కడు. నావంశోద్ధారకుణ్ని చంపకండి. మీరు చెప్పినట్టే చేస్తాను"

అప్పుపత్రాలన్నీ అగ్నికాహుతైపోయాయి.

"ఊరోళ్ళ తాకట్టు బంగారమూ వెండీ దస్తావేజులూ మూటకట్టెయ్యి"

"వూహూ... ఇవ్వను. ఊరోళ్ళు బతకనివ్వరు. చంపేస్తారు. మీకాళ్లకి మొక్కుతాను. నన్నింక వదిలెయ్యండి"

"అవి వూరోళ్ళకి వాపసిచ్చేస్తాంరా బద్మాష్! త్వరగా మూటకట్టు"

కట్టేక దాన్నొకరు భుజానవేసుకున్నారు.

"నీ డబ్బూ బంగారాలు వేరేగా మూటకట్టు"

"నన్ను నిలువునా దోచి బికారిని చేసెయ్యకండిబాబూ..." భోరుమని ఏడ్చేశారు.

కాని వాళ్ళొదల్లేదు.

ఇంకోమూటకూడా అందుకున్నారు.

"ఇన్నాళ్ళూ అప్పురూపేణా చక్రవడ్డీ రూపేణా ఎందరి రక్తమో తాగావు. ఎందరి శ్రమనో దోచావు. దానికివాళ నీ రక్తంతో పరిహారం చెల్లించాలి. దీనివల్ల అశాంతితో ఆకలితో అనువులుబాసినవారి ఆత్మలన్నీ శాంతించేట్లు నీ రక్తాన్ని తర్పణచెయ్యాలి. నీ విషపుగోళ్ళు దిగి విలవిల్లాడుతూ చనిపోయినవారు ఆఖరిక్షణాల్లో పడ్డ నరకయాతనని నువ్విప్పుడు చవిచూడాలి. షావుకారూ కాచుకో..."

తుపాకి ఎత్తారు.

వజవజా వణకిపోయారు తండ్రీకొడుకులు.

"చంపొద్దు... చంపొద్దు..." అందరికాళ్ళూ పట్టుకుని బతిమాల్తూ గుండెలు పగిలేలా రోధించసాగారు.

"అందర్నీ నిలువుగా దోచినప్పుడు గాని, దొంగల సంఘం ముసుగులో నాశనంచేసినప్పుడు గాని ప్రాణభయం అంటే ఏమిటో, ఎలాటిదో

తెలీలేదుకదూ! మాస్టార్ని ఊరిడిచి పొమ్మన్నప్పుడు ఊరిమీద మమకారమంటే ఏమిటో తెలీలేదుకదూ! అందరి ఆస్తులూ కొల్లగొట్టుకుని జీవశ్చవాలని చేసినప్పుడు బతుకు తీపి అంటే ఏమిటో తెలీలేదుకదూ! ఇప్పుడు తెలుస్తాయవన్నీ - జన్మజన్మలకీ గుర్తుండే పాఠంచెబుతాం. షావుకారూ ... బీరెడీ"

తుపాకి మూడుసార్లు పొగలు కక్కింది!

నరసింహం ఆర్తనాదాలకి ఆ పాతలోగిలి కంపించింది!

దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేసుకుంటూ ఊరు మధ్యనుంచి వాళ్లు నడిచెళ్తోంటే ఇళ్ళల్లోని ఆడామగా భయంతో వణికిపోయారు.

ఏమయ్యిందో ఏమవుతోందో అర్థంగాక అరచేతుల్లో ప్రాణాలుంచుకుని కిటికీలు సైతం బిగించుకునుండిపోయారు.

ఆ అయిదుగురూ మాస్టారింటికెళ్ళి తలుపుతట్టారు.

మాస్టారు తలుపు తీసి చేతి లాంతరు పైకెత్తి చూశారు.

ముసుగులో భార్గవ!

"భార్గవా .... నువ్వా?"

"నేనే మాస్టారూ- లోపలికి పదండి..."

అలికిడికి లేచొచ్చిన శారద భార్గవని చూసి మ్రాన్పడిపోయింది.

"నువ్వా భార్గవా- ఆఖరికిలా... మీ అమ్మా నాన్నా దుఃఖంతో ఎంత కుళ్ళిపోతున్నారో తెలుసా నాయనా?"

"వాళ్ళలాంటి కోట్లాది జనం దుఃఖాన్ని చూస్తున్నాను. వాళ్ళని నిలువునా దోచేస్తున్న దొరల విలాసాల్ని చూస్తున్నాను. ఈ దోపిడీ వ్యవస్థని నిర్మూలించి సమసమాజస్థాపనా యజ్ఞంలో నన్ను సమిధగా అర్పించుకున్న నాకు ప్రతి అభాగ్యుడిలోనూ, ప్రతి అన్నార్తుడిలోనూ మా అమ్మా నాన్నా కన్పిస్తున్నారమ్మా!"



"మాస్టారూ! ఊరికి పట్టిన గ్రహణం విడిచింది. షావుకారిపీడ తొలగించేశాం. ఆయన దగ్గరున్న ఋణపత్రాలన్నీ దహనంచేసేశాం. ఇవిగో ఈ మూటలో ఊరిజనం తాకట్టుపెట్టిన ఆభరణాలూ, దస్తావేజులూ ఉన్నాయి. వాటన్నిటినీ ఎవరివి వాళ్ళకి అప్పజెప్పే బాధ్యత మీకప్పగిస్తున్నాం"

"అంటే షావుకార్ని..."

"ఖతం!"

"హే రామ్!" చెవులు మూసుకున్నారు.

"వేలగొడ్లు తిన్న రాబందు అయినా ఒక్క గాలివానకి ఎగిరిపోతుంది!"

"చిన్నప్పుడోసారేం జరిగిందో నీకు గుర్తుందా భార్గవా! అమ్మవారి తీర్థానికి మీ ఇంట్లో కోడిపెట్టని బలిచ్చారు. కోడిని కొయ్యటం, అది విలవిలా తన్నుకోవడం చూసి స్పృహతప్పి పడిపోయావు. అలాటి నువ్వు ఇవాళ మనుషుల్నెలా చంపగలుగుతున్నావు? అంత కఠినుడిగా ఎలా మారావు భార్గవా?" ఆవేదనతో దహించుకుపోతూ అడిగారు.

"అడుగడుగునా జరిగే దోపిడిలే నన్నిలా మార్చాయి. నా దేశజనం కష్టాల్ని తొలగించడానికి వారి కన్నీరు కొంతైనా తుడవడానికి మరి గత్యంతరం లేదు మాస్టారూ! అయినా మేం చంపుతున్నది మనుషుల్నికాదు- క్రూరమృగాల్ని, రాక్షసుల్ని. ఇది తప్పువనీ కొత్తవనీ కాదు మాస్టారూ - అనాదినుంచీ వస్తోన్న న్యాయమే. మీరు చెప్పిన పురాణ కథలన్నీ ఒక్కసారి గుర్తుతెచ్చుకోండి. దేవుడెన్నో అవతారాలెత్తాడు దుష్టశిక్షణార్థం. ఎవర్నైనా మంచిమాటల్తో చేష్టల్తో మార్చిన ఘటనలున్నాయా - లేవు మాస్టారూ! అందర్నీ చంపేశాడు లేదా నామరూపాల్లేకుండా అణగదొక్కేశాడు. వాళ్ళకదే తగినశిక్ష మాస్టారు. మేం చేస్తున్నదీ అదే! రావణ్ణుడ్ని చంపిన రాముణ్ని దేవుడంటూ పూజించే ఈ ఊరూ, ఈ దేశం మమ్మల్ని దేశద్రోహులనడం న్యాయమా మాస్టారూ? పైగా రాముడు స్వార్థంకోసం చంపేడు. మేం జనంకోసం చంపుతున్నాం!"

"రాముడు ఒకరాజు. అన్యాయాన్ని శిక్షించడం అతడి బాధ్యత. కానిక్కడ రాజువి నువ్వూ, నేనూ కాదు. ఇక్కడో ప్రభుత్వమూ చట్టమూ ధర్మమూ ఉన్నాయి. వాటిని కాదని నీలా ప్రతివాళ్ళూ చట్టాన్ని చేతుల్లోకి తీసుకుంటే దేశం అరాజకమూ, అల్లకల్లోలమూ అవుతుంది."

"అదంతా పుస్తకాల భాషేగాని వాస్తవ ఘోషకాదు. చరిత్ర పుస్తకాల్లోని పదాలకీ, దేశచరిత్రచెప్పే అర్థాలకీ ఎక్కడా పోలికాపొంతనా ఉండదు మాస్టారూ! మన చట్ట నిర్మాతలు ఎలాటివాళ్ళో చరిత్ర ఏమిటో వాళ్ళెవరి కొమ్ము కాస్తున్నారో లోకానికంతటికీ తెలును మాస్టారూ"

"చూడు భార్గవా ... నీవేడినెత్తుర్నీ, అన్యాయాల్ని సహించలేని నీ ఆవేశాన్నీ అందరికీ మేలు చేయాలన్న నీ ఆరాటాన్నీ నీ త్యాగాన్నీ నేనర్థం చేసుకోగలను. కాని నువ్వు నాణేనికో పక్కనే చూస్తున్నావు. కొన్ని ఉదాహరణలతో నిన్ను నువ్వు సమర్థించుకుంటున్నావు. ఎవరికో అన్యాయం జరిగిందని ఎవరో ఎవర్నో దోపిడీ చేశారని ఆవేశంతో ప్రజ్వరిల్లుతున్నావు తప్ప విచక్షణతతో ఆలోచించటంలేదు..."

"పొరబాటు మాస్టారూ ... మన ఊరిదొంగల సంఘం భాగోతం మీకు తెలిసిందే. మా నాన్నకన్యాయం చేసినప్పుడు నా రక్తం మరగలేదు. కాని మీకు- మీకు గ్రామబహిష్కరణ విధించారని విని నిలువలేకపోయాను"

"ఇలా ఎంతమందిని ఎంతకాలం చంపగలవు భార్గవా? నువ్వూ నీ మిత్రులూ నీతో ఏకీభవించేవాళ్ళంతా కలిసి ఎంతమంది ఉంటారు? దేశపు సైనిక, పోలీసుబలగం ముందు మీరెంత? వాళ్ళు తలచుకుంటే మిమ్మల్ని మసిచెయ్యటం ఎంతసేపు? అంతెందుకు జనాన్ని కాదన్న ఏ ఉద్యమమూ సఫలంకాదు. మిమ్మల్ని మీ పంథానీ బలపరిచే జనం ఎంతమందుంటారో ఒక్కసారి ఆలోచించు. దేశంకోసం ప్రాణాలర్పించగల తెగువ, సాహసం, తెలివి, శక్తిసామర్థ్యాలూగల మీరు బూడిదలోపడ్డ పన్నీరవుతారెందుకు చెప్పు? వాటిని దేశోన్నతికెందు కుపయోగించకూడదు చెప్పు? మన లక్ష్యమేకాదు లక్ష్యమార్గం కూడా ఉన్నతంగా ఉండాలన్నారు బాపూజీ..."

"నిజమే మాస్టారూ! మాస్టారూ- మీరెంత




ఉద్రేకంతో చెప్పే అల్లూరి సీతారామరాజు కథని, భగత్‌సింగ్ త్యాగాన్ని ఒక్కసారి స్మరించండి. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని గడగడలాడించిన మన్యం వీరుడి పిలుపు దేశజనం గుండెల్లో ప్రతిధ్వనించ లేదా? ఉరికంబమెక్కిన భగత్‌సింగ్ దేశాభిమానం జనం గుండె తలుపుల్ని తట్టలేదా? ఏ నిస్వార్థవీరుడి త్యాగమూ దీక్షా వృధాకావు మాస్టారూ! ఇవాళగాకపోతే రేపు ఆ ప్రభావం కన్పించితీరుతుంది. మహాయజ్ఞానికి తొలి సమిధలుగా మమ్మల్ని మేం ఆత్మాహుతి చేసుకుంటున్నాం. మాస్టారూ- నమస్తే"

గబుక్కున తలుపు- తీసుకుని చీకట్లో కలిసిపోయారా యువకులంతా.

నోట మాటలేక అటే చూస్తుండిపోయారు మాస్టారు.

ఆయన ఓ కంట్లో ఆనందం, మరో కంట్లో విషాదం నిండి ఉన్నాయి!




తెల్లగా తెల్లవారకుండానే షావుకారి బతుకు తెల్లారిపోయిందని ఊరందరికీ తెలిసిపోయింది.

సుబ్బరామయ్యగారబ్బాయి భార్గవ తన మిత్రుల్ని తీసుకొచ్చి నరసింహాన్ని చంపేశాడనీ, నోట్లుతగలబెట్టేశాడనీ, తాకట్టు బంగారాన్ని పంచిపెట్టమని మాస్టారికిచ్చారనీ చెప్పుకోసాగారు.

కొందరు బాగా జరిగిందని సంతోషించారు. కొందరు కలికాల మహత్యమన్నారు. కొందరాయన్ని చంపకుండా వదిలేయాల్సిందన్నారు. అంతా దైవలీల, పాపం పండిందన్నారు కొందరు.

కొందరు భార్గవని పొగిడితే కొందరు తెగిడారు.

గ్రామప్రజలంతా తండోపతండాలుగా మాస్టారింటికి వెళ్ళారు. కొందరు తమ తాకట్టు వస్తువుల్ని ఇచ్చెయ్యమన్నారు.

"భార్గవ వీటిని అందరికీ అప్పగించమని నాకిచ్చిన మాట వాస్తవమే. కానది న్యాయనమ్మతంకాదు. వాటిని పోలీసులకప్పజెబుదాం. కోర్టు ఎలా చెబితే అలా చేద్దాం" అన్నారాయన.

"పోలీసుల చేతుల్లో పడితే మళ్ళీ తిరిగిరావు వాళ్ళు రాకుండానే ఎవరివి వారికిచ్చేస్తే మంచిది" అన్నారొకరు.

"అలాటి భయాలు పెట్టుకోవద్దు. పంచనామా జరిపిద్దాం. వారు స్వాధీనం చేసుకున్న ఆభరణాలకి రసీదు తీసుకుందాం. ఒకర్ని చంపి అన్యాయంగా దొంగిలించిన ఈ సొమ్మును పంచేహక్కు నాకుగాని, పుచ్చుకునే హక్కు మీకుగాని లేదు"

మాస్టారి మాటలు చాలామందికి రుచించలేదు. అందరి ముందూ మరేమీ అన్లేక అయిష్టంగానే మౌనం వహించారు.

శివం పోలీసుస్టేషన్‌కెళ్ళి రిపోర్టుచేశాడు.

మరో రెండు గంటలకి తాపీగా వచ్చింది పోలీసుదళం.

ఫొటోలూ వేలిముద్రలూ ప్రశ్నించడాలూ స్వాధీనాలూ అయ్యాక రాయుడింట్లో సుష్టుగా భోంచేశారు.

"మీ చెవిని పడిందో లేదో - షావుకారూ, మాస్టారూ అప్పు గురించి తగాదాపడ్డారు. మాస్టారు పెద్దల తీర్పుని వ్యతిరేకించి వెళ్ళిపోయారు కూడానూ. ఆయన శిష్యుడు భార్గవ అనే నక్సలైటు. వాళ్ళిద్దరికీ సంబంధాలున్నాయని కొందరంటున్నారు. పాపం పుణ్యం భగవంతుడికి తెలియాలి. మాస్టారే అతణ్ని రప్పించి హత్యచేయించి ఉంటారని కొందరనుమానిస్తున్నారు. రాత్రి వాళ్ళు ఆయనింట్లో భోంచేసి విశ్రాంతి తీసుకోవడమేగాక దోచుకొచ్చిన బంగారం కొంత అక్కడొదిలేసి వెళ్ళిపోయారు" అన్నారు లౌక్యంగా రాయుడు.

"విన్నాం - ఆయన్నీ ప్రశ్నిస్తాం. నిజాన్ని రాబడదాం" సర్కిల్ ఇన్స్పెక్టరన్నారు హుందాగా"

భార్గవ తండ్రి ఎలాటోడు? కొడుకు ఆచూకీ గురించి అతడికి బొత్తిగా తెలీదంటారా?"

"ఆయనో వెర్రిగొర్రె. రాత్రి భార్గవవాళ్ళింట్లో కి తొంగిచూడను కూడాలేదు. భార్గవ మాయ మైపోయినప్పట్నుంచీ నెత్తీనోరూ కొట్టుకుంటూ అందర్నీ సాయపడమని దేవిరిస్తున్నాడు"

తలపంకించి, "పదండోయ్" అని అనుచరుల్తో చెప్పి "మీరూ రండి" అని పిలిచారాయన్ని.

అంతా మాస్టారింటికెళ్ళి ఆభరణాలుస్వాధీనం చేసుకున్నారు. ఒక లిస్టు మాస్టారికిచ్చారు.

"మాస్టారూ- మీరూ స్టేషన్కి రావాలి"

తలాడించారాయన.

ఆయన పోలీసువేన్ ఎక్కుతోంటే చూసి తల్లడిల్లిపోయింది శారదమ్మ. ఆమె మనస్సేదో కీడుని శంకిస్తోంది.

శివం తదితరులు సైకిళ్ళమీద బయలుదేరారు.

పోలీస్స్టేషన్ లోపలి గదిలోకి తీసుకెళ్ళి మాస్టార్ని ఇంటరాగేట్ చెయ్యసాగారు.

"రాత్రి వచ్చిన నక్సలైట్లని మీరే షావుకారింటికి తీసుకెళ్ళారుకదూ?"

"లేదు ... వాళ్లక్కణ్నుంచే మా ఇంటికొచ్చారు"

"వాళ్ళకాయన ఇల్లెలా తెలిసింది?

"వారిలోని భార్గవ అనే కుర్రాడు మా వూరివాడే. అతడు ఇదివరకీ వూరికాలేజీలో చదువుతూ అదృశ్యమయ్యాడు. అప్పుడు నేనొచ్చి మిమ్మల్ని ఎంక్వైరీచేశాను కూడా..."

"అతడికీ మీకూ సంబంధం?"

"గురుశిష్య సంబంధం"

"అబ్బో చాలా గొప్ప సంబంధమే. గురువులకి శిష్యులు వంగనామాలు పెడుతున్న కాలమిది పిచ్చిపంతులూ..."

"గురువు మాటని శిరోధార్యంగా భావిస్తోన్న శిష్యాగ్రగణ్యులూవున్నారీ కాలంలో"

"మీ పాత చింతకాయ పచ్చడి కబుర్లకేంగాని షావుకారూ, మీరూ తగాదా వడ్డారుకదూ?"

"తగాదా అనికాదు - అప్పు వెంటనే కక్కమని సంఘంలో పెట్టి గొడవచేశారాయన"

"అప్పుడు మీరా సంఘపు తీర్పునెదిరించి సర్పంచిని బెదిరించి వెళ్ళి పోయారు"

"రామరామ ... అలా ఏమీ చెయ్యలేదు. నన్ను గ్రామ బహిష్కారం చేస్తూ తీర్పు ఇచ్చేసరికి నాకు గుండె పోటువచ్చింది. అంతా నన్ను ఆసుపత్రికి తీసుకుపోయారు. కొందరు తీర్పుని వ్యతిరేకించారు."

"వాళ్ళు మీ శిష్యులేకదూ?"

"కొందరు"

"అంటే మీరు వాళ్ళతో కలిసి పన్నిన కుట్రప్రకారం అలా ప్రవర్తించారన్నమాట ...

"అలాటిదేంలేదు. చాటుగా కుట్ర పన్నాల్సిన అగత్యంలేదు"

"ఓహెూ ... బహిరంగంగానే కుట్ర పన్నుతున్నారన్నమాట. రాత్రి వచ్చిన నక్సలైట్లు అయిదుగురు కదూ? వాళ్ళ పేర్లేమిటి?"

"వారిలో ఒక్క భార్గవనే ఎరుగుదును. మిగతావాళ్ళని అంతక్రితం చూళ్ళేదెప్పుడూ"

"పరిచయం చెయ్యలేదన్నమాట"

"లేదు"

"వాళ్ళు మీ ఇంటికే ఎందుకు వచ్చినట్టు?" వ్యంగ్యంగా నవ్వేడు ఇన్స్పెక్టర్.

"చెప్పలేను. నాతో మాట్లాడదామని కావచ్చు. తాకట్టు బంగారం నాకప్పజెబుదామని కావొచ్చు."

"మీ ఇంట్లో భోంచేసి విశ్రాంతి తీసుకున్నారుకదూ?

"ఏవోరెండు ముద్దలుంటే తినేసి వెళ్ళిపోయారు."

"నక్సలైట్లు నేరస్తులనీ, ప్రభుత్వాన్ని కూలదోయాలని కుట్రపన్ను తున్నవారనీ మీకు తెలుసుకదా - వెంటనే వాళ్ళని గదిలో బంధించి మీరెందుకు సమాచారం అందించలేదు?"

"వాళ్ళు చేస్తున్నపని మంచిదికాదనీ, అది







జిహ్వాకోరుచి, పుర్రెకోబుద్ధి అన్నారు పెద్దలు. చూసేవారికి వింతగా తోచినా కొందరికి ఎన్నో విపరీతమైన అలవాట్లూ, హాబీలు వుంటాయి.

నలభైఏళ్ల కిషన్‌గోపాల్ సైనీ చెల్లని నోట్లూ, నాణాలూ సేకరించడమే జీవిత పరమావధిగా పెట్టుకున్నాడు. తప్పుగా ప్రింటయినవీ, ముద్రలు సరిగా పడనివీ, నెంబర్లు అస్పష్టంగా వున్నవీ, ఇతరత్రా స్పష్టత లోపించినవీ.. ఇలా పనికిరాని కరెన్సీ నోట్లనీ, నాణాల్నీ స్టాంపుల్నీ సేకరించటానికి ఇప్పటివరకు రెండు లక్షల రూపాయలకు పైగా ఖర్చుచేశాడతను.

సైనీ మనదేశపువేగాక లోపాలున్న విదేశీ కరెన్సీ నోట్లనీ, నాణాల్నీ స్టాంపుల్నీ కూడా సేకరిస్తాడు. భద్రతాచర్యల మాటున ప్రభుత్వాలు అతిజాగ్రత్తగా నాణేల్నీ నోట్లనీ తయారుచేస్తుంటాయి. అటువంటప్పుడు లోపాలూ, దోషాలూ వుండటానికి వీల్లేదు. అయినా తప్పులు వస్తూనే వుంటాయి. అందుకే ఆ తప్పులకు విలువ.

సైనీ పిత్రార్జితమైన ఓ బట్టలదుకాణం 1965 నుండీ నడుపుతున్నాడు. తన దగ్గరికొచ్చే కొనుగోలుదార్లు ఎప్పుడైనా చెల్లని కరెన్సీ ఇచ్చినా మహాప్రసాదంగా పుచ్చుకుని దాచుకుంటాడు. సైనీకి ఈ అలవాటు అతని అయిదోఏట యధాలాపంగా మొదలై క్రమంగా వటవృక్షంలా పెరిగిపోయింది. "కరెన్సీ జాతీయతకి చిహ్నం. ఒకనాటి రారాజుల నాణేల్ని ఇప్పుడు వింతగా పరిశీలిస్తున్నాం. మన ముందుతరాలవారు ఇప్పటి మన నాణేల్నీ కరెన్సీనీ అలాగే చూస్తారు. అందుకే ఈ పాతనోట్ల సేకరణలో నాకెంతో సంతృప్తి కలుగుతుంది" అంటాడు సైనీ.

మొదట్లో కొన్నాళ్లు సైనీ రిజర్వుబ్యాంక్ ఎదుట కూర్చునేవాడు. పనికిరాని నోట్లను తిరిగి ఇవ్వడానికి ఎవరైనా బ్యాంకుకి వస్తే వాళ్ల దగ్గరనుండి అవి తనే తీసుకుని దాని విలువ సరిపడా డబ్బు వాళ్లకిచ్చేవాడు. అతని వింత అలవాటు వార్త నలుగురికీ పాకిపోవటంతో బ్యాంకుకు బదులు అతని దగ్గరికే రాసాగారు ప్రజలు. సైనీ సేకరించిన కరెన్సీలో ఒకేఒక నోటుకు యాభైవేల రూపాయలిచ్చి కొనడానికి కొందరు ముందుకు వచ్చినా దాన్ని అమ్మడానికి సైనీ నిరాకరించాడు. కొన్నాళ్లయ్యాక మరిన్ని నోట్లూ, నాణాలూ సమకూడాక పెద్దయెత్తున ఒక ప్రదర్శనను నిర్వహించాలని ఆయన సంకల్పం. ★

నరైన మార్గంకాదనీ నచ్చచెప్ప ప్రయత్నించాను. నా సిద్ధాంతంతో ఏకీభవించమంటూ వాదించి ఆకస్మాత్తుగా వెళ్ళిపోయారు.''

''ఎక్కడికెళ్ళారు?''

''తెలీదు''

''ఎక్కడుంటున్నారు? వాళ్ళ స్థావరం ఎక్కడ?''

''తెలీదు''

''ఇన్ని చెప్పినవాళ్లు ఎక్కడుండేదీ చెప్ప లేదా?''

''లేదు.''

''మీరడగలేదా?''

''లేదు''

''వాళ్ళకి అన్నంపెట్టడం ఆశ్రయమివ్వడం నేరమని మీకు తెలుసా''

''వాళ్ళు నేరస్తులు కావొచ్చు. దుర్మార్గులు కావొచ్చు. ఆకలన్నప్పుడు అన్నంపెట్టడం మానవతా ధర్మం అనుకున్నాం''

''అబ్బో ... శిబిచక్రవర్తి మళ్ళీ పుట్టేడయ్యా''

''నేను సామాన్యమానవుణ్ని మాత్రమే''

''ఈ కబుర్లకేంగాని - వాళ్ళు షావుకారుని చంపడానికి కారణం ఆయనా, మీరూ తగాదా పడటమేనంటాను - ఏమంటారు?''

''అంతకుముందు నుంచీ షావుకారుమీద ద్వేషంవుందనీ, నన్ను అల్లరిచేసే సరికి మరి 'భరించలేక బరిలోకి దూకాననీ చెప్పేడు భార్గవ్''

''అంటే ఆ హత్య వెనుక మీ ప్రోత్సాహమూ, ప్రోద్బలమూ వున్నాయన్నమాట''

''లేవు ... ముమ్మాటికీ లేవు. జరిగిందానికి నేనెంతో కృంగిపోతున్నాను. నాశిష్యుడి పాపంలో పరోక్షంగానైనా నాకూ బాధ్యతుంది - ఒప్పుకుంటున్నాను. అంతేగాని, అలాటి చేష్టల్ని అలాటి వ్యక్తుల్ని నేను హర్షించను ... సమర్థించను. సంహారంలోకాదు సంస్కరణలో నమ్మకం వున్నవాణ్ని''

''ఈకాలంలో ఇలాటి కబుర్లు నమ్మేయడానికి మేం చెవిలో పువ్వెట్టుకోలేదు గాని భార్గవవాళ్ళ స్థావరం ఎక్కడో చెప్పండి''

''మా వూరి ఇలవేల్పుల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను - నాకా విషయాలు తెలీవు''

''పెద్దవారు గనుక మర్యాదగా అడుగుతున్నాం. మీచేత నిజమెలా కక్కించాలో మాకు తెలుసు''

''నాకు నిజంగా తెలీదు. నా బిడ్డలమీద ఒట్టేసి చెబుతున్నాను''

''మాక్కావాల్సింది. ఒట్లుకాదు - సమాచారం...

చేతులు లేచాయి.

పిడికిళ్ళు లేచాయి.

లాఠీ లేచింది.

బెల్టు లేచింది.

హాహాకారాలూ మూలుగులూ ప్రతిధ్వనించాయా గదిలో.

సాయంత్రమైనా మాస్టారి జాడ చెప్పలేదు పోలీసులు. ఇంటరాగేషన్నిమిత్తం ఎక్కడికో తీసుకెళ్ళామన్నారు. ఆ రాత్రికి వచ్చేస్తారన్నారు. ఒక ప్లీడర్ని సంప్రదించారు. ఆయనా స్టేషన్కొచ్చి కనుక్కున్నారు. అదే జవాబొచ్చింది. మర్నాటి ఉదయం వరకూ వేచిచూద్దామనుకున్నారు.

ఆ రాత్రి నిద్రాహారాలు లేకుండా మాస్టారి రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు.

మాస్టారు రాలేదన్న పచ్చినిజాన్ని పట్టుకొని పట్నమెళ్ళారంతా!

మాస్టార్ని కస్టడీలోకి తీసుకుని ఇరవైనాలుగ్గంటలు దాటిందనీ, అయినా ఇంతవరకూ ఆయన ఆచూకీ చెప్పలేదనీ, కోర్టు ముందు హాజరుపర్చలేదనీ వెంటనే కోర్టులో హాజరుపర్చాల్సిందిగా పోలీసుల్ని ఆదేశించాల్సిందిగా కోరుతూ కోర్టులో పిటీషన్పెట్టారు.

మాస్టార్ని క్రితంరోజున అరెస్ట్చెయ్యడం అబద్ధమనీ, ప్రశ్నించిన మీదట ఒక్కగంటలోనే వదిలేశామనీ కోర్టుకి నివేదించారు పోలీసులు.

మాస్టార్ని ఏం చేశారో అన్న ఆందోళన అలుముకుంది అందర్లో.




ఊరి జనమంతా సబ్‌కలెక్టర్ ఆఫీసు ముందు ధర్నాకి తలపడ్డారు.

పరిస్థితి సమీక్షించుకున్నారు పోలీసు అధికారులు.

"చిలికి చిలికి గాలివానయ్యేట్టుంది. మాస్టార్ని వదిలెయ్యటమే మంచిది" అన్నాడు సర్కిల్ ఇన్స్‌పెక్టర్.

"కోర్టు గురించి భయపడకోయ్.. ఇంతక్రితమే అరెస్ట్‌చేశామని కోర్టుకి తీసుకెళ్ళొచ్చులే. నా ఆలోచనేమిటంటే మాస్టార్నిలా నిర్బంధించినట్టు భార్గవగాడికి తెలిసుంటుందికదా! తనవల్ల మాస్టారు చిత్రవధ అనుభవిస్తున్నారని భావించి అతడు లొంగిపోవచ్చుకదా?" డీయస్పీ అన్నాడు.

సన్నగా కంపించాడు సి.ఐ. "లొంగిపోతే మంచిదే. కక్షతో రెచ్చిపోతేనే ప్రమాదం. ఆయన్ని అరెస్ట్‌చేసింది మేమేగనుక మా కుటుంబం మీద..."

"ఆల్‌రైట్ ... ఆయన దగ్గర్నుంచేం రాబట్టలేమంటారు?"

"తెలిసిన విషయాల్నిబట్టి ఆయన సత్యకాలపు మనిషే అన్పిస్తోందండీ"

"విషయాలవల్ల అన్పిస్తోందా భయంవల్ల అన్పిస్తోందా?" అని నవ్వి "సరే- గుట్టు చప్పుడు కాకుండా వదిలెయ్యండి. ఎందుకైనా మంచిది - ఆయన మీదో కన్ను వెయ్యండి" అన్నాడు డీయస్పీ.

చిత్ర హింసలకి రూపు మారిపోగా కళ్ళల్లో ప్రాణాలు నిలుపుకొని వచ్చిన మాస్టార్ని చూసి బావురుమన్నారంతా. మధ్యలో ఓసారి గుండె పోటొచ్చిన సంగతి బయటపెట్టలేదాయన.

★ ★ ★

"సమస్కారం ఆచార్యులుగారూ" కోవెలకెళ్ళి పూజారి గోపాలాచార్యులు గారితో అన్నాడు పానకాలు.

"రామార్పణం ... రండిరండి ఏవిటీమధ్య ఇటుకేసే రావటం లేదు?"

"నాకు, పనీ వుండదు తీరికా వుండదు"

గర్భాలయాన్నీ నైవేద్యాలనీ పరిశీలనగా చూస్తూ అన్నాడు - "ఈమధ్య మీరూ, మీదేవుడూ ఓవెలుగు వెలుగుతున్నట్టున్నారు"

"అంతా ఆ శ్రీరాముడి దయ"

"దేవుడుదేముందండీ - నైవేద్యంపెడితే నవ్వుతాడు, పెట్టకపోతే దిగాలుపడి చూస్తుంటాడు తప్ప నోరుతెరచి అడగడుకదా"

"దేవుడెందుకడుగుతాడండీ - దేవుడికివన్నీ కావాలా ఏవిటి! ఏదో మన తృప్తికోసం, మన భక్తిచాటుకోవడం కోసం అంతే...!"

"అవాళ గుడిలో నిజంగా వెలుగుని చూశారో లేదోగాని ఇవాళ గుడోవెలుగువెలుగుతోంది." వంకరగా నవ్వేడు.

"మీరలా మాట్లాడ్డం భావ్యం కాదు. ఆ పుణ్యదినాన స్వయంగా నాకళ్లతో చూశాను. క్షణకాలం కళ్ళు మిరుమిట్లుగొల్పాయంటే నమ్మండి"

"అది భగవానుడి మహిమో, సూర్యభగవానుడి మహిమో ఎవరికి తెలుసు లెండి?"

గోపాలాచార్యులి మొహం మ్లానమయ్యింది.

"అహా ... నేను మిమ్మల్ని మీ భక్తినీ అనుమానించటంలేదు. మీరు నిష్కళంక భక్తులనీ, మీది నిప్పుల్ని కూడా కడిగే వంశమనీ వూరందరికీ తెలుసు. మిమ్మల్నోమైనా అంటే కళ్ళుపోవూ?"

"అంత మాటెందుకులెండి! ఆ రాముడూ మన రాయుడూ చల్లగా చూస్తుండబట్టి ఏదో ఇలా లోటులేకుండా గడిచిపోతోంది"

"మరి మీదాకా వచ్చిందోలేదోగాని తులసివనంలో గంజాయి మొక్కపుట్టింది"

"ఎవరిగురించంటున్నారు?"

"ఎవరో గురించైతే మీదగ్గరెందుకంటానండీ! సాక్ష్యాత్తూ మీ మేనకోడలి గురించే. డాక్టరుకదా మనూళ్ళో డాక్టరులేని లోటుతీర్చింది కదాని సంతోషిస్తున్నాం ఇన్నాళ్ళూ"

"అవునండి ... మానవసేవే మాధవసేవని గ్రహించిందిగనుకే మన పల్లెకొచ్చి ప్రాక్టీసుచేస్తోంది. ఈరోజున వూరందరి మెప్పుపొందుతోంది. పాము కరిచినా, పురుటినొప్పులొచ్చినా పట్నం పరుగెత్తాల్సిన అగత్యం లేకుండా అర్ధరాత్రి అపరాత్రీ అని చూడకుండా వచ్చి వైద్యం చేస్తోంది. నిజంగా ధన్యతఅంటే ఆమెదే"

పానకాలి మొఖం అప్రసన్నంగా వుండ టంచూసి ఆశ్చర్యపోయారాయన. "ఇందాకేదో గంజాయి మొక్క అంటున్నారు. మా దీపిక గురించే?"

"అవునండీ ... లంకలో నాలుగు రోజులు న్నందునే కదా - సీతామహాసాధ్వీమీద అభాండమేశారు. మన వూరు లంకలాటిదని కాదు చెప్తూంట. నలుగురూ ఏమనుకుంటారోన న్న ఇంగితమైనా లేకుండా ఆ శివంగాడితో రాసుకుని పూసుకుని తిరగటం, కార్యక్రమలూ కాకరకాయా అంటూ మగరాయుళ్ళా తయార వడం- అబ్బే... ఏం బావుండలేదు ఆచార్లుగా రూ! అగ్నిహోత్రంలాంటి పవిత్రమైన వంశంలో పుట్టి ఒక అలగా మనిషితో అంటుకు తిరగటం, నలుగురూ చూట్టం నాలుగు రకాలుగా వ్యాఖ్యానించటం ఏం గౌ రవం చెప్పండి? ఎంత అప్రతిష్ట చెప్పండి?"

"ఏదో స్నేహధర్మంగా తిరుగుతోందనుకు న్నానుగాని ఇలా అనుకోలేదండి"

"మీరెంతో సిష్టాగరిష్టులు గనుక ఇతర్ల గు రించి చెడుగా అనుకోరు. కాని కాకుల్లాంటి లోకులలా కాదుగదండి. రకరకాల కథలు ప్రచారంచేస్తున్నారు. ఆఖరికీ రాయుడిగారి చెవిన కూడా పడ్డాయి. ఎంతో పవిత్రమూ, పూజనీయమూ అయిన వంశంలో పుట్టి అంద రిచేతా దూషింపబడుతోందే అని ఎంతగానో బాధపడుతున్నారు. గోపాలాచార్యులుగారికి తెలిస్తే ఎంత కృంగిపోతారో అని కూడా అన్నా రు ఇవాళ పొద్దుట కలిసినప్పుడు..."

"అలా అన్నారా... నిజంగా ఎంత సిగ్గుమా లిన పని. సమయానికొచ్చి చెప్పి మంచిపని చేశారు. మీరు చెప్పకపోతే నేనింకా చీకట్లో దేవుళ్లాడుతూనే వుండేవాణ్ని. ఇవాళే దీపికతో మాట్లాడతాను. ఇక అతగాడితో తిరుగుళ్ళు కట్టిపెట్టమని కట్టడిచేస్తాను. వింటే సరేసరి... వినకపోతే వాళ్ళ అన్నా వదినలకి తెలియజే స్తాను. నన్ను నమ్మి అమ్మాయినిక్కడికి పంపిన ప్పుడు ఆమె బాగోగులు చూడాల్సిన ధర్మం నామీద లేదంటారా?"

"లేదని ఎవరనగలరు. పైగా తల్లీతండ్రీలే నివాళ్ళకి మీరే పెద్దదిక్కుకదా, కులం భ్రష్టం కాకుండా చూడాల్సిన బాధ్యత మీమీద వుంది"

తన మాటలాయన మీద బాగా పనిచేస్తు న్నాయని గ్రహించాడు పానకాలు. మరికాస్త గాలికొట్టి వచ్చి సిగరెట్టు వెలిగించుకుని గుండెల్నిండా పొగపీల్చుకుని వదిలాడు.

★ ★ ★

నిలువుటద్దంలో తన ప్రతిబింబం చూసు కుంటూ హ్హ... హ్హ... అని నవ్వుకున్నారు రాయుడు.

ఆయనింత సంతోషంగా ఈమధ్యలేరు.

మాస్టార్ని షావుకారు హత్యకేసులో అరెస్టచే సినప్పట్నుంచీ వూళ్ళో ఆయన పలుకుబడి తగ్గిందని అంచనా వేసుకున్నారు.

దీపిక, శివంల సంబంధం గురించి పానకా లుని పంపించారు.

ఇహ మెల్లగా శివంని లొంగదీసుకోవడమో, కత్తిరించడమో చేస్తే సరిపోతుంది.

ఊరు తన గుప్పిట్లోంచి తప్పించుకోవడం అసంభవం! అసెంబ్లీ ఎన్నికలొస్తే తమ వూరి ఓటు ఒక్కటీ బీరుపోదు! ప్రథమ ప్రయ త్నంలోనే ప్రభాకర్ ఎమ్మెల్యే అవుతాడనడాని కిది శుభసూచన!

మళ్ళీ నవ్వుకున్నాడు.

ఒకనాడు తన పని అయిపోయిందనీ, తన పాచికలు పారవనీ అధైర్యపడినందుకు సిగ్గుప డ్డాడు. తాటాకు చప్పుళ్ళకి తనలాంటివాడు బెదరటం చిత్రమే అనుకున్నారు.

ఆయన్నింతగా ఆనందాశ్వం మీద విహ రింపజేస్తున్నది బ్యాంకు ప్రారంభోత్సవ వ్యవ హారం.

ఇంకొద్దిసేపట్లో ఆ ఊళ్ళో బ్యాంకు బ్రాంచిని కలెక్టరు ప్రారంభించనున్నారు.

మొదట్నుంచీ కూడా బ్యాంకు అధికారులు రాయుణ్ని ఆశ్రయించుకునే వున్నారు. అంచేత బ్యాంకుకి బిల్డింగు అద్దెకిప్పించటం నుంచి ప్రారంభోత్సవపు ఏర్పాట్లవరకూ అన్ని ట్లోనూ శ్రద్ధతీసుకున్నారు. మండలాధ్యక్షుడి ద్వారా కలెక్టర్ని కలిసి బ్యాంకు ప్రారంభించ డానికొప్పించింది కూడా ఆయనే.

ఓపెనింగ్ రోజున కొన్ని లోన్స్ ఇస్తామన్నారు




బ్యాంకువాళ్ళు. తనవాళ్ళ పేర్లుకొన్ని ఇచ్చారు. శివమూ ఇచ్చాడు.

**అయినా బ్యాంకు రావడానికి తానే కారణ**మైనట్టు డప్పాలు కొట్టుకుని తన పరపతి పెంచుకోవాలనుకున్నారు. ఇకనుంచి మళ్ళీ గ్రామం తన చెప్పుచేతల్లో వుంటుందని ఇక చక్రం తను తిప్పుతాడనీ మురిసిపోతున్నారు.

"అయ్యగారూ- కార్లొచ్చేస్తున్నాయి"

ఎదురెళ్ళి జిల్లా కలెక్టర్ని మండలాధికార్ని మండలాధ్యక్షుణ్ని బ్యాంకు అధికార్లని ఆహ్వానించారు.

"మనం తిన్నగా బ్యాంకుకే వెళ్తే బావుంటుందికదా" కలెక్టరన్నారు.

"వెళ్దాంసార్- రెండు నిమిషాలు. ఇప్పటికే



మీల్స్‌కి ఆలస్యమయింది'' మండలాధ్యక్షుడ న్నాడు.

''పని ముఖ్యంకదా''

''ఇదీ ముఖ్యమే సార్'' నవ్వేడాయన.

విందు ముగిసింది. మధ్యలో రాయుడి గురించి కోసేశాడు మండలాధ్యక్షుడు అందరి ముందూ.

తర్వాతంతా బ్యాంకు దగ్గరికెళ్లారు.

వెండి కత్తెరతో కరతాళధ్వనుల మధ్య రిబ్బను కత్తిరించారు కలెక్టరు.

కలెక్టరు సభలో ప్రసంగిస్తూ- బ్యాంకులు ఆధునిక దేవాలయాలనీ వాటిని మీ అభివృద్ధికి సక్రమంగా వినియోగించుకోవాలనీ అన్నారు. అప్పు తీసుకోవడం తప్పు కాదు- సక్రమంగా తీర్చకపోవటమే తప్పు అన్నారు. మన ఆరాధ్యదైవం వడ్డీ కాసులవాడు కూడా అప్పుతీసుకున్నవాడే అని చమత్కరించారు. ప్రభుత్వం ఆ గ్రామాభివృద్ధికి చాలా కృషిచేస్తోందనీ, జనం కూడా కలిసిరావాలనీ కోరారు. ఎరువుల ఫ్యాక్టరీకి స్థలం కేటాయిస్తున్నామనీ, ప్రభుత్వ భూమితోబాటు ప్రైవేటు భూమికూడా ఇవ్వాల్సొస్తుందనీ, అంచేత గ్రామ భవిష్యత్తుని దృష్టిలోవుంచుకుని అంతా అందుకు సహాయపడాలనీ కోరారు. అందుగ్గాను సర్పంచ్ రాయుడు చొరవ తీసుకోవాలని ప్రత్యేకంగా కోరారు.

తర్వాతాయన కొందరికి ఋణమంజూరు పత్రాలిచ్చారు.

కొందరికి పంటల నిమిత్తం, కొందరి పాడిగేదెల నిమిత్తం, కొందరికి బండి ఎడ్లు నిమిత్తం, కొందరికి పట్టుపరిశ్రమ నిమిత్తం, కొందరికి చేతివృత్తుల నిమిత్తం, కొందరు మహిళలకి కుట్టుమిషన్ల నిమిత్తం లోన్స్ ఇచ్చారు.

ఊరి బాగు తన బాగు అనుకుంటున్నవాణ్నినీ, తానా గ్రామాన్ని ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్దటానికి శపథంచేస్తున్నాననీ, ఎరువుల ఫ్యాక్టరీకి పూర్తి సహకారమిస్తాననీ గొంతెత్తి మరీ చెప్పేరు రాయుడు.

బ్యాంకు మేనేజరు వందన సమర్పణ చేస్తొంటే కలెక్టరు దృష్టిలోపడ్డారు మాస్టారు.

ఎండలో నిలబడి ఆనందంగా చూస్తున్నారాయన!

ఎవర్నో పిలిచడిగారు. అతడు చెప్పేడు వివరంగా- ఆయనే ఈ ఊరికి దేవుడని.

సభ పూర్తవడం ఆలస్యం గబగబా స్టేజిదిగి ఆయనదగ్గరికి వెళ్లారు-

''సార్'' అంటూ.

విస్మయంగా చూశారు మాస్టారు కలెక్టర్ వంక.

''మీరు...''

''నేనుసార్... సోమయాజిని. మీరు కొవ్వూరు స్కూల్లో పనిచేస్తున్నప్పుడు మీ దగ్గర చదివిన శిష్యుణ్ని. అప్పట్లో నేనెక్కువగా చొక్కా కొనలు నములుతూండేవాణ్ని. మీరోసారి చూసి తిక్కన భారతాన్ని నమిల్తే నువ్వు బట్టలు నముల్తున్నావా అని నవ్వేరు. ఇకనుంచి పుస్తకాలు నమలటం నేర్చుకోమని సలహా ఇచ్చారు. అప్పట్నుంచీ పుస్తకాల పురుగునైపోయాను. మళ్ళీ ఇన్నేళ్ళకి ఈ రకంగా కలుసుకున్నందుకు చాలా ఆనందంగా వుంది. రండి మాస్టారూ'' అంటూ స్టేజి మీదకి తీసుకెళ్ళారు.

ఎవరో అందిచ్చిన దండని మాస్టారి మెడలో వేశారు.

చప్పట్లు మార్మోగాయి.

''ఇది గురుపూజ. ఆదిగురువు శంకరుడంటారు. అక్షరాలు నేర్పినవారే ఆదిగురువంటాను. ఆయన ప్రభావం ప్రతి విద్యార్థి మీదా జీవితాంతం వుంటుంది. ప్రతి వ్యక్తి జీవితపు పునాదులు ప్రాథమిక పాఠశాలలోనే పడతాయి. ఆ పునాది గట్టిగా వుండేట్లు చూడాల్సిన బాధ్యత ఉపాధ్యాయుల మీదవుంది. ఆ పునాది మీద చక్కని భవంతి నిర్మించుకోవడం విద్యార్థుల చేతుల్లో వుంది. ఈనాటి నా ఈ స్థితికి పునాదిరాయి వేసినవారిలో ఈ గురువు ఒకరు. వీరికి నా శతసహస్ర వందనాలు'' అని చేతులు జోడించారు.

మాస్టారు ఆనంద భాష్పాలు రాలుస్తూ దీవించారు.

''మాస్టారూ... నేను మీకేమైనా తోడ్పడగలనంటే చెప్పండి'' కలెక్టరు సోమయాజి అడిగాడు.

''మా బడి పూరిపాకలో కుంటుతూ నడుస్తోంది బాబూ! దానికేమైనా గట్టి కప్పు




వేయించగలిగితే..."

"ఏకంగా బిల్డింగు కట్టిద్దాం మాస్టారూ! గ్రామస్తులు సగం ఖర్చు భరిస్తారా- చెప్పండి?"

"భరిస్తాం సార్... శ్రమదానం కూడా చేస్తాం" శివం అన్నాడు.

"గుడ్... రేపే ప్రారంభించండి. బిల్డింగు ప్లానూ, ఎస్టిమేషన్సూ తయారు చేయించండి. వెంటనే ఫండ్స్ రిలీజయ్యేట్లు చూసే బాధ్యత నాది"

మాస్టారి ఆనందానికవధుల్లేకపోయాయి.

ఎన్నాళ్ళనాటి కల! ఎన్నాళ్లనాటి తపన ఇవాళ అనుకోకుండా...

"వెయ్యేళ్ళు చల్లగా వర్ధిల్లుబాబూ!" దీవించారాయన.




రాత్రిళ్ళు వయోజన పాఠశాలలో పాఠాలు చెబుతున్నారు సరిత, మూర్తీ.

ఆ పాఠశాలని వాళ్ళిద్దరూ జాయింటుగా నిర్వహిస్తున్నారు. మధ్య మధ్య మాస్టారూ, శివం దీపికా గెస్ట్ టీచర్స్‌గా వచ్చి జనరల్ టాపిక్స్ గురించి ఉపన్యసిస్తున్నారు.

ఇంచుమించు చిన్నరైతులంతా ఏవో ఉపవృత్తులు చేబట్టారేమో ఎవరికీ అంతగా తీరిక వుండటంలేదు. పేకాటలాంటి వ్యసనాలు మాత్రం ఇప్పుడు జనాన్నంతగా ఆకర్షించడంలేదని చెప్పాలి. దానికితోడు అప్పుడప్పుడూ పిల్లలకోసం ఆటల పోటీలూ, పాటల పోటీలూ కూడా పెడుతున్నారేమో, నాటకాలు వేయిస్తున్నారేమో ఊరంతా కొత్త సంస్కృతిని సంతరించుకొంటోంది.

సుమారు పాతికమంది వయోజనులు శ్రద్ధగా చదువుకుంటున్నారు వయోజన పాఠశాలలో. ఆ సంఖ్యని పెంచాలని ప్రయత్నిస్తున్నారంతా.

అవాళ వయోజన పాఠశాలని ముగించి లేచారు మూర్తీ, సరితా. ఇద్దరి మార్గాలూ వేరు వేరు. అయినా మీ ఇంటివరకూ వచ్చి దిగబెడతానన్నాడతడు. కాదన్లేదామె.

మూర్తి ఆ వూరివాడే. గ్రాడ్యుయేట్. నిరుద్యోగి. శివంతో కలిసి కోళ్ళఫారం నిర్వహిస్తున్నాడు. మంచివాడూ, ఉత్సాహవంతుడూనూ. పాఠశాలలో పనిచేస్తానని స్వయంగా ముందుకొచ్చాడు. శివం కూడా తరచూ వచ్చే సరిత పిల్లలు సూర్య- చంద్ర కూడా మూర్తికి బాగా మాలిమయ్యారు. అతడి పాటలంటే పిల్లలకి మరీ ఇష్టం.

"అవతల మహిళా కార్యక్రమాలు- ఇవతల వయోజన పాఠశాల. చాలా శ్రమపడుతున్నారు మీరు" మూర్తి అన్నాడు.

"ఇంకా క్షణం కూడా తీరికలేకుండా శ్రమపడాలని వుంది"

"గతాన్ని మర్చిపోవాలనా?"

ఆగి అతడివంకోసారి చూసి తలదించుకుంది.

"కోర్టుకేసేమయ్యింది?"

"మొన్ననే తీర్పు ఇచ్చారు. నేరస్తులిద్దరికీ యావజ్జీవకారాగార శిక్ష విధించారు. వాళ్ళు అప్పీలు చేశారు"

"మరి మీభవిష్యత్తు సంగతేమిటి?"

'అంటే?"

"వాళ్లతో కలిసి ఉండటం సంగతి"

"జోకేస్తున్నారా? వాళ్ళతో కలిసి ఉండే ప్రసక్తేలేదు. విడాకులకోసం ప్రయత్నిస్తున్నాం"

"మరి తర్వాతి కార్యక్రమం?"

"సంఘసేవచేస్తూ ఉండిపోవాలనుంది"

"మరో మార్గాంతరం లేదంటారా?"

"ఉండొచ్చు... కాని నాలాటిదాన్ని మళ్ళీ పెళ్ళెవరు చేసుకుంటారు?"

"చేసుకుంటానంటే ఒప్పుకుంటారా?"

"మీరేమంటున్నారో తెలీటంలేదు"

"దాటవేయకండి సరితగారూ మనిద్దరం

కొద్దిరోజుల్నుంచే కలిసిపని చేస్తున్నా చాలా సన్నిహితమయ్యామనుకుంటాను. ఒకరి గురించొకరికి బాగానే అర్థమయ్యామనుకొంటాను. మీకేమీ అభ్యంతరం లేకపోతే..."

"నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి"

"తప్పకుండా. తొందరేంలేదు నా ప్రపోజల్ కి అంగీకరించినా, అంగీకరించకపోయినా ఒంటరిగావుండిపోవాలని మాత్రం నిర్ణయించుకోవద్దు. జీవితం చాలా విలువైనది. మరొకర్తో కలిసి పండించుకున్నప్పుడే అది పరిపూర్ణమవుతుంది. సార్థకత చేకూరుతుంది. ఇంకా పాతికేళ్ళు కూడా నిండని వయస్సులో వైరాగ్యాన్నాశ్రయించడమంటే ఎదుగుతోన్న మొక్కని నగానికి కత్తిరించటమే- ఆలోచించండి"

"థాంక్యూ"

"సరితా-" అంటూవచ్చి కలిశారు మాస్టారు.

"ఇంత రాత్రివేళ ఎక్కణ్నుంచొస్తున్నారు మాస్టారూ?" మూర్తి అడిగాడు.

"ఎరువుల ఫ్యాక్టరీ గురించి శివంతో మాట్లాడుతోంటే ఆలస్యమయ్యింది"

"నేవస్తానండింక" వెళ్ళిపోయాడతడు.

"ఎలావుందమ్మా స్కూలూ?"

"బావుంది నాన్నా"

"అంతా రెగ్యులర్‌గా వస్తున్నారా?"

"పదిహేను పద్దెనిమిది మంది రెగ్యులర్‌గా వస్తున్నారు. అందరికీ నేర్చుకోవాలన్న ఆసక్తి అధికంగానేవుంది"

"మూర్తి కూడా శ్రద్ధగా చెబుతాడు. వినుక్కోకుండా అరటిపండు ఒలిచినట్టు వివరించడం అతడికే చెల్లు"

తలాడించి వూరుకుంది.

ఆ ఒక్కవిషయంలోనే కాదు ప్రతివిషయంలోనూ ప్రథముడే అతడు. ముఖ్యంగా అతడిది శ్రావ్యమైన స్వరం. గొంతెత్తి పాడితే నాట్యం చేయాలన్పించేంత సప్తస్వర రాగ రంజిత కలకూజిత స్వరం.

"ఎవరా వెళ్ళేది?" ఒక రైతడిగాడు దార్లో.

"నేనండి వెంకయ్యగారూ... మాస్టార్ని"

"మీరా- బాగున్నారా?"

"మీ దయవల్ల బాగానే వున్నానండి. మీఆరోగ్యం ఎలావుందండి?"

"ఏదో బండినడుస్తోందిగాని ఊరుపొమ్మంటోంది, కాదు రమ్మంటోంది"

"అప్పుడే అలాగంటారేమిటి ఇంకా మనవళ్ళ పెళ్ళిళ్ళు చూడాలి"

"పెళ్ళిళ్ళంటే గుర్తొంచ్చింది. మీరింకా బూరెముక్క పెడతారనుకొంటోంటే అబ్బాయి పెళ్ళి గుట్టుచప్పుడు కాకుండా చేసేశారేమిటి?"

"ఎవరి పెళ్ళి... మా అబ్బాయి పెళ్ళా?" సృష్టిలోని ఆశ్చర్యమంతా ఆయన గొంతులో ధ్వనించింది.

"మీ అబ్బాయి పెళ్ళేనండీ... మీ అబ్బాయి పెళ్ళి చేసుకుని ఏకంగా కోడలు పిల్లతో వచ్చేట్టకదా- ఇంకా ఇంటికెళ్ళలేదా?"

"లేదండి... ఇప్పుడే వెళ్తున్నాను- వస్తానండి"

ముందుకడుగేస్తూ చిన్నగా నవ్వేరు మాస్టారు. "తన పెళ్ళి తనే చేసుకునేంత పెద్దవాడయ్యాడమ్మా మీ అన్నయ్య"

"నిజమేనంటావా నాన్నా?"

అబద్ధ మాడాల్సిన అవసరం వాళ్ళకేముంటుందమ్మా"

"మరెందుకలా చేశాడో..."

"పెద్దవాడయ్యాడు కదమ్మా" లోపల్నుంచి దుఃఖం తన్నుకొస్తోంటే బలవంతాన నిగ్రహించుకుంటూ తడబడుతూ అడుగులెయ్యసాగారాయన.

ఇంటి ముంగిట కుర్చీ వేసుక్కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న వానూ, యామినీ లేచినిలబడ్డారు.

"మా నాన్నగారూ, మా చెల్లెలూ. ఈమె డాక్టర్ యామిని. మా హాస్పటల్ సూపరిండెంట్‌గారమ్మాయి"

నమస్కారాలయ్యాక లోపలికి వెళ్ళిపోయారు.

బట్టలు మార్చుకొంటోంటే పెరట్లో కొచ్చి "కాళ్ళు కడుక్కోండి" అంది శారద స్వరం తగ్గించి.




# మృత్యుంజయుడు




మృత్యువాతపడటం అనేది సమస్తజీవులకూ సహజంగా ఉన్నదే అయినా కబళించవచ్చిన మృత్యువునే వెనక్కి మళ్ళించిన ఓ మృత్యుంజయుని విజయోదంతం ఆసక్తికరంగా వుంటుంది. ఆ మహానుభావుడెవరో కాదు- ఓ మామూలు విద్యార్థి జాన్ సియెనెసి.

అమెరికాలోని ఫ్లోరిడాలో డేటోనా బీచ్‌పక్కనున్న సరస్సులోకి స్కయింగ్ నిమిత్తం ఓరోజున వెళ్ళాడు జాన్. అంతకుముందు ఆ సరోవరజలాల్లో విహరిస్తోన్న ఓ మకరేశ్వరికి ఈయనగారి అందమైన తెల్లని పాదాలు ముద్దొచ్చాయి కాబోలు టక్కున వాటిని నోటితో వాటేసుకుంది. తన మడమల్ని వాడిగా ఉన్న దంతాల్లాంటివేవో చీల్చటం గ్రహించి నీళ్ళలోకి పరిశీలనగా చూశాడు జాన్. ఇంకేం- మొసలి కనిపించింది భయంకరంగా.

ఏడడుగుల ఆరంగుళాల పొడవుతో భీకరంగా అచ్చం ఆనాడు గజేంద్రుని పాదాలు పట్టుకున్న మకరంలాగే వుందది. జాన్‌కి ముచ్చెమటలు పోశాయి. ఒక్షణం ఏంచేయాలో పాలుపోలేదు. ఈలోగా అతని పాదపద్మాలను భోంచేసే ప్రయత్నంలో మొసలి నిమగ్నమైపోయింది. ఏమయితే అయిందిలెమ్మనే తెగింపుతో జాన్ ఆ మొసలి దవడల్ని బలంగా లాగిచీల్చబోయాడు. అయినా ఏమీ లాభం కనిపించలేదు. తన శక్తంతా ఉపయోగించి మళ్ళా మొసలి నోటిని విదిలించే ప్రయత్నం చేయసాగాడు. విశ్వప్రయత్నం తర్వాత ఎందుకో ఓ అరక్షణంసేపు జాన్ పాదాన్ని విడిచిపెట్టింది మొసలి. సాయంకోసం అరుస్తూ తన పక్కనుండి పడవలో వెళ్తున్న మిత్రురాలు మిస్ లిండాని పిలిచాడు జాన్. కాని తనను ఆటపట్టించేందుకు సరదాగా జాన్ అలా అరుస్తున్నాడనుకుందామె మొదట్లో. అయితే తర్వాత జాన్ స్వరంలోని కంగారు గమనించి కొంచెం వెనక్కితగ్గి అతనికేసి చూసి పరిస్థితి అర్థంచేసుకుంది. వెంటనే చేయూతనిచ్చి తన పడవెక్కించుకుంది. అలా బయటపడిన జాన్ ఆస్పత్రికి వెళ్ళి కుడికాలుకు బాండేజీలు వేయించుకున్నాడు.

దీన్ని గురించి ఆ రాష్ట్ర అధికారి ఒకాయన మాట్లాడుతూ- జాన్ ఘోరప్రమాదంనుండి తప్పించుకున్న అదృష్టవంతుడన్నారు. సదా ప్రజలు వస్తూపోతూ ఈతలాడే ఈ సరస్సులో ఇకముందు ఎలాంటి జలచరాలు లేకుండా జాగ్రత్తపడతామని హామీ ఇచ్చారు. ★

ఆయన పెరట్లోకి నడవగానే వెనకాలేవచ్చి- "అబ్బాయి పెళ్ళి చేసుకున్నాడు" అన్చెప్పింది.

"వీధిమొగలోనే తెలిసింది"

"మనకి చెప్పకుండా చేసుకున్నందుకు చాలా ఇదవుతున్నాడు. తొందరపడి మీరేమీ అనకండి"

"నేనెందుకంటానే... వాడి పెళ్ళి. వాడు చేసుకున్నాడు. మధ్యన మనమేదైనా ఎందుకంటాం? పైపెచ్చు మనని శ్రమపెట్టనందుకు మెచ్చుకుంటాంగాని"

"మీకు బాధగా వుంటుందని తెలుసండీ. కానేం చేస్తాం చెప్పండి. పిల్లల తప్పుల్ని కడుపులో దాచుకోవాలి. వాళ్ళు చల్లగావుంటే అంతేచాలు అనుకోవాలి" చాటుగా పైట కొంగుతో కళ్ళొత్తుకుంటూ అంది.

"నవమాసాలు మోసి కనిపెంచిన దానివి నువ్వు అలా అనుకుంటున్నప్పుడు నేను అనుకోలేనా? అలాగే శారదా"

భోజనాలయ్యాక అంతా అరుగుమీద కూర్చున్నారు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ.

వాసు ఉద్యోగంలో వెళ్ళినప్పట్నుంచి ఇప్పటివరకూ జరిగిన గొడవల గురించీ, ఊళ్ళో వచ్చిన మార్పుల గురించీ ఏకరువుపెట్టింది శారద. డాక్టర్ దీపిక కోరివల్లెకొచ్చి ప్రాక్టీసు చేస్తోందని విని ఆశ్చర్యపోయారా డాక్టర్ దంపతులు.

"ఈ ఊళ్ళో ప్రాక్టీసు పెట్టిందా? యంబీబీయస్ డాక్టరే? తిండి ఖర్చువెళ్తే సరిపోతుందనుకొంటోందా ఏమిటి" అని వాసు నవ్వేడు.

"ఇలాటిచోట క్లినిక్ తెరిచిందంటే ఆ మహాతల్లి ఏ అప్పలమ్మో, పల్లెటూరి బగ్గిరాయో అయిఉండాలి. సిటీలో నాలుగురోజులుండొచ్చిన వాళ్లకే ఇక్కడ ఊపిరాడదు. ఇంకావిడెలా సెటిల్అయ్యిందో ఏవ్! ఏదో గొప్పకోసం వచ్చి వుంటుందిగాని రెండ్రోజుల్లో క్లినిక్ ఎత్తెయ్యటం ఖాయం" యామిని తీర్మానించింది.

వాళ్లమాటలకి అసహ్యంపుట్టిలేచారు మాస్టారు. "మనకి తెలీనివారి గురించి ఎక్కువ మాట్లాడితే అది మన మనస్తత్వాన్ని బయటపెడుతుందంటే"

అదిరిపడి చూసింది యామిని. పల్లెటూళ్లోని బోర్డుస్కూలు మాస్టారినోట అలాటిమాటలు రాగలవని కలలో కూడా ఊహించలేదామె.

"కొన్ని కారణాలవల్ల మా పెళ్ళి అనుకోకుండా అయిపోయింది. మా మావగారు చాలా స్థితిపరుడు. పలుకుబడివున్నవారు. మా ఇద్దర్నీ అమెరికా పంపించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు"

"మంచిదేరా... నా అంతఅయినవాడివి. నీకు విడమర్చి చెప్పాల్సిన పనిలేదు. నీబాగోగుల గురించి మాకన్నా నీకే ఎక్కువ తెలుసు. నీ బాగుకోరేవాళ్ళం. నీకేది బాగన్పిస్తే అలాచెయ్యి. ఏదేశమేగినా ఎందుకాలిడినా కన్నవూరినీ, కన్నదేశాన్నీ మర్చిపోకు. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అన్నది పరాయిగడ్డమీద పది రోజులున్నాక నీకే తెలిసొస్తుందిలే"

"మీకు నామీద కోపంగా వున్నట్టుంది..."

"కోపం ఎందుకురా?... నేనెవర్ని కోప్పట్టానికి? ఆఫ్ట్రాల్ నేనో బతకలేని బడిపంతుల్ని!"

అప్పుడెప్పుడో వాసు వుద్యోగానికెళ్ళినరోజు రాత్రి వైద్యవసతిలేక దారుణంగా మరణించిన అయ్యన్నగారమ్మాయి రూపం కళ్ళముందు మెదిలింది.

కన్నీళ్ళు పొంగివచ్చాయి.

అవి కన్పించకుండా లోపలికెళ్ళిపోయారు మాస్టారు.

★ ★ ★

ఎరువుల ఫ్యాక్టరీకి ఘనంగా శంకుస్థాపన చేశారు.

ఫ్యాక్టరీ నిర్మాణ సమయంలోనేగాక తర్వాత కూడా ఫ్యాక్టరీలో ఎందరో కూలీలకి ఉద్యోగాలు లభిస్తాయని ఆ ప్రాంతవాసులంతా పొంగిపోతున్నారు.

ఇదివరకు ప్రతిచిన్నకార్యానికీ రాయుడిని ప్రత్యేకంగా పిలిచేవారు జనం. ఇప్పుడు మాస్టార్నో, శివంనో, దీపికనో పిలుస్తున్నారు.

ఊరిజనం దృష్టిలో రాయుడు నామావశిష్టుడైపోయాడనే చెప్పాలి.

అసెంబ్లీ ఎన్నికలు త్వరలో రానున్నాయని వార్తలు వ్యాపించడంతో స్వగ్రామం వచ్చేశాడు ప్రభాకర్.




తండ్రీకొడుకులిద్దరూ మారిన ఊరి పరిస్థితినీ, ప్రాంతపరిస్థితినీ సమీక్షించుకున్నారు.

ఏరకంగా చూసినా గాలి తమకి వ్యతిరేకంగా వీస్తున్నట్టు ఫీలయ్యారు.

"ఇప్పుడెలా డాడీ... ఒక్క ఎన్నికల్లోనూ పోటీ చేయకుండానే ఒక్క పదవీ చేపట్టకుండానే..." నీరుకారిపోయాడు ప్రభాకర్. తను కన్నకలలన్నీ కల్లలని ఎవరో రూఢిగా చెప్పినట్టుగా ఉందతడి పరిస్థితి.

"కంగారుపడొద్దు- ఏదోమార్గం వుండకపోదు"

"ఇంకే ముంటుంది... నామొఖం... అసలీ జనమే విశ్వాసహీనులు. వీళ్ళకోసం నువ్వెన్ని చేశావు? అవన్నీ మరచిపోయారు. ముందొచ్చిన చెవులుకన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడియైపోయాయి."

"అందుకేకదా- ఎలక్షన్ల ముందేవో నాలుగు మంచిపనులు చేసి మంచిపేరు కొట్టేద్దామనుకుంటే వాళ్ళు ముందే ముగ్గులెట్టేశారు"

"మన దృష్టి ఎన్నికలమీద ఉంటుందిగాని పునాది మీదవుండదు డాడీ. అందుకే ఇలా జరుగుతూంటుంది"

"దేశరాజకీయాలే అలావున్నాయి. నిజానికి మన దేశ రాజకీయాలు, వ్యక్తి రాజకీయాలే తప్ప వ్యవస్థా రాజకీయాలూ సిద్ధాంత రాజకీయాలుకాదు"

"అదిసరే- ఇప్పుడు మనం రక్షింపబడే మార్గమేమిటంటారు?"

ఫ్లాష్‌మెరిసింది రాయుడి బుర్రలో. "మన గ్రామ ఇలవేల్పు రక్షిస్తాడ్రా" అంతమంచి ఆలోచనొచ్చినందుకు మురిసిపోతూ అన్నారు.

"దేవుడూ, దెయ్యాలవల్లేమవుతుంది"

"ఎంతైనా అవుతుంది. దేవుడి మహత్యం నీకింకా తెలీదు. నువ్వే చూద్దువుగాని కదా కొంచెం ఓపికపట్టు"

అపనమ్మకంగా చూస్తూండిపోయాడు ప్రభాకర్.

★ ★ ★

"చెరువులోని నీళ్ళు బొత్తిగా మట్టినీళ్ళైపోయాయి. బాబయ్యా ... ఇసుకా బురదా మేటలేసేశాయంటే నమ్మండి. ఈ వేసంగిలోనైనా కొంచెంలోతు తవ్విస్తే బావుంటుంది" వృద్ధ రైతన్నాడు మాస్టార్తో.

"నిజమేనండి. పంచాయతీ బోర్డు మెంబర్లతోనూ, రాయుడిగార్తోనూ మాట్లాడదాం"

"నేన్చెప్పి చూశానండి. ఎవ్వర్లోనూ కదలికలేదు. ఏమైనా అయితే మీవల్లే అవ్వాలి, వాళ్ళవల్లేమీకాదు"

శివంతో చర్చించారు మాస్టారు.

"ప్రస్తుతం స్కూలు బిల్డింగు గొడవలోవున్నాంకదా. పోనీ ఏవంటాడో రాయుడిగారి దగ్గరికి కొందర్ని పంపిస్తే? ఎంతైనా ప్రెసిడెంటు కదా!" అన్నాడతను.

కొందరు పెద్దల్ని పంపించారు. సంగతి విని ఎగిరిగంతేశాడు రాయుడు.

"ఊరి బాగుకోసం మీరెంతో ఇదవుతూవచ్చి అడిగితే నేను కాదంటానా చెప్పండి?" అన్నారు.

"మేమే కాదు - అంతా ఇదవుతున్నారు. ఇబ్బందిపడుతున్నారు. నిజానికి మమ్మల్ని శివమూ, మాస్టారూ కలిసి పంపించారు"

రాయుడి మొఖం ఎర్రబడింది. "ఓహో ... కీలకం అక్కడుందన్నమాట. ఈ పనివాళ్ళవల్ల అవ్వదని గ్రహించి తెలివిగా నా దగ్గరకి పంపించారన్నమాట. వాళ్ళని నమ్ముకుంటే ఇంతే. పెద్దపనులకోసం నన్నో మరొకర్నో ఆశ్రయించాల్సిందే"

"మేం రాయుడిగార్ని అర్థించటంలేదు. గ్రామ సర్పంచ్‌ని అడుగుతున్నాం" ఒకరన్నారు రోషంగా.

"అలాగా బాబూ ... మన పంచాయతీలో ఫండ్సులేవు. సమితినుంచి వచ్చే అవకాశమూ లేదు. ఏంచేస్తానంటారు!"

"మేమే తవ్వుతాం. స్కూలు బిల్డింగుకి చందాలేసుకోలేదూ! అలాగే వేసుకుంటాం. పంచాయతీ పర్మిషనివ్వండి చాలు"

"సంతోషంగా ఇస్తాం ... చెరువు తవ్వటమంటే మజాకాకాదు"

వ్యంగ్యంగా అని హ్హ హ్హ అంటూ నవ్వేరు గాని ఆనవ్వు వినకుండానే నిష్క్రమించారంతా!

ఆ సాయంత్రం గ్రామప్రముఖులూ, యువకులూ మాస్టారింటిముందు సమావేశమయ్యారు.

మాస్టారు గొంతు సవరించుకున్నారు—

"ప్రతిదానికీ ఎవరో చెయ్యాలని ఎదురు చూసేకన్నా మన సమస్యల్ని— కనీసం చేతనైనవాటిని— మనం పరిష్కరించుకోవడం ఉత్తమం. ఇంతకీ నేను చెప్పేదేమిటంటే..."

"ఇంకేం చెప్పొద్దు మాస్టారూ! ఇప్పుడే వెళ్ళి పెద్ద చెరువు నీరు తెగ్గొట్టేస్తాం. చిన్న చెరువు నిండా నీరుపెట్టేస్తాం. రేపట్నుంచి పెద్ద చెరువుని ఎండగడతాం. పదిరోజుల్లో లోయ తవ్వకం పూర్తిచేస్తాం" అన్నారు యువకులు లేచి పిడికిళ్ళు బిగించి.

"భేష్ ... చూశారా? అయిదు వేళ్ళనీ చాచితే అర్థింపు అవుతుంది. ఫలితం వుండక పోవచ్చు. అయిదు వేళ్ళనీ మడవండి పిడికిలి అవుతుంది. దాని శక్తికి తిరుగులేదు ... వుండదు!"

★ ★ ★

మాస్టారికి ఇన్సూరెన్స్ సొమ్ము ఇరవై ఆరువేలొచ్చింది.

దానికోసమే కళ్ళుకాయలు కాచేలా చూస్తున్నారేమో పరమానందపడిపోయారు.

"వానుకి పంపిస్తారా?" శారద అడిగింది.

"వాడికెందుకు?"

"అమెరికా వెళ్ళడానికి చాలా ఖర్చవుతుందిట. నాన్నగారికింకెంతో సర్వీసులేదుకదా ఇన్సూరెన్సూ, గ్రాట్యుటీ సొమ్ము రాగానే నాన్నగారికి నచ్చచెప్పి పంపించేట్లు చూడమని మరీమరీ చెప్పివెళ్ళేడు"

"నిజంగానా ... మరి మన సంగతేం చెప్పలేదూ?"

"పెన్షన్ వస్తుందికదా అన్నాడు. నెలనెలా తను కూడా కొంత పంపిస్తానన్నాడు."

"కొడుక్కావాలని కలవరించావే. చూశావా ... కొడుకులంటే ఎలాటివారో. వీడా నా కడుపు నబుట్టిన కొడుకని మూర్ఛబోవాలి మనం!"

"ఎన్ననుకుంటే ఏంలెండి - వాడు మన బిడ్డకాకపోతాడా, మనం వాడికి కన్నవాళ్ళంగాక పోతామా! లోకంతీరు ఎలావుంది. ఎవర్ననీ ఏంలాభం?"

"చూడు శారదా ... వాడికెంత చేయాలో అంతచేశాను. ఒకరకంగా వాడీ వూరి జనానికేదో మేలు ఒరగబెట్టేస్తాడనే పిచ్చిభ్రమలో శక్తికి మించే చేశాను. నేనింక వాడికోసం ఒక్కపైసా కూడా ఖర్చుపెట్టదలచలేదు. ఇక ఈ సొమ్మంటావా— అప్పుతీర్చాలి. అంత జరిగినా అప్పుసంగతి నువ్వెలా మర్చిపోగలిగావో అర్థంకావట్లేదు. కన్నప్రేమ బాధ్యతల్ని విస్మరించేట్లు చేసింది కాబోలు! మిగిలిన సొమ్ములో నగం స్కూలు బిల్డింగుకి చందా ఇస్తాను. మిగతా నగమూ - సూర్యచంద్రుల పేర బ్యాంకులో వేస్తాను. వారి భవిష్యత్తుకి చిన్నదైన బాటవెయ్యాలి. అది మన బాధ్యత. నాకు కొడుకెంతో కూతురూ అంతే— ఇద్దరూ రెండు కళ్ళు"

తనెంత తప్పుగా మాట్లాడిందో అర్థమవ్వగా తలొంచేనుకుంది శారద.

మాస్టారు తిన్నగా షావుకారింటికెళ్ళారు. నరసింహం హత్య తర్వాత ఆ గడపతొక్కటం ఇదే.

సుదర్శనం ఇంట్లోనే వున్నాడు.

"బాబూ సుదర్శనం..."

ముఖం తిప్పేసుకున్నాడతడు.

"జరిగిందాన్లో నా పాత్రేమీలేదు. ఆ నిజం నాకు తెలుసు. ఆ భగవంతుడికి తెలుసు. నువ్వుకూడా నమ్మితే సంతోషిస్తాను"

"..................."

"పోనిలే బాబు ... నేను నిర్దోషినని నీ మనస్సుకి తోచినప్పుడే నమ్ముదువుగాని. నిన్ను నమ్మించటానికి వ్యర్థప్రయత్నాలు చెయ్యటానికి రాలేదు. ఋణ విముక్తుణ్ణవుదామనొచ్చాను..."

చివ్వున తలెత్తాడతడు.

"చనిపోయేముందు నా అప్పు పదిహేడు వేలన్నారు షావుకారుగారు! అప్పట్నుంచీ ఈనాటికి వడ్డీతో ఇస్తున్నాను. తీసుకొని సరిచూసుకో బాబూ"

"నోటు లేకపోయినా..."

"నోటు లేకపోతేనేం మాటలేదూ? మాటని





విశ్వసించనివారికి నోటుగాని విశ్వసించేవారికి దాని అవసరమేముందయ్యా?''

తండ్రి చంపబడ్డాక తనంతటతాను ముందుకొచ్చి తీరుస్తోన్న తొలి అప్పు ఇది! ప్రోనోట్లు లేవని కొందరు చంకలుగుద్దుకొంటే ఈయన...

''మాస్టారూ ... నన్ను క్షమించండి''

''పిచ్చివాడా ... ఇందులో ఏముంది చెప్పు? నీస్థానంలో నేనున్నా అలాగే ప్రవర్తిస్తాను. ఊరుకో ... సరిచూసుకో...''

''చూడక్కర్లేదు మాస్టారూ - సరిపోయింది''

''ఇన్నేళ్ళకి ఋణశేషం లేకుండా చేసుకున్నందుకు మహదానందంగా వుంది సుదర్శనం! వస్తానయ్యా...''

వెనుతిరిగి వెళ్తోన్న మాస్టారివంక చూస్తూండిపోయాడతడు కన్పిస్తున్నంతసేపూ.

★ ★ ★

ఎరువుల ఫ్యాక్టరీ పని చురుగ్గా సాగుతోంది.

పునాది తవ్వకంపని జోరుగా సాగుతోంది.

ఒకచోట తవ్వుతోంటే ఖంగుమని శబ్దంవచ్చింది.

''రాళ్ళున్నాయి కాబోలు జాగ్రత్తగా తవ్వండి'' మేస్త్రీ అన్నాడు.

మరికొంచెం తవ్వినవారలా ఆశ్చర్యపోయారు.

శ్రీరామ విగ్రహం అది!

క్షణాల్లో ఇంజినీర్లూ, వర్కర్లూ అంతా పోగైవింతగా, భక్తిగా చూడసాగారు.

ఏంచేయాలో ఎవరికీ తోచలేదు.

ఇంతలో ఆఘమేఘాలమీదొచ్చారు రాయుడు.

''దూరంగా జరగండి ... దూరంగా జరగండి. ఇదిగో ఇక్కణ్నుంచే నా భూమి. ఫ్యాక్టరీకమ్మిన భూమి. నా భూమిలో రాముడు దొరికాడు. రాత్రి కలలో చిరునవ్వుతో కన్పించి అభయహస్తం చూపితే ఏమిటో అనుకున్నానుగాని రాముడిలా నా భూమిలో వెలుస్తాడనుకోలేదు. నన్ను ధన్యుణ్ని చేస్తాడనుకోలేదు. ఇక్కడే ఎక్కడో సీతమ్మవారు కూడా వుంటుంది. తవ్వండి బాబూ ... తవ్వండి...''

పిచ్చిగా ప్రవర్తిస్తున్న ఆయన్ని చూసి ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయారంతా.

గబగబా తవ్వేశారు కొందరు.

పదిగజాల దూరంలో సీత విగ్రహం కూడా దొరికింది.

రెండిట్లనీ ఒకచోట చేర్చారు.

గోపాలచార్యులొచ్చారు దేవుణ్ని స్తుతిస్తూ. పానకాలు హడావిడిచేశాడు. కొబ్బరికాయల బండితో వచ్చాడు ప్రభాకర్. ఆడవాళ్ళు సరేసరి.

వంద కొబ్బరికాయలు కొట్టి అర్చనచేశారు రాయుడు. క్షణాల్లో అదో తీర్థప్రదేశమవ్వగా తండోపతండాలుగా రాసాగారు జనం.

''మన గ్రామ ఇలవేల్పులు అవతరించిన ఈ ప్రదేశంలోనే పెద్ద గుడికట్టిస్తాను'' అని ప్రకటించారు రాయుడు.

ఫ్యాక్టరీ పని ఆగిపోయింది!

శివం తదితరులకి దిక్కుతోచకుండా వుంది. పరిస్థితినెలా అదుపులోకి తేవాలో తోచటంలేదెవ్వరికీ.

మరోచోటా మరోచోటా విగ్రహం వెలిస్తే ఏ ఇబ్బందీ వుండేదికాదు. కాని ఫ్యాక్టరీ స్థలంలో అలా జరగటం...

''చూస్తోంటే ఏదో కుట్రలావుంది మాస్టారూ'' శివం అన్నాడు.

''అలా తీసిపారెయ్యకు శివం! దేవుళ్ళు అవతరించిన పవిత్రభూమి ఇది. కాలం తాకిడికి తట్టుకోలేకా మత విద్వేషుల క్రౌర్యం నుంచి రక్షింపబడుటకో కొన్ని విగ్రహాలు భూమి కడుపులో దాక్కొని వుండొచ్చు. యాదృచ్ఛికంగా అవిప్పుడు బయటపడివుండొచ్చు''

''మీరు కూడా వంతపాడుతున్నారన్నమాట. మతం ఒక మత్తు. ఆ మత్తులో కొట్టుకుపోతున్నవాళ్నెవరూ రక్షించలేరు. వారికి నిజానిజాలు కన్పించవు. ఊహలే కన్పిస్తాయి. కట్టు కథలే విన్పిస్తాయి'' ఒక యువకుడన్నాడు కోపంగా.

''నిజమే మాస్టారూ ... మతం ఎంత మూర్ఖమైనదంటే...''

''మతాన్నీ మతవిశ్వాసాల్నీ కించపరచి హేళనచెయ్యటం మంచిదికాదు శివం'' అడ్డొ





చ్చేరు మాస్టారు.

"లేకపోతే ఏవిటి మాస్టారూ ... విగ్రహాలు దొరికాయని, దేవుడు వెలిశాడనీ, మహిమాత్మ మనీ రాయుడు మహాభక్తుడనీ, అదనీ ఇదనీ గోరంతల్ని కొండంతలుచెయ్యటం ఎందుకు? ఫ్యాక్టరీ నిర్మాణానికి అడ్డుతగలటం ఎందుకు? అది మూర్ఖపు లక్షణంగనుకే బుద్ధుడు విగ్రహారాధనని వ్యతిరేకించాడు"

"శివం! మీ ఆలోచనకీ, మాతరపు దృక్పథానికీ మధ్య చాలా అంతరంవుంటుంది - ఒప్పుకుంటాను. అయినా మతాన్ని అలా హీనంచేసి మాట్లాట్టం ధర్మంకాదు. మతం అంటే ఏమిటి? ఒక అభిప్రాయం. అభిమతం. శాస్త్రం. నమ్మకం. జ్ఞానం. మా మతం ఇదీ అంటే - మా నమ్మకాలివీ అని చెప్పటం. అన్ని మతాలూ చెప్పింది ఒక్కటే. మనిషే దేవుడని. మానవ సేవే మాధవ సేవయని. ప్రేమే దైవమని. ఒకర్నొకరు ద్వేషించుకోమనీ నరుక్కోమనీ కొట్టుకోమనీ దోచుకోమనీ ఏ మతం చెప్పలేదే? గీతలో చెప్పినట్టు దేవుడు ఇందుగలడందు లేడను సందేహం అక్కర్లేదు.

"అన్నిట్లోనూ అందర్లోనూ వున్నాడు దేవుడు. అది తెలుసుకున్నవాడు బ్రహ్మజ్ఞానుడవుతాడు. అహంబ్రహ్మాస్మి అనుకుంటాడు. అది తెలుసుకోలేని పామరుల సంగతేమిటి? వాళ్ళకోరూపం, ఓ కల్పన, ఒకథ లేకపోతే, ఆధారం లేకపోతే, గాడి లేకపోతే దేవుణ్ని తలచలేరు... పూజించలేరు. వారికోసం ఉద్భవించినవే విగ్రహాలు."

"నిజమే కావొచ్చు మాస్టారూ! కాని వాస్తవంలో జరుగుతున్నదేమిటి? విగ్రహాలతో గుళ్ళతో వ్యాపారం చేస్తున్నారు. అమాయక భక్తుల్ని నిలువుదోపిడీ చేస్తున్నారు. దేవుణ్నీ మతాన్నీ అడ్డుపెట్టుకుని స్వార్థ ప్రయోజనాలు సాధించుకుంటున్నారు. దేవుడు, పరలోకం, కర్మ, పూర్వ జన్మఫలం- వగైరా కబుర్లు చెప్పి అభాగ్యుల్ని అణగదొక్కేస్తున్నారు. వీటన్నిట్నీ సమర్థించమనే చెబుతారా చెప్పండి?"

"ఎలా అంటానూ? మితిమీరిన స్వార్థం ఏ రూపంలో వున్నా ఖండనీయమే. దేవుణ్నీ వ్యాపారవస్తువుగా మార్చినవారిని క్షమించటం కూడా పాపమే"

యువకులు సంతోషించారు.

"ఇప్పుడేం చేద్దామంటారు?"

"ఫ్యాక్టరీ పని ప్రారంభమయ్యేక విగ్రహం దొరకటం అదీ రాయుడి పొలంలో దొరకటం అంతా అనుమానంగా వుందనీ, పరిశోధన చేసినిజం నిగ్గుతేల్చమని కలెక్టర్ని కోరదాం"

వెంటనే అంగీకరించారంతా




రాయుడు ఓ బాబాగార్ని తీసుకొచ్చి సీతారాముల విగ్రహాలు లభించిన చోట భారీగాయజ్ఞం చేస్తున్నారు.

ఆయన భక్తాగ్రేసురుడిగా దేవుడి ఆశీర్వాదం లభించిన పుణ్యపురుషుడిగా రూపుదిద్దుకుంటున్నారు జనం హృదయాల్లో. విషయలంపటాల్నుంచి సన్యాసం స్వీకరించి మిగతా జీవితాన్ని భగవత్సేవలో గడపమని కలలో భగవంతుడాదేశించాడని చూచాయగా చెబుతున్నారు. అంతా కొడుక్కి అప్ప జెప్పమంటున్నాడని కూడా చెబుతున్నారు.

ప్రభాకర్‌పూర్వజన్మ సుకృతంవల్ల దేశం గర్వించేంత నాయకుడవుతాడని చెప్పేరు బాబాగారు.

ఫ్యాక్టరీవాళ్ళు తన దగ్గర్నుంచి తీసుకున్న భూమిని తిరిగి తీసేసుకోవాలనో పక్కన ప్రయత్నించసాగారు రాయుడు. ఫ్యాక్టరీ కట్టేక ఆస్థలం విలువ అనేక రెట్లు పెరిగిపోతుందని ఆయన ఆలోచన- అందుక్కూడా గుడిని సావుగా వువయోగించుకోవాలని చూస్తున్నారాయన!

యజ్ఞానికి ఆ వూరి జనమేకాదు ఆప్రాంత జనమంతా ఇసుకవేస్తే రాలనంతగా వచ్చేశా

రు.

ఊర్లో ఎక్కడ ఏ మూలచూసినా దాని గురించే చర్చ-

శివానికి చాలా అసహనంగా, కోపంగా వుంది.

ఇంట్లో వుండలేక డాక్టర్ దీపిక దగ్గరికెళ్ళాడు.

సంతోషంగా ఆహ్వానించిందామె.

వాళ్ళిద్దరి గురించీ పానకాలు వూళ్ళో గుసగుసలు పుట్టించాడు. నీలి వార్తలు ప్రచారంచేశాడు. గోపాలాచార్యులామెని మందలించారు.

అంతవరకూ సన్నిహితంగా వున్నా ఒకటవ్వాలన్న ఆలోచన రాలేదు వాళ్లకి. అంతా అనుకుంటున్నప్పుడు వాటిని నిజంచేస్తే తప్పేమిటనుకున్నారు. ఇద్దరూ కలిసి మాట్లాడుకున్నారు. మాస్టారితో చెప్పి ఒకటవ్వాలని నిశ్చయించుకున్నారు. ఇంతలో శివం తండ్రి మరణించడంతో ఆ ప్రపోజల్ వాయిదావేశారు.

సంగతి విని జనం ముక్కుమీద వేలుంచుకున్నారు.

వర్ణాంతర వివాహమా- అని మండిపడ్డారు గోపాలాచార్యులు. వంశాన్నీ గౌరవాన్నీ లాక్కొచ్చి మాట్లాడారు. దీపిక విన్పించుకోలేదు. ఆమె అన్నగారికి కబురంపారు. రామాచారి వచ్చి గట్టిగా మందలించి శపించి ఆమె ఖర్మకి వదిలేసి వెళ్ళిపోయాడు.

దానాదీనా మరింత సన్నిహితులయ్యారిద్దరూ.

"అంతా బాగానేవుంది, అంతా బాగానే వింటున్నారు. అంతా సరైన దారిలోనే నడుస్తున్నారని పొంగిపోతోంటే విగ్రహాల వ్యవహారం వచ్చిపడింది. జనాన్నీ మైకంలోంచి బయటికి లాగటమెలాగో తెలీటంలేదు." నిరుత్సాహంగా, అన్నాడు శివం.

దీనిగురించెక్కువగా ఆలోచించవద్దు. తరతరాల్నుంచీ మెదళ్ళని పట్టిన బూజు ఒక్కరోజులో వదిలించలేం. కొంచెంటైము పడుతుంది. ఓపిక పట్టాలి. ఇక కొత్త గొడవంటావా- ఒకటి రెండు రోజుల్లో అంతా సెట్‌రైట్‌అయిపోతుంది. చూడు"

"అదేమైనా ఫర్లేదుగాని దానివల్ల ఫ్యాక్టరీని ఇక్కడ కట్టడం విరమిస్తారేమోనని భయంగా వుంది"

"అలాటిపని చెయ్యరు. అంతగా కుదరకపోతే అక్కడే చిన్నగుడి కట్టిస్తామని ఒప్పుకుంటారనుకుంటాను"

హడావుడిగా వచ్చాడు మూర్తి.

"ఆర్కియాలజిస్టులూ పోలీసులూ వచ్చారు. మూజియం నుంచి సీతారాముల విగ్రహాలెవరో దొంగిలించారంట. కలెక్టరుగారు కూడా ఇదేమిటో తేల్చమని ఆదేశించారట"

"అయితే ఇక ఆగొడవకి తెరపడినట్టే" ఉత్సాహంగా అన్నాడు శివం.

అక్కడ పోలీసుల్ని చూసి అంతా బెదిరారు. జనం గుసగుసలు పోయారు.

విగ్రహాల్ని పరీక్షచెయ్యాలన్నారు. రాయుడు మొదట వ్యతిరేకించినా కడకి ఒప్పుకోక తప్పలేదు.

పసుపు కుంకుమలవల్ల, అభిషేకాలవల్లా రూపుమారిపోయిన విగ్రహాల్లోని ఒకటి తీసుకుని శుభ్రంగా కడిగారు. కొలతలు, షేపు అన్నీ పరిశీలించారు. ఆర్కియాలజిస్టుల ముఖాలు వికసించాయి.

"ఇవి మ్యూజియం నుంచి దొంగిలించబడ్డ విగ్రహాలే!"

రాయుడు అదిరిపడ్డాడు. ఆయన ముఖంలోనుంచి రక్తమంతా పారిపోయింది. ఎక్కణ్నుంచో పాత విగ్రహాలు సంపాదించి తెమ్మని పానకాల్ని పంపిస్తే అతడెవరి ద్వారానో మ్యూజియంనుంచి....?

"విగ్రహాలు దొరికిన ముందురోజురాత్రి వీరేశం ఇట్నుంచి కంగారుగా రావటం చూశాను" అన్నారొకరు.

పోలీసులతడి కోసం హడావుడిగా వెదికారో లేదో అతడక్కడే దొరికాడు. అతడి పీకపట్టుకునేసరికి "పానకాలుగారూ..." అని ఆపై మాటల్ని మింగేశాడు.

జనం రెచ్చిపోయారు ఇందర్ని ఇంతవచ్చిగా మోసగిస్తాడా అని.

ఇదంతా రాయుడు చేయించాడు అన్న సంగతి బయటపెట్టేశాడు పానకాలు.




చిత్రమైన ప్రపంచం

# ఆసియాలోనే అతిపొడవైన చీరుచెట్టు

హిమాలయ పర్వత సానువుల పరిసరాలు కొన్ని దట్టమైన అడవులమయం. నౌగాఁవ్ వెళ్ళేదారిలోని అడవుల్లో చీరుచెట్లు 50 అడుగులు మొదలు 125 అడుగుల పొడవుదాకా పెరుగుతాయి. 12 అడుగుల వ్యాసం కలిగి వుంటాయి.

నౌగాఁవ్ గ్రామం దగ్గర్లోగల 'మోరి'లోని చీరుచెట్టు ఆసియాలోకల్లా అతి పొడవైనది. ఇది మూడేళ్ళక్రితమే 60.55 మీటర్ల పొడవూ, రెండున్నరమీటర్ల వ్యాసం కలిగి వుంది. ఈ విశేషం విని ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఎందరో వృక్షశాస్త్రజ్ఞులూ, సైంటిస్టులూ, మేధావులూ దీని సందర్శనార్థమై 'మోరి'కి వచ్చారు.

సాధారణంగా "చీర్" చెట్లన్నీ అందంగానే వుంటాయి. వసంతఋతువులో వీటికి విరివిగా పూల గుత్తులు పూస్తాయి. విత్తనాలు వేసవికాలారంభంలో మొలకెత్తుతుంటాయి. చీర్ చెట్టు విత్తనం ఒక అంగుళం పొడవున సీతాకోకచిలుక ఆకారంలో వుంటుంది. హిమాలయ పరిసరాల్లోనేగాక, ఆఫ్ఘనిస్తాన్ నుండీ కాశ్మీర్ వరకూ, అస్సాం, నేపాల్, బర్మాల్లోనూ విరివిగా పెరుగుతాయి.

ఈ చెట్లనుండి తీసే 'లీసా' అనే పదార్థాన్ని టర్పెంటైన్ ఆయిల్ తయారీలో వాడుతారు. అయితే పూర్తిగా ఎదుగని చెట్లనుకూడా కొందరు డబ్బుకు ఆశపడి 'లీసా' తీసుకునే ప్రయత్నంలో కొట్టివేస్తుంటారు. అగ్గిపెట్టెల్లో వాడే పుల్లల్ని ఈ చీర్‌చెట్ల బెరడుతోనే తయారుచేస్తారు. వేసవిలో చీరుచెట్ల ఆకులు రాలిపోతుంటాయి. వీటికి మండే శక్తి అధికం.

'మోరి'లోని ఈ 'చీరుచెట్టు'ని చూసి పండిట్ నెహ్రూ దీని సంరక్షణార్థం అయిదు వేల రూపాయలు విరాళమిచ్చారు. తగిన జాగ్రత్తలు తీసుకుంటే ఈ చెట్టుని మరో యాభైఏళ్ల వరకు బతికించవచ్చు.



ఎక్కువ మోతాదులో ఖనిజలవణాలున్న నీరు ఈ చెట్టు కిందిభాగంలో ప్రవహిస్తున్నందువల్లనే ఇది ఇంత ఏపుగా పెరిగిందని భూగర్భశాస్త్రజ్ఞులంటున్నారు.

ఈ చీరుచెట్టు కొమ్మల్ని పరిశీలించిన వృక్షశాస్త్రజ్ఞులు మిగతా చీరుచెట్లకంటే ఇవి భిన్నంగా వున్నాయన్నారు. స్థానికులు ఈ చెట్టుకేదో దైవమహత్తు ప్రతిపాదించి మొక్కుతుంటారు కూడా. ★

రాయుడప్పటికే తన రాజ్‌దూత్ ఎక్కి గతుకుల రోడ్డుమీద అరవైకిలోమీటర్ల వేగంతో పారిపోతున్నాడు.

జనానికి దొరికితే సున్నంలోకి ఎముక మిగల్చరని తెలుసు. అందుకే చావు భయంతో పారిపోతున్నాడు.

కాని ఒక గోతి దగ్గర మోటారుసైకిలు జంప్ చేసి చెట్టుని గుద్ది కూలిపోయింది. అతడి చెయ్యి పచ్చడైపోయింది.

భయంతో వెర్రిగా అతడు చేసిన ఆర్తనాదం ఆ ప్రాంతాన్ని కుదిపేసింది.

పోలీసులూ జనమూ గబగబా వచ్చారు. ఆయన్నిజీపులో వేసుకుని దీపిక ఆసుపత్రికి తీసుకెళ్ళారు. చెయ్యి చాలావరకూ పిప్పి పిప్పి అయిపోయిందనీ, అతుక్కోవడం దాదాపు అసాధ్యమనీ అభిప్రాయపడిందామె. కుడిచేతిని తొలగించటం మంచిదని చెప్పింది ప్రభాకర్తో.

"అన్యాయం! మీకు మా డాడీమీద కసివుంటే ఇంకోలా తీర్చుకోండి- కానిలాకాదు"

"పిచ్చిగా మాట్లాడకండి. నేను డాక్టర్ని. ప్రాణం పోయటమే నాకు తెలుసు. అతడు రోగి. రోగుల్లో మిత్రులూ శత్రువులూ అంటూ వుండరు. రోగులంతా ఒకటే నాకు. పరిస్థితి బాగుండలేదు. ఇప్పటికిప్పుడు ఆపరేషన్ చేస్తే మంచిది. మీరు చెయ్యమంటే చేస్తాను లేదా పట్నం తీసుకెళ్ళండి".

బాధతో గిలగిలలాడుతున్న తండ్రిని చూడలేకపోయాడు. పట్నం తీసుకెళ్ళేలోపల పరిస్థితి విషమిస్తుందేమోనని భయపడి తలూపాడు ప్రభాకర్.

ఆపరేషన్ పూర్తయింది. కుడిచెయ్యి పూర్తిగా తొలగింపబడింది.

స్పృహ వచ్చాక బారువుమన్నాడు రాయుడు.

డిశ్చార్జి అవుతూ అన్నాడు- "నేను చాలా పాపాత్ముడినమ్మా! నిన్నిక్కణ్ణుంచి తరిమెయ్యమనీ, వినకపోతే చేతులిరిచెయ్యమనీ చెప్పేను. భగవంతుడు నాచెయ్యే విరిచేశాడు. ఎన్నో ఘోరాలు మానవుడనే వాడు చెయ్యనివి చేశాను. ఆఖరికి దేవుడు నోట్లోకూడా మన్నుకొట్టేనమ్మా. ఎప్పుడో ఏ జన్మలోనో నాకు తెలీకుండా చేసిన పుణ్యమేదో నీరూపంలో వచ్చి కాపాడింది. నీరుణం తీర్చుకోలేనమ్మా. నా డబ్బుతో నా స్థలంలో ఆసుపత్రి కట్టిస్తాను. నువ్వు నాలాటి ఎందరో ఆప్తులకీ రోగ సర్పద్రష్టులకీ సేవచెయ్యాలి. అలాగే దేవుడు ఉత్సవాలు కూడా ఇక నాడబ్బుతోనే చేస్తాను. నా పాపాన్ని ప్రక్షాళనం చేస్తుకుంటాను. వస్తానమ్మా... దేవుడు నిన్ను తప్పక దీవిస్తాడమ్మా- దీవిస్తాడు" అని కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

స్కూలు బిల్డింగ్ నిర్మాణం పూర్తయింది. ప్రారంభోత్సవానికి ఘనంగా ఏర్పాటు చెయ్యాలని చూస్తోంటే రిజిస్టర్డ్ కవరొచ్చింది మాస్టారికి.

తెరిచారు- రిటైర్‌మెంట్ ఆర్డర్!

మరి పదిరోజుల్లో రిటైరవ్వబోతున్నారు!

ఇన్నాళ్ళకి విశ్రాంతి లభిస్తోందికదా అన్న సంతోషం. భావిపౌరులకి భారత భాగ్య విధాతలకి చదువుచెప్పే అవకాశం కోల్పోతున్నాను కదా అన్నవిచారం- రెండూ ఒక్కసారే జంటగా ఆయన గుండెల్ని నొక్కేశాయ్.

"అంత ఇదైపోతున్నారు ఏవిటి సంగతి మాస్టారూ" పరంధామయ్యా అడిగారు.

"ఇంకొద్దిరోజుల్లో రిటైర్ కాబోతున్నానండీ"

"నిజమా? మరి చెప్పరేం- పిల్లలూ... ఇంకొన్ని రోజుల్లో మాస్టారు రిటైరైపోతున్నారు. ఇక నేనే హెడ్మాస్టార్ని" అన్నారు ఆనందంగా.

పిల్లలకేం అర్థంగాక వింతగా చూస్తుండిపోయారు.

"రిటైరవ్వడమంటే వుద్యోగం పోతుందన్న మాట. ఇంక బడికిరారు. పాఠాలు చెప్పరు. ఇంటి దగ్గరే వుంటారు"

అన్ని క్లాసుల పిల్లలూ వచ్చేసి మాస్టారిచుట్టూ చేరి దీనంగా దిగులుగా చూస్తూనిలబడ్డారు.

వారి బుగ్గలు నిమిరి "మీరేం ఇదవ్వకండి పిల్లలూ... నేనీవూళ్ళోనే వుంటాను. మీరెప్పుడింటికొచ్చినా పాఠాలు చెబుతాను. కథలు చెబుతాను... సరేనా?" అన్నారు.

తలలూపారువాళ్ళు.

క్షణాల్లో వూరంతా చాటింపేశారు వరం

ధామయ్య.

అంతా ఆదుర్దాగా వచ్చి అడిగారు.

ఒకటేమాట-

"రిటైరయ్యాక వూరొదిలి వెళ్ళిపోతారా?"

చిరునవ్వుతో సమాధానమిచ్చారు. "నా కట్టె కూడా ఈ వూరి శ్మశానంలోనే కాల్తుందయ్యా"

శివం, దీపిక, మూర్తి తదితర యువకులంతా రిటైర్‌మెంట్‌రోజున మాస్టారికి పెద్దపెట్టున సన్మానం చెయ్యాలనుకున్నారు. అదేరోజున స్కూలు బిల్డింగుకి కలెక్టరుచేత ప్రారంభోత్సవం చెయ్యాలనుకున్నారు.

సన్మానానికి మాస్టారొప్పుకోలేదు.

కనీసం చిన్న ఫంక్షన్ ఏర్పాటుచెయ్యాల్సిందనీ, అప్పుడే అభినందన సభకూడా పెట్టడానికి అంగీకరించమని కోరారు.

"పంక్షన్ దేనికి?"

"రెండు శుభకార్యాలు మీచేతులమీదుగా జరపాలి"

"ఒకటి తెలుసు- రెండోది?"

"మూర్తి- సరితల వివాహం"

"నిజమా?" గుమ్మంలోవున్న కూతురి వంక సాభిప్రాయంగా చూశారు. తలొంచుకుందామె.

"మీకు ముందే చెప్పి అనుమతి తీసుకుందామనుకున్నాంగాని ధైర్యం చాల్లేదు. శివం ఆ బాధ్యత తీసుకుంటానన్నాడు.." మూర్తి అన్నాడు.

"సంతోషం బాబూ" నాకింతకంటే ఏంకావాలి? పచ్చని వూరు -పచ్చని యువత- మీ అందరివల్లా నా జీవితం పరిపూర్ణమయిందయ్యా"

ఆనందభాష్పాలు జలజలారాలాయి మాస్టారి నేత్రోద్వయం నుంచి.

★ ★ ★

స్కూలు భవన ప్రారంభోత్సవం చెయ్యడానికి మాస్టారు అన్నివిధాలా అర్హులని కలెక్టరుగారు చెప్పడంతో రిటైర్మెంటురోజున గ్రామస్తులూ, శిష్యులు కలిసి మాస్టారిచేత ప్రారంభోత్సవం చేయించారు.

అశ్రునయనాలతో భవనాన్ని చూశారు.

"పిల్లలింక వర్షాలకి ఇబ్బంది పడక్కర్లేదు. కప్పుకూలిపోతుందేమోనని భయపడక్కర్లేదు. గాలీ వెలుతురూ సౌకర్యాలూ అన్నీ వున్న భవనం ఇన్నాళ్ళకి మీకు లభించింది పిల్లలూ! ఈ జీవితపుబడిలో చక్కని పునాదులేసుకోండి. ఉన్నతసోపానాల మీంచి పైపైకెళ్ళండి. మన ఊరికీ దేశానికీ కీర్తిప్రతిష్ఠలు తీసుకురండి" అంటూ చిన్నారిపిల్లల్ని ఆశీర్వదించారు.

అనంతరం మేళ తాళాలతో ఊరేగించి వేదిక మీదకి తీసుకెళ్లారు.

సభకి చెమ్మగిల్లిన నయనాలతో నమస్కరించారు. శారదని వేదికమీదకి తీసుకొచ్చి ఆయన సరసన కూర్చోబెట్టారు.

శివం- దీపికల్ని సూర్యమూ

మూర్తి- సరితల్ని చంద్రమూ

చెరోవైపునుంచీ వేదికమీదకి తీసుకొచ్చారు.

పూలదండల్ని అందించారొకరు.

జంటలు దండలు మార్చుకున్నాయి.

చప్పట్లు వర్షమై కురిశాయి.

మాస్టారు ఆశీర్వదించారు. వృద్ధులాశీర్వదించారు.

పిల్లల్నుంచి పెద్దలవరకూ ఎందరెందరో వచ్చి మాస్టారు దంపతులకి పూలమాలలర్పించారు. నమస్కారాలు చేశారు. వృద్ధులు దీవించారు. ఊరు ఆశీర్వదించింది.

మాస్టారు లేచి నమస్కరిస్తూ సజలనేత్రాలతో జనంవంక చూశారు. ప్రేమవాత్సల్యాలతో అభిమానంగా చూశారు.

"నా గ్రామ ప్రజలకి పాదాభివందనం చేస్తున్నాను.

నా శిష్యుల మాట కాదన్లేక ఈ సన్మానాని కొప్పుకున్నానుగాని నిజానికి నేను దీనికి తగను. ఇది నాకు చేసిన సన్మానం కాదనీ మంచికీ- మానవతకీ చేసిందని భావిస్తూ నా కృతజ్ఞతలర్పిస్తున్నాను.

నేను గ్రామాన్నేదో చేశానన్నాడు శివం. నిజానికి చేసింది నేనుకాదు నా శిష్యులు. చీకటిని తిడుతూ కూర్చునేకన్నా ప్రయత్నించి ఎంత చిన్న దీపమైనా వెలిగించటం ఉత్తమమని నా నమ్మకం. నేను చేసిందదే. ప్రయత్నమనే చిరు

దీపం వెలిగించాను. దానికి మరికొన్నిఒత్తులు జతచేసి మరింత నూనెపోసి అఖండదీపం చేశారు నా ప్రియశిష్యులు. వారందరికీ నా ఆశీర్వాదాలు.

నా శిష్యుల్ని పదేపదే పొగుడుతున్నానని మీరేం అనుకోవద్దని నా ప్రార్థన. మంచిని గుర్తించి ప్రోత్సహించటం మన బాధ్యత. అసలు గురువంటే ఎవరు? మంచి మాటా పాటా అక్షరం వృత్తీ వ్యాపారం నేర్పిన ప్రతివాడూ గురువే. అనుభవం ఒకగురువైతే ప్రపంచం పెద్ద గురువు.

ఇవాళ మన ఊరు అభివృద్ధి పథాన పయనిస్తోందంటే అందుక్కారణం మనమంతానూ మనందరి సమిష్టి కృషి ఫలితమిది. ఇదెలా సాధ్యమయింది? సొంతలాభం కొంతమానుకుని నలుగురికోసం సాయపడినందున ప్రతివారూ అలవర్చుకోవల్సిందిదే. ఇదెక్కణ్నుంచొస్తుంది? తృప్తిలోంచి వస్తుంది. దేనికైనా తృప్తి మూలం- ముఖ్యం. ఉన్నదానికి తృప్తిపడి లేని దానికి కృషి చెయ్యాలి. ఆ తృప్తి లోపించిననాడు ఏమీ చెయ్యలేం... సాధించలేం?

జీవిత పరమార్థం తెలుసుకోకుండా స్వార్థంతో, మితిమీరిన కాంక్షతో ప్రయత్నిస్తే, పరుగులు పెడితే జీవితంలో అతిముఖ్యమైనవెన్నో కోల్పోవలసి రావొచ్చు. ఆశకి అంతం వుండదు గాని జీవితానికుంటుంది. అది గుర్తించి మెలగటం అవసరం.

పచ్చని చెట్టులా బతకమని దీవిస్తారు పెద్దలు. ఎందుకు? చెట్టులోని ప్రతి భాగం మనకి ఉపయోగపడుతుంది గనుక. అలాగే మనమూ సమాజానికుపయోగపడినప్పుడే బతుకు సార్థకమవుతుంది. ప్రతివారూ చెట్టులా ఎదగాలి. ఎన్నో కొమ్మలు వెయ్యాలి. ఎందరికో ఆశ్రయమివ్వాలి. జనం దృష్టి ముఖ్యంగా యువకుల దృక్పథం ఈ కోణం నుంచి మొదలవ్వాలి.

ఇవాళ మన ఊరు పాడిపంటల్లో సౌభాగ్యంతో ఐకమత్యంతో తులతూగుతోందంటే అందుకు ప్రధాన కారణం- మన చైతన్యం. అది విద్య నుంచి, విజ్ఞానం నుంచి జనిస్తుందని మనం గ్రహించాలి. చైతన్యతరంగాలై యువత విజృంభిస్తే సాధించలేనిదేమీ ఉండదు. ఆ ప్రవాహపువడిలో అందర్నీ కలుపుకుని సాగితే అపజయమనేది వుండదు.

మానవశక్తి అజేయం. విశ్వభవన నిర్మాత ముమ్మాటికీ మానవుడే!

ఇక నేను ఉడతాభక్తిగా ఊరికేదో చెయ్యాలనుకున్నాను. నా శక్తిమేరకు చేశాను. ఇది ప్రారంభం మాత్రమేనని నాకు తెలుసు. దీన్ని యువతరం ముందుకు తీసుకుపోతారని నాకు తెలుసు. అందుకే నిశ్చింతగా మీ అందరి దగ్గరా శలవు తీసుకుంటున్నాను...''

ఆనందోద్వేగంతో ఊగిపోతూ జనం హర్షధ్వానాలకి జవాబుగా చేతులూపుతూ గుండెపట్టుకుని కూలబడిపోయారు మాస్టారు.

''మాస్టారూ... మాస్టారూ!'' ఆందోళనతో అరిచారంతా.

''మాస్టారికేం ఫర్లేదు... ఎవరూ తోసుకురాకండి. గాలి తగలనివ్వండి...''

అంపశయ్యమీద భీష్మాచార్యుడిలా శిష్యుల ఒడిలో ప్రశాంతంగా పడుకుని కళ్ళు మూసుకున్నారు మాస్టారు.

దీపిక ఇంజెక్షన్ చేస్తోంది. శివం గుండె రుద్దుతున్నాడు.

మాస్టారు కళ్ళు తెరిచారు.

ఏడవొద్దని భార్యకి సైగచేశారు.

''నాకేలోటూలేదు. హాయిగా, సంతోషంగా కన్నుమూస్తాను. పచ్చని ప్రకృతిలా నిత్యనూతనమైన ఉత్తేజకరమైన యువత దేశంలాంటి ఊరిని నందనవనం చేసింది. అలాగే ఊరులాంటి ప్రపంచాన్నీ చేస్తుందని నా ఆశ... నమ్మకం. ప్రపంచ ప్రజకి నావందనాలు చెప్పండి...''

మాస్టారు విపరీతంగా రొప్పుతున్నారు.

పరిస్థితి విషమించిందని తెలిసినా ప్రయత్నిస్తోంది డాక్టర్ దీపిక.

''మాస్టారూ... ఇంతకాలం మీరు మాస్టారుగానే మాకు తెలుసు. మీపేరు తెలుసుకోవాలనుంది... చెప్పరూ?'' శివం అర్థించాడు.

పసిపిల్లాడిలా నవ్వేరు మాస్టారు.

''మీ అందరిపేర్లూ నావే'' అనేసి తలవాల్చేశారు.







# చతుర ప్రపంచం

## పద్దెనిమిదేళ్లకే...

అరవై వసంతాలు పూర్తి చేసిన, తల పండిన మేధావులకే పద్మశ్రీ అవార్డులు దక్కుతాయని మనం అనుకుంటూ వుంటాం. కానీ, అది సాధించటానికి ప్రతిభ కావాలి గానీ వయసుతో నిమిత్తం లేదు. పద్మశ్రీ అవార్డును పద్దెనిమిదేళ్లకే గెలుచుకుని 'గ్రాండ్ మాస్టర్' టైటిల్ని కైవసం చేసుకున్నాడు విశ్వనాథన్ ఆనంద్.

చెస్‌లో గ్రాండ్ మాస్టర్ టైటిల్ని పొందటం అంటే ఆషా మాషీ కాదు. కోయంబత్తూరు శక్తి ఫైనాన్స్ గ్రూప్ వారు నిర్వహించిన "గ్రాండ్ మాస్టర్ చెస్ టోర్నమెంట్"లో 11వ రౌండ్‌కల్లా ఆనంద్9.5 పాయింట్లు సాధించాడు. 12వ రౌండ్ ఆట 28 డిసెంబరునాడు జరిగినపుడు హంగేరీకి చెందిన పీటర్ లూకాస్‌కి రేటింగ్ పాయింట్ 2520 ఉండగా, అతనితోతలపడిన ఆనంద్‌కి 2505మాత్రమే ఉంది. అయినా లూకాస్ ఎలాగూ తనకు ఓటమి తప్పదని భావించే ఆటలో నుండి తప్పుకోగా ఆనంద్ నెగ్గినట్టు ప్రకటించారు. మర్నాడు సోవియట్ గ్రాండ్ మాస్టర్ జెనెడీ జ్యేచిట్ నెదుర్కొన్న ఆనంద్ 10.5 పాయింట్ల స్కోర్ చేశాడు. దాంతో గ్రాండ్ మాస్టర్ బిరుదూ, 25 వేల రూపాయల నగదూ బహుమతిగా పొందాడు.



గత సంవత్సరం ఆగస్టులో ఫిలిప్పైన్స్‌లో వరల్డ్ జూనియర్ చెస్ గ్రాండ్ మాస్టర్ టైటిల్‌ని కైవసం చేసుకున్నాడు. ఆ రోజు ఆనంద్ 12 మంది అంతర్జాతీయ మాస్టర్లను పోటీలో ఢీకొన్నాడు. ఈ రౌండ్ గెలిచాకే ఆనంద్ అంతర్జాతీయ స్థాయి రౌండ్లలో పాల్గొనే అర్హత సంపాదించాడు. ఢిల్లీలో జరిగిన భిల్వారా చెస్ టోర్నమెంట్‌లో మొదటి హర్డిల్‌ని సాధించాడు. దాని తరువాత మరొక్క అంతర్జాతీయ టోర్నమెంటులో గెలిస్తే గ్రాండ్ మాస్టర్ టైటిల్ లభిస్తుందన్నమాట. అనుకున్నదానికంటే ముందే చెస్ టోర్నమెంట్ జరగటంతో గ్రాండ్ మాస్టర్ టైటిల్ శీఘ్రమే వరించింది ఆనంద్‌ని. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన క్రీడాకారులందరూ మనస్ఫూర్తిగా ఆనంద్‌ని అభినందించారు. ఆశీర్వదించారు.

మద్రాస్ లయోలా కాలేజీలో బి.కాం. ప్రథమ సంవత్సరం చదువుతున్న ఆనంద్ 1969 డిశంబర్ 11న జన్మించాడు. అతని తండ్రి విశ్వనాథన్ దక్షిణ రైల్వేస్‌లో జనరల్ మేనేజర్‌గా పనిచేసి రిటైరయ్యారు.

## లీప్ కథలు

1988లీప్ సంవత్సరం. లీప్ సంవత్సరంలో ఫిబ్రవరి నెలకు 28కి బదులు 29 రోజులుంటాయి. 1988ని 4 చే భాగిస్తే శేషం మిగలదు. అలా నిశ్శేషంగా భాగింపబడే సంఖ్యగల సంవత్సరమే లీప్ సంవత్సరం. లీప్ సంవత్సరానికి రోజులు 366 అని



చతుర... 127



మనకు తెలును.

గతంలో లీప్ సంవత్సరం సందర్భంగా ఎన్నో ఆసక్తికరమైన ఉదంతాలు జరిగేయి. స్కాట్లాండులో 1288లో ఒక విచిత్రమైన శాసనం అమలులో వుండేది. లీప్ సంవత్సరం ఫిబ్రవరి 29న ఏ మహిళైనా తనని పెళ్లాడమని ఏ మగాణ్ణి కోరినా అతడు నిరాకరించటానికి వీల్లేదు. అలా చేస్తే ప్రభుత్వం అతణ్ణి దోషిగా భావించి శిక్షించటం జరిగేది.

ఫ్రాన్స్‌లో 4,5 దశాబ్దాల క్రితం ఆహార పదార్థాలను పౌరులకు రేషన్ కార్డుమీద ఏ రోజుకి ఆరోజే సరఫరా చేసేవారు. 1944 లీప్ సంవత్సరం అని మరిచిపోయిన అధికారులు ఫిబ్రవరి నెల కోటాను 28 రోజులకే సరఫరా చేసారు. 29వ తేదీన కార్డు పట్టుకుని షాపుకెళితే రేషన్ లేదు. జనం ఆ రోజంతా పస్తులున్నారు.

1959లీప్ సంవత్సరం కాదు. ఆ సంవత్సరం అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన 'యేల్' యూనివర్సిటీ వారు ఓ ఖరీదైన, చాలా ఆకర్షణీయమైన కేలండర్ ముద్రించి దాని వెల 1.25 డాలర్లుగా నిర్ణయించారు. వింతేమిటంటే ఆ కేలండర్‌లో ఫిబ్రవరి నెలకు 31 రోజులుండటం! అదొక సంచలనం సృష్టించింది. కొందరు ఆ ఉదంతం జ్ఞాపకార్థం ఆ కేలండర్లు ఎగబడి కొనుక్కుని మరీ దాచుకున్నారు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రెసిడెంట్ ఎన్నికలు లీప్ సంవత్సరంలోనే జరగటం విశేషం.

లీప్ సంవత్సరం అంటే ఫైనాన్స్ మినిస్టర్లకి మహా యిష్టం. ఈ ఒక్కరోజు అదనంగా వుండటం వలన ప్రభుత్వాలకి కొన్ని కోట్ల రూపాయలు అధికంగా సమకూరటమే వీరి ఆనందానికి కారణం!

## టాక్సీ! ఓ టాక్సీ!!

జనాన్ని గమ్యం చేరవేయటానికి టాక్సీలూ, ఆటోలూ, రిక్షాలూ, బస్సులూ ప్రధాన పాత్ర వహిస్తాయని మనకి తెలును. కారు కనుగొన్న కొన్నేళ్లకి టాక్సీలు వాడుకలోకి వచ్చాయి.

పూర్వం ఒక చేత్తో నడిపే రిక్షాలూ, సైకిళ్లూ అద్దెకిచ్చేవారు. తమ ప్రయాణ సౌలభ్యం కోసం బ్రిటన్‌కి చెందిన ధనికులు కారుని అద్దెకిచ్చి నడిపించాలని ప్రతిపాదించటంతో



19వ శతాబ్దం నుండి టాక్సీ సిస్టమ్ అమలు లోకి వచ్చింది.

టాక్సీని మొదట్లో టాక్సీ మీటర్ క్యాబ్'అని పిలిచేవారు. క్రమంగా అది జనం నోళ్లలో నలిగి టాక్సాకాబ్‌గా మారింది. దాన్ని మరీ క్లుప్తీకరించి టాక్సీ అనో, కాబ్ అనో పిలుస్తున్నా మన దేశంలో మాత్రం టాక్సీగానే ప్రసిద్ధి పొందింది.

1888లో లండన్‌లో మొదటిసారిగా టాక్సీలు తిరిగాయి. తొలిసారిగా టాక్సీని స్మిత్ కూర్గ్ అనే డ్రైవర్ లండన్‌లో నడిపాడు. ఆ రోజుల్లో టాక్సీలకి మీటర్ వుండేది కాదు. తన కిష్టం వచ్చిన రేటు టాక్సీ డ్రైవర్ చెప్పేవాడు. ఈ పద్ధతి వల్ల ప్రయాణీకులకీ, టాక్సీ డ్రైవర్లకి తగాదాలు రాసాగాయి. వీటిని అరికట్టడానికీ జర్మన్‌కి చెందిన డబ్ల్యూ.జి. బ్రూకన్ మీటరింగ్ కనిపెట్టాడు. 1898లో అన్ని టాక్సీల్లోనూ ఈ మీటర్లను బిగించారు. 1898లోనే మీటరింగ్ టాక్సీ సిస్టం ప్రారంభమైంది. 1898 వరకు టాక్సీలు అమెరికాలోనూ లేవు. ఆ రోజుల్లో టాక్సీని గుర్తించడానికి టాక్సీపై 'ఫ్రెయి' అనే బోర్డు కట్టేవారు. ఎర్రజండా టాక్సీపై ఎగిరేది. 'ఫ్రెయి' క్రమంగా 'ఫర్‌హైర్' (అద్దెకి)గా మారింది.

పారిస్‌లో టాక్సీలు 1896నుండి తిరుగుతున్నాయి. ఫ్రెంచ్ ప్రభుత్వం టాక్సీ డ్రైవర్లు విధిగా యూనీఫాం ధరించాలనే నియమం విధించింది. ప్రస్తుతం ఈ నియమం యావత్ప్రపంచానికీ ప్రాకింది. 1897లో అన్ని టాక్సీలకూ పసుపురంగు తప్పకుండా వుండాలని నిర్ణయించారు. 1914లో యుద్ధావసరాల కోసం 29560టాక్సీల్ని ఫ్రెంచ్ ఆర్మీ వాడుకొంది.

మెక్సికోలో నిత్యం అరవై వేల టాక్సీలు తిరుగుతుంటాయి. అక్కడి టాక్సీల్లో కొన్ని మినీబస్సుల్లా వుంటాయి. 1981లో లండన్‌లో 38 ఏళ్ల గిలార్డ్ హెన్స్ ఒకే ఒక టాక్సీని 75 వేల కిలోమీటర్ల దూరం 10 దేశాలు చుట్టి నడిపించి రికార్డు సృష్టించాడు.

మాంచెస్టర్‌కు చెందిన ఫ్రాన్సిస్ ఎడ్వర్డ్ 57 ఏళ్లుగా టాక్సీ నడిపి ఇటీవలే విశ్రాంతి తీసుకుంటున్నాడు. ★




"నా ఒంటిమీద చెయ్యేశావో నీ రక్తం కళ్లచూస్తాను. ఫో... వెళ్లిపో దరిద్రుడా!"నాజీవితంలో శనిలా ప్రవేశించావు" రౌద్రంగా అంది సీత.

"అయ్యా కోటేశ్వర్రావుగారూ! ఇట్లా మా ఇంట్లో సీన్లు క్రియేట్ చెయ్యడం నాకేం బాగాలేదు- మీరెళ్లండి" అన్నాడు మోహన్రావు.

"ఏమిటయ్యా- నువ్వు చెప్పేది. నా భార్యతో నేను మాట్లాడు తోంటే, మధ్య నీకేమిటి?" కళ్లెర్రజేస్తూ అన్నాడు కోటేశ్వర్రావు.

"ఆమె నీ భార్య కానంటోంది. భార్య, భార్యని పదిసార్లంటే నీ భార్యయి పోతుందా? తరువాత మాట్లాడుకోవచ్చు... ఇప్పటికి మీరె ళ్లండి." అన్నాడు మోహన్రావు.

-ఇంతకీ వాళ్లసలు భార్యాభర్తలేనా? భార్యాభర్తలే అయితే తాళిక ట్టిన భర్తను నువ్వు నా భర్తవుకాదు పొమ్మనే పరిస్థితి ఆ భార్యకెలా ఎదురయ్యింది?

**కాకాని చక్రపాణి, వి. నాగరత్నకుమారిల** రచన

**'వేగుచుక్క'** ఆగస్ట్ 'చతుర'లో చదివి తెలుసుకోండి.

# చతుర

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD /40